# భారతి ఇరువదియారవ సంపుటము, భా-౧

## అకారాది విషయ సూచిక




TELUGU ACADEMY



సర్వధారి సం.
మాఘము

# భారతి

సంపుటము 26
సంచిక 2

# అంజలి

శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

సమసిపోలేదు ఘోరముగ ప్రేల్చిన గుండ్ల కర్కశధ్వను లింక గాలిలోన
తడియారలేదు నేత్రముల నింకను నాటి దుర్ఘటనన్ విన్న దుఃఖభరము
తేరుకోలే దింక దారుణంబగు భవన్మరణంబు విని క్రుంగు మామెడంద
వీడలే దింక మావీనుల త్వద్భక్తి మహితమౌ రామనామస్మరణము
పాయనేలేదు నీయట్టి భవ్యమూర్తి - మరణమందునా యను ననుమాన మింక
కాలచక్రంబు వేగంబుగా భ్రమింప - తిరిగివచ్చిన దొక్క వత్సరము నేడు.

తొలగించినావు హిందూమతౌన్నత్యవిదారకం బస్పృశ్యతాదురితము
రప్పించినావు ధైర్యము జెప్పి మన యసూర్యంపశ్యలను కార్యరంగమునకు
సంధించినావు పాశ్చాత్యప్రభుత్వపు దాసులలోన స్వాతంత్ర్యదీక్ష
మెలగించినావు లోకులలోన మతజాతివిద్వేషము లవెల్ల వీడునట్లు
ఇదియు నదియును అననేల యిక్కు డున్న - యీ స్వతంత్రత యెల్ల నీ విడిన భిక్ష
చంపుకొనె నిట్టి నిన్ కృతజ్ఞతకు బదులు - భారతీయుల యేనాటి పాపఫలమొ.

సైచి రొక్కొకమారు సాయుధభటుల లాటీదెబ్బలను నెత్తుటేర్లు పార
క్రమ్మి రొక్కొకమారు మంచినీరును లేక భయదకారాగృహాభ్యంతరముల

నుకికి రొమ్మొగ్గకమారు కరకుతుపాకీల గుండ్లనైనను నెదుర్కొనెడు పటిమ
విడిచి రొమ్మొగ్గకమారు వెలలేని సంపదల్ భవనంబులును గడ్డిపరకవోలె
సత్యవాక్పాలనం బహింసావ్రతంబు - నాయుధంబులుగాఁగ నిన్ననుసరించి
శాంతిసమరంబు సాగించి జయముపొంద నీమహత్త్వంబు మాకు వర్ణింపదరమె?

పలికిన పలుకులో తులతూగె నుపనిషద్బోధనాత్మకసుధాపూరగరిమ
చూచిన చూపులో సువ్యక్తమయ్యె నిష్కల్మషప్రేమప్రసారమహిమ
తలచిన తలపులో నొలికె సమస్తసర్వంసహాజనకల్యాణకాంక్ష
చేసిన చేతలో భాసించె బహుమతసారాత్మకం బహింసాదీక్ష
బ్రతికినంతకాలమ్ము శ్రీరామనామ-భవ్యచింతనాయత్తసుస్వాంతుఁడ వయి
“రామ, రామా” యటంచు నే ప్రాణములను-బాసిన మహాత్మ నీఆత్మ బడయు శాంతి.

ఒకచెంప గొట్ట వేరొక చెంప జూపుటే ఘనతగా భావించు క్రైస్తు వీవు
ధర్మంబులకు నెల్ల ధరణి నహింస యుత్తమధర్మ మనిన గౌతముఁడ వీవు
ప్రతిఫలాపేక్షభావము లేక త్యాగంబు లొనరించు మను కర్మయోగి వీవు
అతినీచులుగ నెంచు హరిజనుల్ సోదరు లని చెప్ప పతితపావనుఁడ వీవు
ధర్మసంస్థాపనార్థమై ధరణి యుగయుగంబు నుదయింతు నన్న వాక్యంబు నిజము
పౌనరుపం బుట్టు శ్రీవిష్ణుమూర్తి వీవు-దివ్యశాంతిస్వరూప గాంధీమహాత్మ!



# తెలంగాణము - భాషావిశేషములు

●

శ్రీ ఓగిరాల సుబ్బారావు

"వ్యావహారికభాషలోని శబ్దములకు వ్యవహారమే ప్రమాణము. వినగానే తెలిసేటట్టు అనిన మాటలు మనుష్యులు తమ మనోభావములను ఒకరి కొకరు తెలియబరచుకొనుటకు సాధనముగా లోకములో వాడుకొంటారు. దేశభాష అనేది అట్టి సాధకమే. అనేక కారణములచేత ఈ సాధనము మారడము సాజమే" అని కీ. శే. గిడుగు రామమూర్తి పంతులుగారు ఒక వ్యాసమున సెలవిచ్చి ఉండిరి. ఈ వాక్యములో అక్షరమక్షరమూ సత్యము.

పూర్వకాలమున ఆంధ్రదేశమంతయు రాజ్యవ్యవస్థలనుబట్టి పెద్దపెద్ద రాష్ట్రములు, మండలములు, నాడులుగా విభాగింపబడి ఉండినప్పటికీ, వ్యావహారికాంధ్రముమట్టుకు ఆయా ప్రాంతములందు గల సహజ వాతావరణములకు లోనైనకొలది భేదములు గలిగియు, ఐక్యతమాత్రము గలిగి ఉండినట్లు పరిశోధకులకు తెలుస్తుంది. అట్లే కావ్యభాషకూడ. "కావ్యములలో కొంత భాగము వ్యావహారికములోనిదే." కా దట్లు?

పరరాజుల ప్రాబల్యము బలీయమైనకొలది, వారి భాషల ప్రభావము మన దేశభాషపై తీరని దెబ్బ తీసినది. ఈ దెబ్బతో ఆయామండలములలోని భాష కూడ అనివార్యముగా కొంచెం ఎక్కువ తక్కువ మారవలసివచ్చింది. ఈ మార్పు క్రమక్రమంగా "ప్రామాణిక భాష"అని, "మాండలిక భాష"లని రెండు పొరలను కల్పించింది. ఈ పొరలవల్ల నేడు ప్రాంతీయభాషలు "కృతక భాషలు" అను విమర్శను బయలుదేరింది. "టేఢీ,టేఢీ జబాన్ తెలంగీ"అంటూ, ఇన్నాళ్లనుండి తెలంగాణాంధ్రుల ప్రతిభ, విజ్ఞానమును, వికాసమును, భాషను, స్వాతంత్ర్యమును — వేయేల, అన్ని జాతీయశక్తులను పీల్చి పిప్పిచేసిన రాజసంబంధ వర్గమువారు పరిహసింపసాగిరని ఇప్పుడు ధైర్యముగా చెప్పికొనగల్గితిని.

భాష సజీవమై ఉండినచే జాతి సచేతనమై ఉండును. "జాతి జీవించియున్న దనుటకు భాషయే తార్కాణము. జగత్తంతయు భాషాప్రణవమున నిమిడియున్నది."

అట్లు మహాంధ్రమునుండి చీలికకు పాల్పడి, శతాబ్దములు గడచుటచేత, తెలంగాణమున నాగరకతాభివృద్ధికి హిమాలయమంత అడ్డు ప్రాప్తించింది. రాజభాషయొక్క నిరంకుశప్రభావము ఆంధ్రభాషపై క్రూరపుదాడులు ఎడతెగక సల్పి దాని రూపురేఖలు చాలవరకు చెరిచివేసింది. అట్లు చెడియు, తెలంగాణాంధ్రము వ్యావహారికముగా గల నిజదేశీయసంప్రదాయస్థితియందును, గ్రాంథికముగా గల పూర్వ వాఙ్మయప్రశస్తియందును కొంత ఐక్యత కలిగి, అన్యదేశ్యముగాక, దేశ్యమైన 'ప్రాదెలుగు'రూపముగా నిలబడి ఉన్నది. అపరిమిత ప్రాకృతభాషాభూయిష్ఠమైన నేటి తెలుగునాటి తెలుగునుండు "పశ్చిమాంధ్రదేశీయము అచ్చతెలంగాణపు 'ప్రాదెలుగు' ఈనాడు క్రొత్తగా అగుపడుటలో వింత లేదు. అది "ప్రామాణికము" కావచ్చును; ఇది "అప్రామాణికము" కావచ్చును. "రాజరాజు రాజధాని 'రాజమహేంద్రపురమే' నేటి రాజమహేంద్రవరమన్నట్లు ఆనాటి తెలుగుభాషే ఈనాటి తెలుగున్నా అని అంటే సూక్ష్మదృష్టిలేని లోకులు" నమ్మవచ్చును. "రాజరాజు గూఢచారులకైనా పోల్చుకొనుటకు శక్యము కాకుండా అతని రాజధాని మారిపోయి నేటి నగరమయి ఉన్నది...రాజరాజునాటి తెలుగుభాష రానురాను మారి, నన్నయభట్టుకైనా బోధపడనట్టి నేటి వ్యవహారమం దున్నది"

అను కే. శే. రామశాస్త్రిపంతులుగారి దివ్యవచనములు విస్మరింపరానివి.

నాలుగుచేతులుగా ఉన్న భాష కలగలుపు దనముచేతనే అఖండమై, విశాలమై, జాతైక్యకతను, పునర్వికాసమునకు పునాది అవుతుంది. బ్రాహ్మణుల నాడీభేదములట్లు, పురుషార్థప్రదాయిని అను భాషలో మాండలికము లను పొరలు కలుగగూడదు. ఒకరి భాషలోని మరుగులు ఒకరు అర్థముచేసికోవలెను. అందుకు సాధకము ఆ యామాండలికపదములను అర్థవివరణములతో, వీలైనచో తగుకావ్యప్రమాణములతో, వాడుక వాక్యముల ఉదాహరణములతో ప్రకటింపవలయును. అప్పుడవి కవిపండితపరిశోధకుల విమర్శకు వచ్చును. అజరామరముగా, సాధురూపములు స్వపరభేదరహితములై అందరికి తెలిసి ప్రయోగార్హములు కాగలవు. భాషకు పునః ఏకకుటుంబత్వము, పరిపూర్ణత్వము, 'ఆంధ్రవిజ్ఞానసర్వస్వము' సిద్ధించును. ఈ నిర్మాణకార్యమునకు యావదాంధ్రదేశమందలి భాషాజిజ్ఞాసువు లెల్లరు పూనుకొనవలసియున్నది. మాండలికపదజాలమును సేకరించుట సునాయాసము కాదు. పామరజనులతో సంభాషించుటవలనను పెక్కు వింతవింత పదములు, కావ్యప్రమాణము గల ప్రాతిమరుగుపదములు, శాస్త్రములు, సామెతలు, నుడికారపదములు, వేనవేలు దొరకగలవు. ఇందు నేను చేసిన కృషి ఇది—

* * * *

[నన్నయ భారతమునుండి]

## 'అవ్వా!' - ఓచిన్నదానా!

"అవ్వా! నీప్రశ్నంబునకు నుత్తరం బయ్యెడిశక్తి యుండు జెప్పవలయు..."అని శాంతనవుడు ద్రౌపదిని సంబోధించిపలుకును. (సభా. ౨-౨౪౫)

తెలంగాణములో ఇది పురాతనపు పేరెంటు పదము. 'తల్లీ' యని యర్థము. విశేషముగా పరస్త్రీలను పురుషులు పేరు తెలిసియు తెలియకయు 'అవ్వా, ఓ యవ్వ' అని సంబోధించుట నాటికి నూరుపాళ్లు ఇక్కడి అలవాటు. ఈ సంబోధనమునందు కుల వర్ణ వివక్ష లేదు. బ్రాహ్మణుడు హరిజనస్త్రీని సహితము సంబోధించును. ఇది మానవగౌరవార్థముగా ప్రయోగింపబడుచున్నదిచ్చట. చాకలవ్వ, మంగలవ్వ ఇత్యాదులును గలవు.

## ఎఱుక లేక — తెలియక

"నీవు నిత్యంబు వృద్ధోపసేవ జేసి
యెఱుగు పెల్లధర్మంబులు నెఱుక లేక
కడగి నీ కెగ్గు సేసె నా కొడుకు..."
(సభా. ౨-౨౬౫)

## ఎఱుకపడదు (ఆ. ౨-౧౩౫)

ఇదియును పై పదమువలెనే పేరెంటు. తెలియుట అను నర్థమున నీపదము తప్ప అన్యపదమే వాడరు. "ఎఱుక లేదు, నా కేమెఱుక (ర్కా), ఎఱుకపడదు, ఎవనికెర్కా, ఎఱుక లేకుంటే మఱివ్వకుండు" ఇత్యాదులు. అచలవేదాంతోత్పత్తికి స్థానము హైదరాబాదు శివరామదీక్షిత గురుపీఠము. శివరామదీక్షితులు మాయ, జ్ఞానము, ప్రకృతి ఈ యర్థములందు 'ఎఱుకను' స్థాపించెను. 'పరిపూర్ణము పరబ్రహ్మము' అను పరవస్తువునకు 'అచలము' అను పదమును స్వీకరించెను. అచలవేదాంతమిా 'నెఱుకాచలము'లతో నిండి హైదరాబాదునుండి యావదాంధ్రదేశమున వ్యాపించియున్నది. 'అచలమే' బయలు. ఇది 'బట్టబయలు' అని కూడా.

## కల్లు-పాషాణము, రాయి

'ఓరుగల్లు'కు 'కల్లు'కు ప్రమాణము. 'కల్లు' అంతమునందుగల గ్రామనామములు తెలంగాణమున తప్ప వేరు ప్రాంతములందు లేవు. బోనకల్లు, మదగల్లు, పానగల్లు, ఒరంగల్లు మొదలైనవి.

'కల్లు' ప్రయోగమే నన్నయ్యది. అర్థముకూడ తూచినట్లున్నది. నన్నయ్య వ్రాసిన 'కల్లు' అర్థముగాక లేఖకులో, పరిష్కర్తలో 'కండ్లుగా' దిద్దిరి. కల్లు కొత్త; దాల్లొత్తుకుపోతూ.

## నిద్రదగిలి—నిద్రకు వశుడై

"నేల గండ్లుగొత్త నిద్రపోయినయట్టి
తల్లిం గెడి నిద్రదగిలి సుతులు." (ఆది. ౬-౧౪౯)
"కంటవసులు" (ఆది. ౨-౧౬౫)

"కల్లు లొత్త - తా ల్లొత్తుకపోతూ"

"నిద్రాతురాణాం న సుఖం న నిద్రా"

"అప్పటినుంచి ఆటలాడింది. తినగానే నిద్రకు దగిలింది." మొదలగునవి విశేషవ్యవహారమునందు గలవు.

## కావుట - అగుట

"వేదు నిహానుంబరంబునిది సిద్ధము గావు టెఱింగి భక్తి" (ఆది. ౧-౧౩౯)

'కావుటం' అని తుదిని పూర్ణబిందు యుక్తముగా వ్యవహారము. "పెండ్లి కావుటం, చదు విడుసుటం, బుద్ధి మందమైపోవుటం అయింది." దీని వ్యవహారము విశేషము. ఇట్టివే "నూకుటం, కొట్టుటం, తినుటం" ఇత్యాదులు.

## పొంటె - కొఱకు, నిమిత్తము

"అఖిల లోకహితంబు పొంటె"

(ఆది. ౨-౧౮౫)

"పెక్కుండ్రపొంటె" (తిక్కన అను. ౨-౬౫)

ఈ పదము తుది 'ఎ' కారమునకు 'ఇ' కారముతో పొంటి అని అర్థభేదముగా వాడుక గలదు. అనగా, పొంటి = గుండా, మీదుగా, వెంబడి. ఈ అర్థములందు దీనిని వ్యస్తముగా వాడరు. "ఆ సందు పొంటి, ఆచేనిపొంటి, ఆ ఊరుపొంటి."

## ఎట వోయెదు - ఎక్కడికి పోవుదువు?

"మునీంద్రా! యెటవోయె దేమి కార్యంబున."

(ఆది. ౨-౧౮౮)

"ఏడ బోయెదు" అని అనుశాసనికము.

"ఎటు పోతావు, ఏడ బోతావు; అటు పో, అడ బో; ఇటు రా, ఈడ రా" అని నన్నయ తిక్కన ప్రయోగాలు రెంటిని సమానార్థకములుగా పర్యాయముగా వాడుచుందురు. అడ, ఈడ, ఏడ - ఈ త్రికము తెలంగాణమునకు ప్రత్యేకములవంటివి; అటు, ఇటు, ఎటు పర్యాయపదములుగా విశేష వ్యవహారమున వచ్చుచుండును. ఇక్కడి వాడుక తెలియక, ఈ వైకృకములను అప్పకవి గ్రామ్యములన్నాడు. కాని ఇవి గ్రామ్యములు కావు. శుద్ధదేశ్యములు; ప్రాఁదెలుగులు.

తొమ్మన్నూట (వ. ౩౬); మున్నూట (వ. ౩౩); తొమ్మన్నూటతొంబది (వ. ౪౩); నన్నూట, ఎనమన్నూట (౫౩); ఏడునూట (౫౫) ఇన్నూఱు (౬౫)

(భార. ఆది. ౧ ఆ.)

అచ్చముగా ఈ ప్రయోగములే ఇంచుక వర్ణక్రమభేదముతో నాటికి నూరుపాళ్లు ఇక్కడి వ్యవహారమందున్నవి. నూఱులో శకటరేఫధ్వని ఉచ్చారణలో వినబడును. 'నూఱు' ప్రాచీనము; 'వంద' అర్వాచీనము. 'వంద' పదమును ఇక్కడి తెలుగునాటి ఆంధ్రులు వాడుదురే గాని తెలంగాణమువారు వాడరు.

"స్వస్తి శకాబ్దంబుల్ తొభన్నూటానల్వాది" అని క్రీ. శ. ౧౦౧౯ నాటి (శకసం. ౯౪౦) ఏకువాడల పాలెపుశాసనము ఇప్పటికి, అప్పుడుకూడ తెలంగాణపు తెలుగువారు ౯౪౦ సంఖ్యను ఎట్లుచ్చరించుచు వచ్చుచున్నదో చూపుటకిది ప్రబల ప్రాచీనప్రమాణము. "వ్యావహారికమునకు వ్యావహారికమే ప్రమాణ"మని గిడుగు రామమూర్తిపంతులుగారు చెప్పినది దివ్యవాక్యమని ఇది ఋజువుచేయగలదు. ఈశాసనము రాజరాజు తండ్రి విమలాదిత్యుని నాటిది.

'నూటా'లోని దీర్ఘము ఈ ప్రాంతపు టుచ్చారణమందలి దీర్ఘ స్వభావ సూచకము. "దినము-దినాము; కొనకు-కొనాకు; నూట నలువది - నూటానల్వాది" ఇత్యాదులు గమనింపవలెను. నన్నయ తనకు పూర్వపు వ్యావహారికపదములను ఎట్లు మార్చివేసినాడో చూపుటకిది చక్కని ప్రమాణము కాగలదు. లేక నన్నయ ప్రయోగము పూర్వవతుగానే ఉంచి, తర్వాతివారు ఇప్పటి రూపముగా దిద్దినారో!

## లావు - బలము, శక్తి

"నీ విజయోత్సాహమునకు
లావునకు జవంబునకును..." (ఆది. ౨-౧౦౬)

ఇది అర్థభేదములతో "చాల, మహా, పొగరు, గర్వము" అను నర్థవిశేషములందు మాత్రము అనేక

ముగా వాడబడుచున్నది ఉదా: "ఏం లావెక్కు త్తున్నావురా? నెత్తి తిగ్గలోందారా?" "ఏమేమో లావు ముచ్చట్లు పెడ్తున్నాడురా పిల్లగాడు."

### పొత్తు—స్నేహము

పొత్తొల్లను—స్నేహ మక్కర లేదు; స్నేహము ఇష్టము లేదు. (ఆది. ౨-౧౭౬,౧౪౪,౧౬౧)

ఈ యర్థమునందే సరిగా ఈ పదములు వాడుకలో గలవు. ఉదా: "ఈవరదాంక వాని పొత్తులో బేహారం జేసినా. వాని మన్సులో కపటం వచ్చింది. ఇక వాని పొత్తొల్లె. ఎవని పొత్తేమిటికి వాడు? నాతాన పైస లేదా? దుకాణం పాగిస్తా."

"వాడాపిల్ల నొల్లడట" అని తెలుగువాటివా రందరని జ్ఞాపకము.

### మొగి-పూనిక, మొత్తము

"ఒక్క మొగిని" (ఆది. ౨-౧౩౧)

"మన హిందూఫౌజంతా అదినం తెల్లారే కజేళ కల్లా నాల్గిక్కుల కేల వొక్క మొయి వొచ్చి పడ్డారట రజాకార్ల మీద." అని ఇట్లు 'మొగిని'కి 'మొయిని' రూపాంతరముగా వాడుక గలదు.

### ఏర్పడ

"నా కేర్పడ జెప్పుడీ." (ఆది. ౨-౧౪౨)

'ఏర్పడ' కు సమానార్థకముగా 'ఏర్పాటు' వాడుదురు. ఉదా: "నా కేర్పాటుగా జెప్పండ్రి. అట్ల చేస్తే యేదైనా మంచి రెడ్డ యొక్కయి తిది చెప్పు, నా బుద్ధి కేర్పాటయ్యేటట్టు మంచిగా." బహువచనార్థమున "చెప్పుడి, వినుడి, అనుడి, చదువుడి" ఇట్టి పదాల లోని 'డి' ని రేఫతో సంయుక్తముచేసి "చెప్పండ్రి, వినండ్రి, అనండ్రి, చదువుండ్రి" అని పలుకుదురు.

ఇట్లే రండ్రి - గాండ్రి, పోండ్రి - పోండ్రి; లేవుండ్రి, తినుండ్రి, పడుండ్రి మొ.

* * * *

### [తిక్కన భారతమునుండి]

### నూయి - బావి

నూయి-చేదబావి ; బావి-దిగుడుబావి, కోనేరు.

"నతజలపూరితంబులగు నూతులు నూరిటికంటె నూనృతవ్రత యొక బావి మేలు." (అను. ౪-౫౪)

ఈ పదమునందలి శాస్త్రము కొన్ని ప్రాంతములలో కలదు. కొన్ని ప్రాంతములందు రెండింటికి భేదము లేకుండ 'బావి'శబ్దమే వాడుకలో కలదు. మరి కొన్ని ప్రాంతములలో 'నూయి'కి చేదబావి అని, 'బావి'కి బావి, లేక మోటబావి అని వాడుక గలదు. నూయి, నుయ్యిపదముల వాడుక కొన్ని ప్రాంతములలో క్వచిత్తుగా గలదు.

### నెఱి - పూర్తి

మఱి, అత్యంతము అనికూడ అర్థము లున్నవి.

"ఏ సేమి తప్పుచేసితి గానవు నెఱినీవు..." (అను. ౧-౧౪)

అంతమున 'య' వర్ణమువచ్చిచేరి 'నెఱియ', లేక దీర్ఘాంతముగా 'నెఱియా' అని తిక్కన అర్థ మందే వాడుక గలదు. ఉదా: "నెఱియా వానిమాటలు యాదికొస్తే (జ్ఞప్తి) లావుదుఃఖమంటే దుఃఖమవుతది. పొల్లగాడు, పాపం బతెకవలసిదుండె."; "ఈ నడుమ నెఱియవానికీ నాకూ పడిరావుటం లేదు. (విరోధము) (పొల్లగాడు = పిల్లవాడు)

### సాల - చావడి, బడి

"పత్రంబు సాలయు జలిపందిరియు కొట్టము వచ్చుట..." (అను. ౨-౬౧)

అని తిక్కన దీనిని చావడి అను అర్థములో వాడినట్లున్నాడు. కాని తెలంగాణములో దీనిని (వీథి బడి) అనునర్థములో విశేషముగా వాడుదురు.

ఇది 'శాలా' శబ్దభవము. అక్షరాభ్యాసమప్పుడు 'బాలుని సాల్లో వేశాము' అందురు. "పోరగాణ్ణిసాలలో కెప్పు డె స్తాంరా? ఐదేం డ్లొచ్చినాయి గదా.!" అని అందురు. "పిల్లగాడు సరిగా సాల్లోకి వచ్చుటం లేదు." అనియు వాడుదురు. తిక్కనయు బడియర్థమునందే దీనిని వాడియుండును. చావడిలో నే కదా బడియుండునది!

## తెరువు—రీతి, మార్గము, జోలి

"సకలజనంబులు గర్మమునకు ననుగుణమైన తెరువునం బోగురు" (అను. ౧-౩౯.)

తిక్కన అర్థమందును, 'జోలి' (ప్రమేయము) అను నర్థమునందును సర్వసామాన్యముగా వాడుదురు. ఉదా: "వాడు చాల చెడుగు. వాని తెరువు బోవు కొడుక"; "వాడి తెరవు నీకు వద్దు"—"నా తెరువు కొస్తే నే నేమన్నా అంటా" "ఎవడి తెర్వు వాడిది" (ఎవడి తీరు వాడిది)

## ఇవుల, అవుల-ఇటు అటు

"ఇవుల నేడు పరంబుల నవుల నేడు తరము లను......" (అను. ౨-౧౧౦)

తిక్కన అర్థమునందే వాడుకలో కలదు. ఉదా: "మా యింటికి ఇవుల పోలీసుఠాణా, అవుల పోచమ్మగుడి, ఇది గుర్తుంచుకోండ్రి."

## నెలనాళ్లు-(అను. ౨-౮౩, ౮౫)

నెలనాళ్లు, నెలదినాలు, నెలరోజులు—ఈ మూడును ఆ యా జిల్లాలలో వాడుక గలవి.

## పగలు, మాపు (అను. ౨-౪౭)

"పగటికి మాపటికి మా యింటో తేరున్నర బియ్యము చాలు" అని వాడుక. 'రేపు మాపు అని కూడ కలదు" రెండును తరచుగా వినబడుచుండును.

## నగి-నవ్వి (అను. ౧-౨౨)

"నన్ను చూచి నగిండు," "ఎవరు నగినా వాని మాటే ఎంక రాతదిగాని నాకేం గాదు" "ఊకె నగుటం సుగ మంచిది కాదు" (సుగ=కూడ.)

'నవ్వు'కంటె 'నగు' పదమే విశేషముగా వాడుకలో గనిపించును.

సూచన:— హైవానిలో చాల పదములు తిరువాతి కావ్యములలోగూడ గనిపించుచున్నవి. విస్తరభీతిచే విడువబడినవి.

## [హరవిలాసమునుండి]

## అక్కడ—చోట, వద్ద, ఇంట

"మా అక్కడ వీరు నీ మునలి యన్వయము నేడు శివార్చనంబు సమ్యక్కృతి జేసి......" (అను. ౨-౪౩.)

ఇదే అర్థములో నిట వాడుదురు—"హైదరాబాదులో యిప్పు డన్నిక్కల్ల అమన్ ఖాయ మైంది."

అమన్ ఖాయమైంది=శాంతి స్థిరపడి "అచోటు" అను అర్థమున నది—"ఆడ" వాడుక.

## అట్లనే - అలాగే, మంచిది, అట్లే

"గ్రుడ్డియన్వయు పైత మట్లనే యర్పించి" (హర. ౨-౧౨౫)

"అట్లనే రేపు జగడాని కరుగుదెంచి" (కృ. రా. విజయము. ౩-౧౦౭)

అట్లనేగానీ! మరియిప్పుడే తొందరొచ్చింది?" "మంచి దట్లనే" యని.

## (౧) కొంచుబోయె-తీసికొనిపోయె.

"సర్వశేంద్రుండు నిర్విణ్ణభావమైన కూర్మినందననింటికి కొంచుబోయె"

## (౨) కొంటఁబోవు - కొనిపోవు

(దీక్షాబోధ, ౧-౪౦)

## (3) కొండబోయె, (౪) కొనఁబోయె

ఈ నాలుగుపదములు సమానార్థకములుగా తెలంగాణమున సుప్రసిద్ధము లైనవి.

మూడు, నాలుగు సంఖ్యలు గల పదములకు ప్రమాణములు వ్రాసిన కాయితము పోయినది.

"నీ కన్ని రూపాయలు గావాలో కొంటబో" "నీ వయ్యి కొనబోయి యిప్పుడే తెస్తా" 'వయ్యి' లేక 'వయ్యి' పుస్తకము. శ్రీనాథుని 'కొంచుబోయె' పద ప్రయోగములు చాల గలవు. ఇతర కవులవీ గలవు.

## అడాడ - అక్కడక్కడ

"నారికేళపాళికల నీడల జాడల
నాడాడం జా జూవ
(కృష్ణ. రా. వి. ౧-౨౬)

"ఆడాడ=ఎంత దేవులాడినా కలం దొర్కలేదు"

దేవులాడుట = వెదకుట

ఈవఅదనుక - ఇప్పటిదాఁక

"అప్ప! యీవరదనుక సింహాసనంబు భారము నృసింహరాయలవారు బూని"

(కృ. రా. విజయము)

"ఈ వరదాంక యీడనే వుండె. ఇంతట్లోకి పోల్లగాఁ డేమయిండో."

పోల్లగాడు = పిల్లవాడు

ఉఱుకు - పాఱిపోవు

(హర. 3-౮౬)

"ఒక్కవిధమున నది దాటి యుఱికి రవుడు"

"దబ దబ ఆసందుపొంటే వుఱికి పోయిండు పోఅడు."

పోఅడు = పిల్లవాడు ; పోఁతి = పిల్ల

* * * *

[నిరంకుశోపాఖ్యానమునుండి]

కొప్పెర - నీళ్ళకాగు

"కొప్పెరనీట జలక మార్చి" (౨-౮)

నీళ్లు కాచు కాగువంటి పాత్రకు కొప్పెర యందురు. నూనెకొప్పెరలుకూడ గలవు. 'కాగు' శబ్దము వాడుకలో లేదు.

ఇంతింతగాదు - చెప్పరాదు

"చదువ బాసంగ నింతింత చతుర గాదు వీణ వాయింప నింతింత జాణ గాదు" (అను. ౨-3౮)

"ఇక ఆ చక్కదనం, దాని ముచ్చట్లూ ఇంతింత గాదు వా"

"వా"=ఆశ్చర్యార్థకవర్ణము. అంతమందే వచ్చును.

"వచ్చిండు, వా, రాడనుకున్నా"

బాగాలు - పోకచూరబద్దలు (౨-౯2)

నీళ్ళు త్రాగినట్లు-మంచినీళ్ల ప్రాయము.

"మనుజనాథ కడమమంత్రంబు లాబ్రహ్మ రాక్షసునకు నీళ్ళు త్రాగినట్లు" (౮-౩౨)

"వాడికి పనంటె నీళ్ళ్ దాగినట్టే. ఇ దొక లెక్కనా"

చిందువందు చేయుట - పాడుచేయుట

"జనని చేయించిన జాగువాతారుతుల్
వడ్డిలెక్కకు జిందువందు జేసి" (౨-౧౧౬)

ఈయర్థమువందు తూతుబీగుచేయుట, పాపు చేయుట, క్రిందుమీదుచేయుట అను పదములుకూడ కలవు.

'తారుమారు' = క్రిందుమీదు.

చిన్నపనిగాదు - సామాన్యమైన పని కాదు

"చిన్నపని గాదు లంజర్క మన్న వినుము." (౨-౧౩౯)

"చిన్నపనా యిది! ఎవనిచేత నార్డి"

"చిన్నపనిగా లేదు చిన్నకతగా లేదు."

బిడ్డ — కూతురు

"పడమునవు నీవు మా బిడ్డ పసరు మెగ్గ"

(౨-౧౩౯)

"కూతురు" పద మిచట వాడరు. దానికి మారు "బిడ్డ" అని వాడుదురు. 'బిడ్డలు'—సంతానము అను నర్థమున వాడుక లేదు. నీకెందరు 'కొడుకులు బిడ్డలు' అనిమాత్రమే వాడుదురు.

"ఉండు బిడ్డా నీపని చెప్తా"

అని మందలించునపుడు పిల్లవానినికూడా అందురు.

బరిగాళ్లు - రొంగకాళ్ళు, రక్షలులేని కాళ్లు

"భరముపడు రాజు బరిగాళ్ళ పరవసాగ"

(౨-౧౮౦)

"బరిగా శ్లోక్కని యేంవుర్కి వావుర్కిండు వా!"

బరిబిత్తల = నగ్నముగా

గంటీలు

సోమయాజుల కర్ణకుండలములవంటి కర్ణాభరణములు. (౨-౧౧౬)

"గంటీలు కుదువబెట్టి, బియ్యం దెప్పిచ్చినా పల్లా దొంగతనంగా". కుదువబెట్టు - తాకట్టుపెట్టు.

ఊఁకొను-ఊరుకొను (౧-౩౦)

"ఊకోరాదే ? ఊకె యేమి వర్లతవు?"

వర్లుట = అఱచుట, అదేపనిగా మాటలాడుట.

కొ లు వు సే యు ట

ఊడిగము, లేక ఉద్యోగము చేయుట.

(భారతము, విరా. ౧-౯౦)

ఏ కచేరీలో పని చేసినను, ఏ బంట్రోతుపనిచేసినను "కొలువు" అందురు. "సర్కారికొలువు" అని వాడుక.

* * * *

[సారంగధర చరిత్రమునుండి]

చమురు వెళ్లు - కారు (౧ ౭౧)

నెత్తురు వెళ్లు - స్రవించు (౧-౯౮)

"పైమతి వెళ్లు నెత్తురులు."

కారు, స్రవించు అను అర్థములలో "వెళ్లు" పదము ప్రయోగింతురు. "సీకాయతో ఎంత రుద్దుకున్నా జంటికలకె ల్లింకా నూ నెళ్లుతోంది" "కాలిలో మొల దిగబడి నెత్తు రెళ్లింది." మొల= మేకు; దిగబడి=గ్రుచ్చుకొని.

సుద్దులు-సంగతులు, విషయములు, ముచ్చట్లు

"మించిపోయిన సుద్దుల నెంచ నేల ?"(౧-౪౮)

"ఎవని సుద్ది వానిది", "ఒకని సుద్దిలో నీ కేమి ముచ్చట? "ముచ్చట = అవసరము (ఇచట). సాధారణముగా 'ముచ్చట' విషయము, సంగతి అను నర్థములో విశేషముగా వాడుక.

గొర్లు-గొఱ్ఱెలు (౧-౯౨)

ఇట్లే బర్లు-గేదలు, దొర్లు-దొరువులు, చెర్లు-చెరువులు, చీర్లు = చీరెలు మొ. లుప్తరూపములు సంయుక్తముచేసి పల్కుదురు. సాధారణముగా అంత్యాక్షరము మీది వర్ణముతో సంయుక్తముచేసి పల్కుట ఈడ ఆచారము.

పదైదు ప్రొద్దులు-పదోఐదో దినములు

"ముందట గంచుకు లెచ్చరింప, కొంచుల నవలోకించి పదిరైదు ప్రొద్దులు నిలిచి." (౧-౧౬౫)

ఐదుప్రొద్దులు (భార. అను. ౧-౬౯)

'ప్రొద్దు' నకు 'ఒద్దు' కూడ పర్యాయముగా వాడుదురు. "ఎన్నొద్దు లయింది నీవాడి కేలి వొచ్చి."

"పదైదుపొద్దుల కిస్తా నీపైకం."

ప్రొద్దులు = ప్రసవ సమయపు రోజులు. "ఇప్పుడు పొద్దులే మా బిడ్డకు. నీళ్లు పోసుకొని అప్పుడే తొమ్మిదినెల్లు దాటి పదో నె లొచ్చింది కూడ." నీళ్లు పోసికొనుట=గర్భ మగుట. ముప్పొద్దులు (మూడు + ప్రొద్దులు) పదముకూడ కలదు.

చింపులు-గుడ్డపీలికలు, చింపిరిగుడ్డలు

"బట్టచింపులు" అని వాడుదురు. గుడ్డపీలికకు.

కంబడి-కంబళి (౧-౧౭౬)

అడ్డగా శ్లేయుట-విఘ్నముకలిగించుట, అడ్డుకల్గించుట.

"పోకు మని యడ్డగా శ్లేయుంగజ్."

"తీరా అంతా తయ్యారయ్యేటవఱకు నీతమ్ము డొచ్చి యేమో చెప్పి అడ్డకా శ్లేసిండు." అయ్యేటవఱకు = అగువఱకు.

# నన్నయ్యగారి 'కథాకలితార్థయుక్తి'

[శర్మిష్ఠ కథ]

●

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

మొన్నటి రజతోత్సవ సంచికలోని వ్యాసములో నన్నయ్యగారి యీ కథాకథనశక్తి బాహుళ్యము మీద చూడవలయు నన్నచో కద్రూవినతల కథ చిన్నది యగుట చేత చాలదు- శర్మిష్ఠ కథయో, నలచరిత్రమో చూడవలయునని వ్రాసితిని. ఇపుడా శర్మిష్ఠ కథనుగూర్చి వ్రాయుచున్నాను.

నన్నయ్యగారు కథను చెప్పికొని పోవుచు నడుమ ననేక విషయములను చొప్పించుచు పోవుచుందురు. అవి యన్నియు విడిగా చూచుకొనవలయును. ఇచ్చట నట్టి ప్రసన్నకథా కలితార్థయుక్తి మాత్రమే చెప్పబడును.

కథను ప్రసన్నము చేయుటకు నాయన యవలంబించుకొన్ని మార్గములు జాగ్రత్తగా పరిశీలింపవలయును. వచనము, పద్యము వీని రెంటెని వాడుటలో కథలో నున్న రమ్యత బహిర్గతమగునట్లు వాడు నని

అవిజ్ఞాతైః కైశ్చిత్ పరవిషయకావ్యప్రియమతి
ప్రసక్తైఖ్యః పూర్వాలంకృతికరణమార్గే వ్యచరితైః
యశో నన్నార్యస్య ప్రక్రియత కలుషీభూతః మధునా
పున స్సంజాతో౽హం కృతికలుషనిష్కాసనపటుః.

ప్రథుపదసునివిష్టైః నూన మజ్ఞాతపూర్వా
సుకవిభిరపి పూర్వైః కాళిదాసాదిభిశ్చ
మధురమధురవాణేః నన్నపార్యస్య గాథా
కథనపటు రపూర్వా శక్తి రుజ్జృంభతే సా.

తస్య ప్రతిభాలేశః సర్వేషా మాంధ్రసుకవికవితాశ్రీః
కథితా చేత్సా మహితా స నన్నభట్టః కిమాకారః ?
వాల్మీకి మథ నన్నార్యం త్యక్త్వా కవి రస్తి వా జగత్యన్యః,
శశిమౌళిపింఛమౌళీ త్యక్త్వా దేవో౽స్తి కో వా౽న్యః ?

అస్మిన్ కాలే బహుతరపరిభ్రాంతిసంమగ్నచేతాః
లోక స్సమ్యఙ్నయచరణాపేతశీలే నివిష్టః
భావై రస్యైశ్చ చరమదిశాంధోర్థధత్తై ర్గతదృష్టిః
కో వా తస్మిన్ ప్రభవతి పున ర్భాంజసా కల్పనాయ.

తత్రాపి ప్రయతే౽హం నన్నార్యస్య మహోగిరాం
కాలుష్యనిరాసార్థం సన్నామ్నా నిత్యతాం స్మరన్.

విశ్వనాథకులోద్భూతః సత్యనారాయణ కృతీ
సత్కవీనాం శిరోరత్నం వ్యాఖ్యాతౄణాం శిరోమణిః.

పూర్వైవ శ్లాఘనీకైః గుణాదివిభవం నిర్వర్ణ్యమానై ర్భృశం
నోక్తం ప్రాతిభ మజ్జ్వలద్బహుకథానిర్మాణనైపుణ్యకృత్
నన్నార్యస్య మహాకథాకథనమ ప్యజ్ఞాత మస్మై ర్బుధైః
వ్యాఖ్యాస్యామి తదత్ర సత్కవిజనాః ప్రీణంతు గాథావిదః.

యిదివరకే వ్రాసితిని. ఈ శర్మిష్ఠా దేవయానల కథను ప్రారంభించుచు వచనముతో ప్రారంభించెను. "ఇట వృషపర్వాసురు శర్మిష్ఠ యను కన్యక యొక్క నాడు కన్యకాసహస్ర పరివృతయై దేవయానీసహితంబు వనంబునకుం జని యొక్క సరోవరతీరంబున తమతమ పరిధానంబులు పెట్టి జలక్రీడ లాడుచున్నన్" — కథ యిట్లు మొదలు పెట్టెను. వచనముతో నారంభించెను. శర్మిష్ఠ రాచకూతురు. ఆమె వెంట కన్యకాసహస్రము నుండు, దేవయానియు నడచి పోవుట సహజమే. అందు విశేషము లేదు. ఈ విశేషము లేక పోవుటను సామాన్యముగా వచనములో నదే వ్రాసెను. కాని తరువాత శర్మిష్ఠ దేవయానికి దాసియగును. ఆమె కూడ శర్మిష్ఠతో కలసి వనమునకు విహారార్థము జనును. ఇది యసామాన్యస్థితి. పురోహితుని కూతురు రాజ్ఞీస్థానీయురాలైనది. రాచకూతురు

దాసి యైనది. ఈవిశేషస్థితిని దీపింపజేయుటకు పద్యమును వ్రాయుచున్నాడు.

"వనకేళీకౌతుకమున
జనియెను శర్మిష్ఠకొట్టి సఖులెల్ల ముదం
బున గొలిచి రాగ విభవము
తన కమరగ దేవయాని తద్వనమునకున్."

ఇందులో 'విభవము తన కమరగ' అని యిచట పద్యము వ్రాయుటలో నన్న విశేషముగాని పాఠకుని శ్రద్ధనుంచి తొలగకుండ నుపయోగించినాడు.

నన్నయ్యగారి శిల్పములో నిటువంటివి చాల సామాన్యము.

గాలి కొట్టి వారి చీరలు లుంగలుగా చుట్టుకొన్నవి. వారు "అన్యోన్యపరిధానంబులు వీడ్వడం గొని కట్టుసెడ దేవయానిపుట్టంబు శర్మిష్ఠ కట్టుకొనిన మఱి దాని పరిధానంబు దేవయాని పుచ్చుకొనక రోసి శర్మిష్ఠం జూచి యి ట్లనియె." ఇచట "అన్యోన్యపరిధానంబులు వీడ్వడం గొని"అని వ్రాయుటలో 'డా' క్రింద వావొత్తు గల యక్షరము వాడుటచేత వారి చీరలు లుంగలుపడి యెవరి చీర వారు తీసికొనుటలో పడిన కష్టము, తొందరయు స్ఫురించుచున్నది. ఇది యక్షరగతమైన రసధ్వని. వారు స్త్రీలు. వివస్త్రలై చెరువునందు స్నానము చేయుచున్నారు. చెరువు నొడ్డుకు వచ్చినంతనే చీరలు కట్టుకొనుట కెంత తొందర పడుదురో యా స్వభావమంతయు దీనియం దిమిడి యున్నది.

ఇట్లు కోపించిన దేవయాని శర్మిష్ఠతో నన్న మాట లొక్క కందపద్యములో నున్నవి. శర్మిష్ఠ చెప్పిన సమాధాన మింకొక కందపద్యము. "నాకట్టిన పుట్టంబు నీకుం గట్టంగాదుగా కేమి యని గర్వంబున నెగ్గులాడి దేవయాని నొక్క నూతం ద్రోచి శర్మిష్ఠ క్రమ్మరివచ్చి నిజనివాసంబున నుండె." వీరు చెరువులో స్నానమాడిరి. ఈ చెరువు నూతి కెంతదూరమున్నది? ఆ నూయి జలభరితమైనదియా ? పాడుపడిన నూయియా ? ఆ నూతిలో దేవయాని శర్మిష్ఠను ద్రోసినది. దేవయాని చనిపోవునా ? చనిపోదా ? చని పోరెండి స్థితిలో దేవయాని యున్నచో శర్మిష్ఠ యింటికి పోయి మాటాడకుండ తాను సుఖముగ నున్నదా ? ఆమె యంత నిర్దయురాలా ? ఇన్ని ప్రశ్నలు పుట్టుచున్నవి. ఆమె యొక మాట యన్నది. ఈమె యింకొక మాట యన్నది. ఇంతమాత్రమునకే శర్మిష్ఠ దేవయానిని నూతిలో త్రోయవలయునా ? ఇది యొక ప్రశ్న. దేవయాని శర్మిష్ఠచీరను కట్టుకొనక రోసినది. చివరకు కట్టుకొన్నదా ? లేదా, వివస్త్రయైన దేవయానినే నూతిలో ద్రోసినదా ?

ఇన్ని ప్రశ్నలకు సమాధానము తరువాత కథలో రావలయును. కథ యారంభించుటలోననే యిన్ని ప్రశ్న లుదయించెను. ఇచ్చటనే యొకదానికి సమాధానము చెప్పికొనవచ్చును. ఆ నూయి పాడునూయి. అందులోనికి త్రోసినచో మనుష్యులు చావరు. ఆ నూతి మొగమంతయు లతలచేత నావరింపబడియున్నది. ఏ తీగ పట్టుకొని పై కెక్కివచ్చినను రావచ్చును. అందుచేత శర్మిష్ఠకు దేవయాని చచ్చిపోవు నను భయమే లేదు.

మరి దేవయాని యెందుకు రాదు ? ఇది ప్రశ్న. దీనికి సమాధానము తక్కిన కథ చదివినగాని రాదు.

ఇట్లు దేవయాని పడియున్న యా నూతికడ్డకు యయాతి నికామపథిశ్రమము తేగుదెంచెను. అతడు జలపిపాసార్థియై వచ్చెను. శర్మిష్ఠాదులు జలక్రీడ లాడిన సరస్సు ఈ నూతికి దగ్గరగా నున్నచో రాజు చెరువుదగ్గరకు పోవునుగాని నూతిదగ్గరకు రాడుగదా! ఆ దగ్గరతనముకూడ కొంచెపుది కాదు. చెరువునకు నూతికి చాల దూర ముండియుండవలయును. మరి యింతదూరము శర్మిష్ఠాదేవయానులు వివాదమాడియుండవలయును. దారిపొడవున వా రొకరి నొక రనుకొనుచునే యుండియుండవలయును. ఎన్ని యనుకొనినను ఎన్ని సార్లనుకొనిన వా . రెండుపద్యములలోనున్న మాటలే. "లోకోత్తరచరితుడైన కావ్యుని కూతురను, బ్రాహ్మణస్త్రీని, నీ కట్టిన మైల కట్టుకొందునా?" అని దేవయానియు, "మీ యయ్య మా యయ్యను దీవించి బ్రదుకుచుండును. నాకద్ద మహిమలు పలుకుటకు సిగ్గయిన లేదా?" అని శర్మిష్ఠయు. ఇద్దరు నుత్తమకులసంజాతలు.

ఇంతకు మించి తిట్టుకొనరు. అనిన మాటకే మరల నను చుందురు. ఎంతదూరము పోయిన నిం తే. ఇ కెంత దూరము పోయిరి! జలపిపాసార్తితుడైన రాజునకు చెరువు దగ్గర అనుకొననంత దూరము పోయిరి.

ఈ యర్థము లన్నియు, నీ లోకజ్ఞత యంతయు నీ రెండు పద్యములలో నున్నది.

అప్పుడు నూతిలో నున్న దేవయానిదగ్గరకు యయాతి వచ్చినాడు.

"ఆ నహుషాత్మజుండగు య
యాతి యధిజ్యధనుస్సహాయుడై
యానతశాత్రవుండు..." వచ్చెను.

'ఆ' యని పద్యము మొదలుపెట్టుటలో నొక చమత్కార మున్నది. కౌరవవంశమును చెప్పికొని పోవుచు యయాతికథ వచ్చినప్పు డాగి కచదేవయానీ కథ నడుమ చెప్పి యది యైనతర్వాత మొదలుపెట్టిన కథ యిది. కచదేవయానుల కథ యయాతికథ క ప్రధానము. ఈ యయాతికథ ప్రధానము. ఈ ప్రధానమైన కథలో నిన్ని ముహూర్తము లిమిడించుచు తన లోకజ్ఞతను సంధాన పరచుచు పరమస్ఫూర్తిమంతముగ వ్రాయుచు కచదేవయానికథ వట్టి కవితాశక్తిచేత వ్రాయునుగాని దానియం దీదృక్శిల్పసంయోజనము చేయుడు. ఇట్లు ప్రధాన కథ విశిష్టరచనతో సాగించుట యొక్క విచిత్రరచన, లోకోత్తరుడైన యొక కవిమాత్రమే చేయగలడు.

ఈ నహుషునకు రెండు విశేషణములు వేయ బడెను; ఒకటి 'ఆనతశాత్రవుడు', రెండు 'అధిజ్యధను స్సహాయుడు'. శత్రువు లందర నిర్జించినవాడు అధిజ్యధనుస్సహాయు డగుట యెందులకు? దీనికి సమాధానముగ 'మృగయారసలోలనిబద్ధబుద్ధి' యని చెప్పుట. ఈ రాజు అవివాహితుడు. దేవయానిని వివాహముచేసికొన బోవుచున్నాడు. కనుక నీ కథారంభమునందు కథానాయకుడైన నాయకు లక్షణములు సూచనగా చెప్పుట.

"చనుదెంచి యమ్మహాజనపతి జల మపేక్షించి" జల మపేక్షించినవా డేమి చేయును? తరువాత 'నట్టో ప్పవిశ్రమించి' యని వ్రాసెను. జల మపేక్షించి విశ్రమించుట యేమి! ఇది విచిత్రముగా లేదా? ఆ నూతిని చూచుటతోడనే యందు నీ రుండ దని తెలిసినదా? లేనిచో నీరు చేదుకొను సాధనములు తనదగ్గర లేవా? ఈ రెండుకారణములచేతను మరికొంతదూరము పోలేక రాజచట విశ్రమించియుండవచ్చును. రాజచట విశ్రమించినా డని చెప్పుటతోడనే పాఠకు డీ రెండుకారణముల నూహించుకొనవలయును. తన కథలోని పాత్ర ప్రవర్తించిన ప్రవర్తనవల్లనే పాఠకు డచటి సన్నివేశ మంతయు నూహించుకొనవలయును. అట్టి సన్నివేశములో నా పురుషు డెట్లు మాటాడును? ఏమి చేయును? నన్నయ్యగారత డేమి చేయునో చెప్పును. ఎంత మాటాడునో చెప్పును. అతడు చేసినదానినిబట్టి యతడు మాటాడిన రెండుమూడు మాటలనుబట్టి సన్నివేశము, పరిస్థితి, పట్టిన వేళ సర్వమును పాఠకుడే యూహించుకొనవలయును. ఇవి నన్నయ్యగారి రచనలోని పరమరహస్యములు. ఊహించినకొలది తత్పర్యము భాసించును.

విశ్రమించినతర్వాత తత్కూపమున జూచి "దేవయాని గని తె" ఇది సీసపద్యము. 'తత్కూపమున' అన్న శబ్దము తర్వాతనున్న సీసపద్యపు మూడు చరణములు, గీతపద్యము దేవయానియొక్క వర్ణనము. ఈ దేవయానికి నాలుగు విశేషణము లున్నవి. మొదటిది ఒడ్డునందున్న తీగ అనునటువంటి ఒ ష్టసఖిని యూదియున్నది. రెండవది కుచయుగముమీద కన్నీరు పూరించుచున్నది. మూడు, తన దగ్గరకు జనుల యాగమనము కోరుచున్నది. నాలుగు, వరుణునిమీద కోపించి భూమిమీదకు రాబోవుచున్న వరుణదేవుని భార్యవంటిది. ఈ నాల్గు విశేషణములచేత నా నూయి యెట్టిదియో? ఆమె యున్నస్థితి యెట్టిదియో? ఆమెకు రానున్న దశ యెట్టిదియో?—ఇవి యన్నియు వ్యంగ్యభూతము లగుచున్నవి. చ్చుటకు ద్ధ గా ఁ ండి నూతిలో ఁడి ఁనిపోవుదు మేమో అన్న భయముతో తీగను పట్టు ని వ్రేలా ఁ స్త్రీని ఆ తీగ యను చెలికత్తెను పట్టు న్న దని రూపకము నౌచిత్యవేత్త యగు కవి వాడెను. ఈ రూప ముచేతనే యామె నూతిలో భద్రముగా నున్నది. తన క ష్టమైనచో తాను వెలికి రావచ్చును. వెలికి వచ్చుట ఒ ష్ట ము ఁదు. ఎందుకు

లేదో తర్వాత విచారింతము. రెండవ విశేషణము కన్నీరు పూరించుచున్నది అని. అనగా? తన స్థితి నాలోచించి దుఃఖమును తెచ్చికొనుచున్నది. చచ్చి పోవుదు నను భయముచేత గాదు. కొండికది శర్మిష్ఠ నన్నిట్లు త్రోయునా? నా తండ్రిమాహాత్మ్యమువలన దీని తండ్రిరాజ్యము సాగుచున్నదే. ఇది యెంత? అనెడు దుర్భావముచేత చింతాక్రాంతయై మాటిమాటికి కన్నీరు తెచ్చికొనుచున్నదని యర్థము. మూడవ విశేషణము తా నున్నచోటికి మరియొక్కరైన రావలయు నని. తన్ను నూతిలోనుండి బయటకు లాగుటకా? కాదు. తా నా స్థితిలో నుండగా నింకొకరు చూడ వలయును. చూచినచో కాని సౌఖ్యము కుదురదు. శర్మిష్ఠదోషము స్థిరపడదు. ఇది దేవయాని ప్రకృతి. మిక్కిలి పట్టుదల గల మనిసి. నేను గొప్పయింటి బిడ్డ నను గర్వము గల మనిసి. తా నెంత చెప్పిన తన తండ్రి యంత చేయు నను విశ్వాసము గల మనిసి. మరియు నాల్గవ విశేషణము వరుణదేవివలె నున్నదని; పైగా నామె భూమిమీదకు రాబోవుచున్న ట్లున్నదని. ఈ విశేషణముచేతగూడ నామె లేలికగా నూతిలోనుండి బయటకు రాగల దన్న విషయము ద్యోతమానమగు చున్నది. ఇష్టసఖి నూదియున్న ట్లున్న దనుటచేత, వరుణేంద్రుదేవివలె నున్న దనుటచేత నామె మహారాజ భార్య కాదగిన సౌందర్యభోగలక్షణము లామెయందు సమృద్ధిగా నున్నవనుట వ్యజ్యమానమగుచున్నది.

ఈ పైనిచెప్పిన లక్షణము లెవరికైన సందేహాస్పదములుగా నున్నచో సందేహనివృత్తికొరకు రాజి ట్లనుచున్నాడు: "నీ వెవ్వరిదానవు? ఇట్లేల యేకతం[illegible] యివ్విపినాంతరకూపంబుననున్నదానవు?" ఇది యడిగిన ప్రశ్న. అశే రెవరైన నూతిలో చని పోవుచుండె నుం[illegible] వారిని [illegible]టకు తీయుదురు. తన ధను స్సామె కందిచ్చి బయటకు తీయవచ్చును. అది యేదియు లేక [illegible]త్తె నూతిలో నుంటి వేమని యడుగుట యేమి? నూతిలో నొక్క తెగాక యిద్దరుందురా? నూతిలో నుండుట యేమిటి? ఈ ప్రశ్నలవలనగూడ పూర్వప్రసంగముచే తెలియుచున్నవి. అది పాడు నూయి. అందులో పడినవారు చనిపోరు. ఒత్తుచుట్టున పెన్నో తీగ లున్నవి. తీగ పట్టుకొనినయెడల బయటకు రావచ్చును. అందుకనియే శర్మిష్ఠ యామెయంత నామెయే లేచివచ్చునులే యని యింటికి పోయి విచారము లేకుండ నున్నది. శర్మిష్ఠ చిన్నపిల్ల. ఆమెకు దేవయానిగడుసుదనము తెలియదు. దేవయాని పెద్దది. పాపము! శర్మిష్ఠ తన తండ్రియే గొప్పవా డనుకొన్నది. ఏమి విచిత్రమైన కథ! ఆలోచించినకొలది తాను వ్రాసిన పదిపద్యములలో నన్నయ్యగారీ కథనంతయు నెట్లు ప్రసన్నముచేయుచున్నారు!

ఇట్లడుగబడి దేవయాని "ఇవి యేమాటలయ్యా? నన్ను ముందు బయటకు చేదు"మని యడుగవలయును. ఆమె నిజముగా నాపదలో నుండినగదా యిట్లడుగుట.

ఆమె యయాతి నెరుగును. ఇదివరకే యతనిని జూచినది. అతనితో నిట్లు చెప్పుచున్నది: 'అమర సన్నిభా' అని యతనిని సంబోధించినది. దేవతలతో సమానమైనవాడా! యని పిలుపు. రాజు నిదివరకే చూచినది. కచుని శాపమువలన తనకు క్షత్రియుడే పతియగును. ఆ క్షత్రియుడు సామాన్యుడా! మహారాజా? సామాన్య క్షత్రియుని తాను కోరదు. మహారాజు తన్ను వివాహ మాడుటకు తన ప్రయత్నము కొంత యవసరము. ఆమె కిప్పుడు రెండు కలిసివచ్చినవి. శర్మిష్ఠమీద పగ తీర్చు కొనవచ్చును. ఈ మహారాజును వివాహమాడుటకు వీ లేర్పడినది. ఆమె యెంతయో యూహాశాలిని. 'అమర సన్నిభా!' అని పిలిచి యుద్ధములో చనిపోయిన రాక్షసులను తన విద్యపెంపుచేత ప్రాప్తజీవులను చేయు నమిత శక్తిచేత ప్రకాశించెడి భార్గవుని కూతుర నన్నది. ఈ భావము నన్నయ్యగారు చంపకోత్పలమాలాదిసామాన్య వృత్తములలో వ్రాయక 'తరళ'ముతో వ్రాసెను. ఈ విభిన్నవృత్త మెన్నుటచేత దేవయానిగర్వము,తన తండ్రి గొప్పదనము, తా నంతగొప్పదాన నని రాజునకు తెలియ జేయుట మొదలైన బహుప్రయోజనములు సిద్ధించు చున్నవి. ఈ పద్యములోని భావమునకు నీ భిన్నవృత్త ముద్దీప్తి కలిగించుచున్నది. ఈ వృత్తముయొక్క భిన్న త్వముచేతనే యీభావము స్వార్థ్యతిశయము కలిగి భాసించుచున్నది.

అని చెప్పి దేవయాని మరల నిట్లనుచున్నది: "ప్రమాదవశంబున నిన్నూతం బడి వెలువడనేరకున్న

దానను. న న్నుద్ధరించి రక్షింపుము" అన్నది. అదే శర్మిష్ఠ తన్ను నూతిలో త్రోసిన దని చెప్పదే. వైదికుని కూతురు. ఆ గడుసుదనమునకు, నా లౌకికమునకు నవధి లేకుండనున్నది. అంత గర్వము గల యామె యామాట చెప్పనే చెప్పదు. చెప్పినచో రా జేమను కొనును? ఈమాత్రమునకు నీవు లేచి యింటికిపో వచ్చునుగదా! ఆ మెమీద నింత పగ యెందు కను నేమో? తన యీ దుర్గుణము రాజునకు తెలిసినచో రాజు తన్ను వివాహమాడుటకు నంగీకరించునా? తన ప్రయత్నము వృథాయగును. అందుచేత చెప్పనే చెప్పదు. దీనివలన దేవయానిపాత్ర యెట్లు పోషింపబడినదో చూడుడు.

"అనగా న న్విప్రకన్యక యందు దయాళుండై తద్దయు యయాతి."

ఇచట విప్రకన్యక యనుట యెందులకు? తద్దయు దయాళు డనుట యెట్టిది? ఈ రెండుమాటలను విచారించినచో నొక చమత్కారమైన యర్థ ముత్పన్నమగుచున్నది. దేవయాని త న్నుద్ధరింపుమన్నది. ఈ శబ్దము 'ఉత్ + ధరణము కావచ్చు. ఉత్ + హరణము కావచ్చు. నన్ను పైకి చేదుకొను మనియు నర్థమే. నేను కచునిచేత శపింపబడినదానను. నన్ను వివాహము చేసికొనుము. ఈ కన్యాత్వదోషమునుండి నన్ను రక్షింపుమనియు నర్థమే. నన్ను పైకి చేదుకొనుమన్న యర్థమునొక్క ప్రసక్తి లేదు-ఆమె తన ప్రయత్నము చేతనే నూతినుండి వెడలి రాగలదుగనుక. అందుచేత రాజు మిక్కిలి దయాళుడైనాడట. ఈమె తనయంతట తాను పైకి రాగలదు. అయినను నన్ను పైకి లాగుమనుచున్నది. ఇది యొక చమత్కారము. ఒక లీల.

అట్టి లీల నాదరించుటకు నా వ్యక్తియందు తన కొక జాలి పుట్ట లయును.

జాలి, దయ, కరుణ మొదలైన శబ్దముల నొక్క యర్థము విచారించినచో చమత్కారముగా నుండును. ఈ మూడు శబ్దములు మూడు భిన్నపరిస్థితులయందు లోకమునందు వాడబడుట నిజమే కాని వాని నిజమైన తాత్పర్యము మనసు ద్రవించుట యనియే. ఇది సత్త్వగుణము. సత్త్వగుణ మనగా నాలంకారికులు చెప్పు సత్త్వము. "పరగతసుఖదుఃఖానుకూలాంతఃకరణప్రవృత్తి స్సత్త్వమ్." అని ధనంజయుని నిష్కర్ష. ఈ సత్త్వమే రసమునకు హేతువు. మనస్సులో పుట్టిన యార్ద్రత యని యర్థము. "ఏకో రసః కరుణ ఏవ"అన్న భవభూతివాక్యములోని కరుణశబ్దమునకిదియే యర్థము.

ఇట్టి దయను యయాతి దేవయానియందు పొందెను. తాను క్షత్రియుడు. ఆమె విప్రస్త్రీ. ఆమెయందు తా నట్టి ప్రేమభావమును వహింపరాదు. కాని దైవవశముచేత యయాతి కామెయందు ప్రేమ కలిగెను. ఈ ప్రేమ కలిగె ననుటకు వీలులేదు. కలుగలే దనుటకు వీలులేదు. కలిగినచో నప్పటి పరిస్థితివలన నధర్మము. కలుగలే దని చెప్పుట యబద్ధము. ఈ యంతఃకరణప్రవృత్తి రాజు దేవయానిని బయటకు తీసినపుడు వా రిరువురు పరస్పరస్నిహ్యమాణచిత్తులైరి. నన్నయ్యగారు దానిని స్ఫురింపచేసి వదలిపెట్టిరి. అతిచమత్కారముగా చెప్పిరి.

వీరిద్దరొకరియం దొకరు ప్రేమ వహించుట మిక్కిలి గాఢముగా నున్నది. ఆ గాఢత్వమును పద్యముచేతగూడ వర్ణించుచున్నాడు:

"జలధివిలోలవీచివిల
సత్కలకాంచిసమంచితావనీ
తలసహనక్షమం బయిన
దక్షిణహస్తమునం దదున్నమ
ద్గళదురుఘర్మవారికణ
క్రమకరాబ్జము పట్టి నూతిలో
వెలువడ గోమలిం దివిచె
విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్."

ఈ పద్యమునందు తాత్పర్యము రాజు దేవయానిని నూతిలోనుండి తిగిచె నన్నంతమాత్రమే. అతని దక్షిణహస్తమున కొక విశేషణము, దేవయాని చేతి కొక విశేషణము రెండున్నవి. ధాత్రీవహనక్షమమైనది దక్షిణహస్తము. చెమటపోసినది దేవయాని చేయి. ఈ రెండు విశేషణములచేత రాజా మెయందు భార్యాభావము పొందెనని, యామెచేయి సాత్త్విక

స్వేదము కలిగె నని యర్థములు పుట్టుచున్నవి. పరస్పరము వారొకరొకరు తమరి చేతులు కలియుటచేత సంతోషించిరి. రసభావమును పొందిరి. ఇదియు నొక చమత్కారమున్నది. రాజాది దక్షిణహస్తమట. దేవయానిది క్రమకరాబ్జమట. హస్తమన్న శబ్దమున కేన్గు తొండమనియు నర్థము కలదు. మదించిన యేన్గు తామర పూవును లీలగా వహించుట ప్రసిద్ధము. ఇందు శబ్దశక్తి కృతిః స్తుకృతిస్తుస్వనియున్నది. ఏనుగు తామరపూవును పూనినట్లు రాజామెను వహించె నని యర్థము. "విశ్రుత కీర్తియగు గాఢ ప్రీతితోడ" 'విశ్రుతకీర్తి' యనుటవలన క్షత్రియుడైన యయాతిమనస్సు విప్రకన్యయైన దేవయానియందు ప్రసరించుట దైవప్రేరితము. దోషహేతువు కాదు అని శంకరుడు పరిహరించుచున్నాడు. 'ప్రీతితోడ' అని రాజు పొందిన సంతోషము వాచ్యముగా చెప్పినాడు. ఆమెను నూతిలోనుండి తీయుదమను కొన్నప్పుడు దయమాత్రము కల్గినదికాని యామెచేతిని స్పృశించినపుడు రాజునకు కామవికారమే కల్గినది.

'ఇట్లు దేవయాని నుద్ధరించి' అని మరల నుద్ధరించు శబ్దమునే వాడినాడు.

ఈ శబ్దమును వాడుటచేతనే సంశయగ్రస్తమైన యీచోట రెండర్థములు స్ఫురించుటకు వీలున్నది. ఒక తెలుగుశబ్దము వాడినచో నిట్టి యర్థములు పుట్టవు. నన్నయ్యగారెక్కువ సంస్కృతము వాడును అన్న యపప్రథ యీ సంస్కృతశబ్దములయందున్న యర్థచమత్కారవిశేషములు భావించినచో కొంత తొలగ గలదు.

ఇప్పటికి రాజు దేవయానిని నూతిలోనుండి తీయు కథ పూర్తియైనది. ఇది పదిపద్యములలో నున్నది. పదిపద్యముల కథలో నొక మహాకావ్యమునకు యోగ్యమైన సామగ్రి యంతయు నిమిడించిపెట్టినాడు.

ఇట్లు చూచినచో నన్నయ్యగారు 'లో నారసి చే లందరు కవు'లన్నమాట యథార్థ మగును.

మరియు కొంత వ్రాసి యీవ్యాసము ముగింతును.

ఈ పైన చెప్పిన విషయములు, వానివలన దేవయాని శీలము, పాఠకుడు తెలిసికొనలేకపోయినచో, వానికి దేవయానిస్వరూపము మఱియు నవగత మగునట్లు వ్రాయుచున్నాడు. "యయాతి తన పురంబున కరిగెను. ఇట దేవయానియు శర్మిష్ఠ చేసిన రోగ్యతవలన విముక్త యయి" అని వ్రాసెను. శర్మిష్ఠ చేసిన రొగ్గ నూతిలో త్రోయుట. రాజు నూతినుండి బయటకు తీసెను గనుక రొగ్గనుండి విముక్తయైనది. ఇంక కోపమక్కరలేదు. మరి తరువాత నింటికి పోదేమి? తండ్రి వచ్చి బ్రతిమాలినను పోదేమి? శర్మిష్ఠ తనకు దాసి యగువరకు పట్టుదల వదలదేమి? నూతిలోనుండి బయటకు వచ్చినంతమాత్రముచేత శర్మిష్ఠ చేసిన రొగ్గెట్లు పోవును? కనుక రోగ్యతవలన విముక్త యయ్యె ననుమాటకు నర్థము లేదు. శర్మిష్ఠ మనకు కొంచె ముపకారము చేసినది. దానివలన తన కెక్కువ యుపకారము జరిగినది. తన వివాహమునకు పునాది వేసినది. వివాహము పాణిగ్రహణము. రాజుచేత తన పాణిగ్రహణము చేయించినది. మరల రాజు కనిపించినపుడు "మున్న పాణిగ్రహణంబుసేసి తది నీయెడ విస్మృతి నంద పాడియే?" అన్నది. అట్లనుట కిప్పుడు వీ లేర్పరచుకొన్నది. ఆమె యింత నేర్పు కలది. తాను వేసిన పథకము ఫలించకతప్పదు. ఈ సంతోషమే శర్మిష్ఠ చేసిన రొగ్గవలన తాను విముక్తయైనట్లు భావించుట.

అట్లుండ ఘూర్ణిక యను పరిచారిక యీమెను వెదకుచు వచ్చుచున్నది. దానితో దేవయాని "నీవు వృషపర్వపురంబు సొరనొల్ల. నాపడిన యవమానంబు మదీయజనకున కెఱింగింపుమని పంచెను."

పరిచారిక తన్ను వెదకుచువచ్చుచున్నది. లేనిచో తా నింటికి పోవునా? పోదా? తనంతట తాను పోయెడిదే. ఇప్పుడు పోదు, లోకములో నిట్లే జరుగును. కోపము వచ్చి పిల్లవాడు భోజనముచేయక పండుకొనును. మనము మాటాడకుండ నూరకొన్నచో కొంతసేపటికి వానియంతట వాడే లేచివచ్చును. మనము బ్రతిమాలిన కొలది వాని బిగు వెక్కువగును. ఆ స్వభావమే యిచట దేవయానియందు గోచరించుచున్నది. ఇట్లు వ్రాయుట లోకజ్ఞత్వమే.

ఆ దాసి పోయి చెప్పినది.

"శుక్రుండును నాత్మఁ గోపఘూర్ణితబాష్ప పూరితనయనయైయున్న దేవయానిం గని యిట్లనిరో" అని వ్రాసెను. అక్కడకు వచ్చినా డని వ్రాయడు. ఘూర్ణిక చెప్పినక్షణములోననే దేవయాని నాయన చూచెనట. ఆ మహర్షి తన కూతునందు తనకు గల ప్రేమచేత నా నిముషములోననే దేవయానికి ప్రత్యక్షమైనా డని యర్థము.

కోపము చెడ్డ దని యాయన రెండు కందపద్యములు శుక్రుడు చెప్పినట్లు వ్రాసెను. దేవయాని నే నచటికి రానని, రాకపోవుటకు కారణము నొక కంద పద్యములో చెప్పెను. అప్పుడు శుక్రుడు కూతురుతో "నాకు నీవ గతివి; నీతోడ నేనును వత్తు"ననుచు కూతుం బట్టువరుచుచున్నంత నంతయు చారులవలన నెఱింగి వృషపర్వుండు శుక్రునొద్దకు వచ్చెను.

నన్నయ్యగారి లోకజ్ఞత్వ మెట్టిదో చూడవలయును. రాజు చారులవలన నీ వర్తమానము తెలిసికొనుట కెంతసేపు పట్టును? దేవయానిని శర్మిష్ఠ నూతిలో త్రోసిన దన్నమాట శర్మిష్ఠ చెప్పలేదు. ఘూర్ణిక శుక్రుడు దేవయానికొఱకు వెడలినతర్వాత తా నెవ్వరితోడనో చెప్పెను. వారికి వారు, వారికి వారు చెప్పికొని రాజచారులకు తెలిసెను. వారు పోయి రాజుతో చెప్పిరి. కనీస మింతకాలము జరుగుటకు నెంత తొందరగా జరిగినను కొన్ని గంటలు పట్టును. ఒకదినములోననే జరిగినది. ఇంతపనియు నొకదినము లోనే జరుగుటకు, శుక్రు డన్నచో రాజునకు, రాజ్య ప్రజకు మహాగౌరవ ముండియుండవలయును. దీనినుండి యీ విషయ మనుమీయమానమగుచున్నది.

ఇన్నిగంటలసేపు అడవిలో శుక్రాచార్యులును, దేవయానియు ఆయన రమ్మని, యీయమ రానని యివే మాటలు తిరిగితిరిగి యనుచు కూర్చుండి రని యర్థము. ఈ యర్థము సువ్యక్తమగుటకు పల్లెటూళ్లలో జరుగు నొక సంవిధానము చెప్పెదను. మనకు ప్రేమ గలిగిన యొక బంధువు కోపము వచ్చి లేచిపోవును. అతని వెంట నతనిని త్రిప్పి తీసికొనివచ్చుటకు మఱియొక బంధువు పోవును. ఇతడు రమ్మనును, నతడు రాననును. ఆ పొలిమేరమీద గంటలకొలది నట్లే కూర్చుందురు.

ఈ లోకజ్ఞత్వము తెలిసినగాని కవి యిట్లు వ్రాయలేడు. "పట్టువరుచుచున్నంత" అన్న మాటలో శుక్రు డెన్నో ప్రతిపత్తులు చెప్పుచుండుటయు, నామె యన్నియు నిరాకరించుటయు గంటలతరబడి జరిగిన యా పరిస్థితి వ్యంగ్యభూతమై నన్నయ్యగారియొక్క నావ్యతో దర్శనీయమైన లోకజ్ఞత్వము భాసించుచున్నది. ఆయనలోకజ్ఞత్వ మిట్టిది. ఇంకను నెట్టిదో వేర యొక వ్యాసము వ్రాసెదను.



# భాసమహాకవి - ఏకాంకరూపకాలు

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

సంస్కృత శ్రవ్యకావ్యపర్వప్యానికి వాల్మీకి మహర్షి గురుదేవుడైతే, భాసమహాకవి నాటక వాఙ్మయప్రపంచానికి ఆచార్యమూర్తి.

కనుకనే కాళిదాసు తన రఘువంశకావ్యాదిని (సూచనగా) వాల్మీకిమునినీ, మాళవికాగ్నిమిత్ర ప్రస్తావనలో (వాచ్యముగా) భాసర్షినీ ప్రశంసించి, వారియెడల తన కున్న పూజ్యభావమును వెల్లడించినాడు.

నిజానికి — భాసమహాకవినాటకచక్రానికి రావలసినంత ప్రకాశనప్రతిష్ఠలు ఇంకా దేశంలో వచ్చినట్టు లేదు.

ఇంటింటా, ప్రతి నాట్యకళారాధకుని చేతిలోనూ, విశ్వవిద్యాలయప్రతిపరీక్షాపాఠ్యక్రమంలోనూ, మూలమూలరంగస్థలంలోనూ ఈ నాటకాచార్యుని రూపకావళి ఆస్వాదితమై, అభినందితమై ప్రదర్శితమైనప్పుడే ఈయననాటకీయప్రతిభ చరితార్థమై దేశీయులు ఇతని ఋణం తీర్చుకున్నవారౌతారు.

ఈ మహాకవినాటకచక్రం ఒక్కసారి చదివితే చాలు—ఈతని అద్వితీయనాటకరచనాప్రకర్షను అందుకున్నవారు, ఇప్పటి లబ్ధప్రతిష్ఠులలో, ఎంతమంది ఉన్నారా అనిపిస్తుంది.

కాళిదాసనాటకాలు తమ అద్భుత కవితా వైభవంతోనూ, భవభూతిరూపకాలు తమ నిరుపమాన రసభావపరిప్లుతితోనూ మనకు మొగంమొత్తించి ఊపిరాడనియ్యవు.

తక్కిన ప్రముఖనాటకాలు చాలావరకు కవి మస్తిష్కకౌశలంలో పుట్టి చదివినంతసేపు మనస్సు నాకట్టి ఊరుకుంటాయి.

భాసరూపకావళి అట్టిది కాదు. ఉత్తమచిత్రకారుని యథోచితవర్ణవిన్యాసంలాగు ఈ రూపకచక్రంలో కవిత తన అర్థస్థానం దాటిరాక తక్కిన నాటకీయ ప్రముఖలక్షణాలకు సమగ్రప్రాతినిధ్యం కల్పించి నాటకసౌష్ఠవానికి మిక్కిలి తోడ్పడుతుంది.

భాసర్షి నాటకీయపాత్రలు తక్కిన కావ్యనాటకవ్యక్తులవలె బెరుకుగాను, అతిలోకగుణదోషాలతోనూ కనపడక నిండుజీవంతో కదలి మానవహృదయాలకి మరీ చేరువగా వస్తారు.

ఈతని సంవిధానకౌశలమూ, ఉక్తిమాధుర్యమూ శూద్రక, కాళిదాస, భవభూతి, దిఙ్నాగాదిప్రసిద్ధ రూపకరచయితల్ని ఆకర్షించి వారి రూపకాల్లో చిత్రచిత్రంగా ప్రతిఫలించి రాణించాయి.

స్వప్నవాసవదత్త అయిదవఅంకంలో సముద్రగృహందగ్గిర స్వప్నావస్థలోని వత్సరాజూ, జాగ్రదవస్థలోని వాసవదత్తా కలిసిన విచిత్రసన్నివేశమే దిఙ్నాగుని కుందమాలలోనూ, భవభూతి ఉత్తరచరితలోనూ, యదృచ్ఛావనాగత శ్రీరామచంద్రుని యొక్కయూ, తిరస్కరిణీతిరోహిత సీతాదేవి యొక్కయూ రసవత్సమాగమములుగా మారినవి.

ఇతని చారుదత్తమును అక్షరాలా అనుసరించియే శూద్రకకవి తన మృచ్ఛకటికాన్ని అంత సర్వాంగసుందరంగా నిర్మించగలిగాడు.

భాసుని ఉక్తిచాతుర్యానికి ముగ్ధుడై కాళిదాసు స్వప్న, అభిషేక, మధ్యమ, కర్ణభారాదిరూపకావళినుంచి అనేకవాక్యములు ఉద్ధరించుకున్నాడు.

కాళిదాసాదులకు నాటకరచన ఒక సాహిత్యరచనావిలాసం. భాసునికి రూపకరచన ఒక ఉపాస్యదైవతం. ఏకైకలక్ష్యతపస్సిద్ధి.

తక్కిన కవుల నాటకరచన ఒకొక్క సుందర శిల్పమైతే భాసుని రూపకనిర్మాణం ఒక కైలాసాలయం, ఒక అజంతాగుహ అవుతుంది.

ఇట్టి కళాకౌశలంతో ఈ నాట్యప్రభువు పదమూడు నాటకాలు రచించాడు. ఇందులో ఎనిమిది పెద్దవి. తక్కిన అయిదు ఏకాంకములు.

సంస్కృతసాహిత్యం ఏవో రెండు మూడు అప్రసిద్ధరచనలు తప్పితే ఉజ్జ్వల ఏకాంకరచన భాసునితోనే పుట్టి ఆయనతోనే అంతరించిందని చెప్పవలసి ఉంది.

ఇతని తక్కిన విపులరూపకాల మాట అట్లా ఉంచి ఏకాంకముల రచనాతిశయం గురించి ఇక్కడ కొంత ప్రస్తావించడం ఇప్పటి నా ప్రస్తుత కర్తవ్యం.

సత్త్వసంపన్నమైన ఇతని ప్రతీ ఏకాంకరూపకమున్నూ మెల్లగా చిచ్చుబుడ్డిలా అంటుకుని కొంతసేపటికి ఆపరాని వేగంతో ముత్యాలను, కెంపులను ఎగజిమ్మి చిమ్మి నెమ్మదిగా చల్లారుతుంది.

ఐంద్రజాలికుడు పిడికెడు ధూళి తీసి మంత్రవేణువు తిప్పి అరచేతిలో స్వర్గం చూపించినట్లు ఈయన పేలవమైన ఒక చిన్నకథ తీసుకుని తన ఇంద్రజాలలేఖినితో స్పృశించి దాన్ని ఒక రసమయదృశ్యకావ్యంగా మార్చివేయగలడు.

౧. మధ్యమవ్యాయోగం, ౨. దూతవాక్యం, ౩. కర్ణభారం, ౪. దూతఘటోత్కచం, ౫. ఊరుభంగం అని భాసుని ఏకాంకములు ఐదు.

మహాకావ్యానికి ఖండకావ్యం క్లుప్తరసబంధుర రచన అయినట్లు నాటకానికి ఏకాంకరూపకం ఒక సంగ్రహరసగుళిక. ఈ రచన చేపట్టి కృతార్థుడు కావడం ఒక నాటకతపస్వికేగాని అన్యులకు సాధ్యంగాదు. కనుక ఈ శాఖ చాలావరకు సంస్కృతసాహిత్యంలో నశించిపోయి విశాలావకాశం గల బృహన్నాటకరచన మాత్రం మిగిలింది.

ఏకాంకరూపకరచనలో ఈ కవిప్రజ్ఞ పండినది. మహాభారతంలోని పాండవవనవాసం నుంచి దుర్యోధనపతనంవరకు ఉన్న కథ ఉపాధిగా తీసుకుని అయిదు సాధారణాంశాలకు అతులనీయమైన నాటకత్వం కల్పించి ఈ రూపకపంచకము వెలయించినాడు.

ఈ నాటకాల సజీవసంచలనం చూచినమీదట పుస్తకం చేత్తో పట్టుకు చదువుతున్నట్టుగా కాక రంగం మీద చూస్తున్నట్టుగా భావిస్తాం.

ఈ రూపకరచనకు ఒక క్రమం ఉంది. పాండవవనవాసస్థితికి చెందిన మధ్యమవ్యాయోగం మొదటిది. శాంతికోరి కృష్ణుడు నడిపిన రాయబారానికి చెందిన దూతవాక్యం రెండోది. యుద్ధమధ్యకాలంలో కర్ణుని సాహసౌదార్యాలు తెలిపే కర్ణభారం మూడోది. అభిమన్యువధానంతరం కృష్ణుడు ఘటోత్కచునిద్వారా సందేశమంపినట్టు చమత్కరించిన దూతఘటోత్కచం నాల్గోది. గదాహతుడైన దుర్యోధన దయనీయస్థితికి చెందిన ఊరుభంగం అయిదవది.

సర్వభావరసపాత్రమైన భారతకథలను తన రూపకసామగ్రిగా ఎన్నిక చెయ్యడంలో ఇతడు చాలా మెలకువ చూపాడు.

ప్రత్యేకంగా ఒకొక్క రూపకాన్నే పరిశీలించి వాటి గుణవిశేషాలను గమనిద్దాం.

## మధ్యమవ్యాయోగం

ఈ రూపకంలోని విశిష్టత సాటిలేని ఘటనాచాతుర్యం.

ఒక బ్రాహ్మణకుటుంబం తమ బంధువులింట శుభకార్యానికి అరణ్యమార్గంద్వారా వెడుతూండగా వెనకనుంచి రాక్షసుడు ఘటోత్కచుడు తరుముకు వచ్చి తన తల్లి ఉపవాసానంతరభోజనార్థం వారిలో ఒకరిని రమ్మంటాడు. బ్రాహ్మణకుటుంబం దుఃఖించి తుదకు మధ్యమకుమారుణ్ణి ఇచ్చివేయడానికి ఒప్పుకుంది. ఆ మధ్యముడు రాక్షసుని సెలవు పుచ్చుకుని మంచినీళ్లు తాగడానికి చెరువుకు వెళ్లాడు. ఆలస్యం భరించలేక రాక్షసుడు 'మధ్యమా, మధ్యమా' అని ఎలుగెత్తి అరవగా పక్క అడవిలో వ్యాయామసాధన చేస్తూన్న కుంతీసుత మధ్యముడు భీముడు అక్కడికి వచ్చి 'నాతో ఏమి పని' అంటాడు. భీముణ్ణి చూచి బ్రాహ్మణుడు తన

ఆపద చెబుతాడు. భీమ ఘటోత్కచులకు ఘర్షణ పెరిగి యుద్ధంలోకి దిగుతుంది. బ్రాహ్మణరక్షణార్థం తుదకు భీముడు రాక్షసుడితో పడతాడు. హిడింబ భీముణ్ణి చూచి నవ్వుకొని కొడుకును అతనికి నమస్కరించమంటుంది. వాడు తెల్లబోగా విప్పిచెప్పుతుంది.

భీము డాశ్చర్యపడగా సవిలాసంగా చెవిలో చెబుతుంది. ఆమె పన్నుగడకు ప్రాణేశ్వరుడు ముదితుడై రాక్షసులకు కూడా హృదయం ఉంది అనుకుంటాడు. విప్రకుటుంబం సురక్షిత మవుతుంది.

ఇందులోని భీమఘటోత్కచుల యుద్ధం చూచినప్పుడు 'సోరాబ్ - రుస్తుము' ల కథ జ్ఞాపకం వస్తుంది. ఐతే అందులోని విషాదమలినచ్ఛాయ ఇందులో లేక పోవడమే కాకుండా దీనిలో తండ్రి తన శక్తినంతా మణుచుకుని కొడుకుతో లీలాఖేలనం ప్రారంభిస్తాడు.

ఇందులో సన్నివేశసౌందర్యం ఎక్కడ ప్రారంభమవుతుందంటే—మాతృభక్తితో రాక్షసుడు ఈ హింసాకాండకు సిద్ధపడగా, పితృభక్తితో బ్రాహ్మణవటుడు ఆత్మపరిత్యాగానికి సంసిద్ధుడవుతాడు. ఇద్దరి ఉద్యమం గొప్పదే కాని—ఫలితం మాత్రం హింస.

ఈ ఘటనతో రూపకంలో సమస్య ప్రారంభమై రాక్షసుడు 'మధ్యమా' అని పిలవగా తలవని తలంపుగా భీముడు తటస్థపడడంతో (మొదటిది) విడి మరో చిక్కైన కొత్తసమస్య తలఎత్తుతుంది. దానిలో భీముడు తన ఎదిరి తన పుత్రుడని ఎరిగి వెలుగునీడలుగా ఆటలాడి అతన్ని గెచ్చుగొడతాడు. అతడు ప్రకుపితుడై యుద్ధంలో దిగి ఓడిపోతాడు. తిరిగి సమస్య.

తాను మొదట బ్రాహ్మణరక్షణార్థం చేసిన ప్రతిజ్ఞకు కట్టుబడి భీముడు అతనివెంట వెళతాడు. తుట్టతుదకు హిడింబ భీముని చెవిలో యథార్థం చెప్పడంతో ఒక చక్కని పరిష్కారం ఏర్పడి రూపకరక్తి ఉత్తమస్థితికి వెళ్ళింది.

ఈ కథ భారతంలోది కాదు. ఐతిహాసికపాత్రలతో నాటకీయచాతుర్యం ఉట్టిపడగా కవి దీన్ని నిర్వహించాడు.

## దూతవాక్యం

ఇది రూపకపరిభాషలో వీథి. మార్గంలో నడుస్తూ ఉండగా కొన్ని దృశ్యాలు మనకంటబడి పరుగెత్తుకుపోతూన్నట్టు, ఇందులో ఒక దృశ్యపరంపర యంత్రంలో అమర్చి తిప్పినట్టు మన కన్నులకు మిరుమిట్లుగొల్పుతూ నడుస్తుంది.

రంగంమీద తరుచు ఇద్దరే పాత్ర లుంటారు. వారి చమత్కారవ్యాపృతివల్ల ఎన్నో కథాసన్నివేశాలు రంగంమీద చరచర తిరిగిపోతున్నట్టు కనబడుతుంది.

•

శ్రీకృష్ణుడు రాయబారానికి వచ్చినట్టు తెలిసింది. భారతరాజరాజు దుర్యోధనుడు బంధుమిత్రసామంతాదులతో ఒక సభ ఏర్పాటుచేశాడు. మంత్రిశాలముఖద్వారంలో అతడు అప్తులకు చూపిన స్వాగతం అతని సమయజ్ఞతకు బలీయమైన నిదర్శనం.

ఆ స్వాగతంలో నిశిత వ్యంగ్యం ఉంది. ద్రోణాచార్యునకు కూర్మాసనం చూపాడు. యుద్ధప్రయత్నంలో ఆయనస్థితి అదన్నమాట. భీష్మునకు సింహాసనం. రాబోయే సర్వసైన్యాధిపత్యానికి నాంది. శకునికి చర్మాసనం. (పులిచర్మం అయిఉంటుంది) అతని క్రౌర్యానికీ, పట్టుదలకి అది బహుమానం. వైకర్ణవర్షదేవులకు ఏవో సాధారణాసనాలు. పేరు లేదు.

కృష్ణుడు ప్రవేశించేదాకా దుర్యోధనుడే రంగమంతా శతరూపాలు ధరించి కనపడతాడు. వాసుదేవుడు దూతగా సభాస్థలికి వచ్చినప్పుడు ఎవ్వరూ ప్రత్యుత్థానం చెయ్యరాదని కట్టడిచేసి తప్పినవారికి పండ్రెండుబారువుల బంగారం అపరాధం అన్నాడు. తాను లేవకుండా ఉండడానికి చిత్రపటంగా వ్రాయించిన ద్రౌపదీపరాభవదృశ్యం చూస్తూ కూచున్నాడు.

పన్నుగడ అంతా భగ్నమయింది. కృష్ణుని చూడగానే రాజులంతా అపరాధంమాట మరచిపోయి లేచి నిలుచున్నారు. ఈ అలజడిలో దుర్యోధనుడు సింహాసనంనుంచి పడ్డాడు. భాసరచనకు సహజమైన మెరుపు ఇక్కడ కనపడుతుంది.

దూత్యమునకు వచ్చిన శ్రీకృష్ణుడు దుర్యోధనరాజవైభవం తిలకిస్తూ అనుకుంటాడు—

“ఐశ్వర్యం స్ఫీత మేతత్ స్వజనపరిభవా—దాసన్న విలయమ్.”

౧౯౩౯ లో రెండవ మహాయుద్ధం ప్రారంభమైనప్పుడు, గాంధీమహాత్ముడు లండన్ రాజభవనాల వినాశాన్ని ఊహించి పడ్డ పరితాపం జ్ఞాపకం వస్తుంది.

ఇందులోని కృష్ణపాత్రసృష్టి విశిష్టమైనది. అడుగడుగునా అతని రాజనీతిజ్ఞత, ప్రతిభానవత్త్వం స్ఫులింగాల్లా గోచరిస్తాయి.

దుర్యోధనుడు అతితెలివిగా—పరుల సంతానమైన పాండవులకు రాజ్యం ఎట్లా వస్తుంది? అంటే కృష్ణుడు చల్లగా—"నీతాత విచిత్రవీర్యుడు క్షయరోగంతో పరమపదించగా వ్యాసునివల్ల పుట్టిన నీతండ్రికి రాజ్యం ఎలా వచ్చిందో అలాగే" అని నోరెత్తకుండా సమాధానం చెప్పి, ఈ పరస్పరద్వేషం వల్ల కురుకులవినాశంగాని లాభం లేదని లాలించి చెప్పి, తన్ను దూషిస్తే బావలపరిహాసంగా తోసిపేసి సాధుమార్గం తొక్కి—చూచి నిష్ప్రయోజనమని తెలుసుకుని విజృంభిస్తాడు.

దుర్యోధనుడు కృష్ణుని బంధించడానికి ప్రయత్నించి సభలోని ప్రతిఒక్కడూ ,వాసుదేవుడై కనిపించగా దిగ్భ్రమ చెంది ఉన్మత్తు డౌతాడు. దీనితో ఈ రూపకరక్తి ఉచ్చస్థితి తాకింది.

సాధుసంక్షోభంతో ప్రపంచం క్రక్కదలిపోయింది. సుదర్శనం స్వామిసన్నిధిని వ్రాలి 'ఏమి సెలవు?' అని మోకరిల్లింది. కౌమోదకీనందక శార్ఙ్గగరుడులు కురుకులధ్వంసానికి రివ్వున ఎగిరివస్తున్నారు. సుదర్శన విన్నపంతో ప్రభువు శాంతించాడు. ఆయుధాలన్నీ వెనక్కు వెళ్లాయి. అంధనృపతి సప్రశ్రయాభివాదనంతో కృష్ణస్వామి శాంతుడై పాండవశిబిరానికి వెళ్లినాడు.

ఈ రూపకానికి కృష్ణుడు నాయకుడై మానవత్వంలో నడచి హఠాత్తుగా దివ్యత్వం అందుకుని అప్రాణ్యాయుధాలనుసైతం సజీవంగా సంచలింపజేసి రాయబారం ప్రదీప్తంగా నిర్వహించి నిష్క్రమించాడు.

ఈ కృష్ణరాయబారఘట్టం భాసహస్తంలో మరింత శక్తిమంతంగా మారి విలక్షణరూపంతో మనకు ప్రత్యక్షమవుతుంది.

## క ర్ణ భా ర ం

కవికి కర్ణునియందు ఎంత గౌరవమున్నదీ ఈ పేరువల్ల తెలుస్తుంది. అతని యుద్ధావతరణసమయంలో ఎన్ని బరువులు అతన్ని కుంగదీసినవో కవి ఈ రూపకంలో అఖండసానుభూతితో చిత్రించాడు.

శల్యుడు నడిపే రథ మెక్కి ప్రకృతిగంభీరుడు కర్ణుడు తనలో తా ననుకుంటాడు—

"నిరర్థ మస్త్రంచ మయా హి శిక్షితమ్
పునశ్చ మాతు ర్వచనేన వఞ్చితః."

మనస్సు తేలికపడడానికి తన అస్త్రవిద్యావిషాదకథ శల్యుడికి చెప్పి కొంత ఊరటపడి, తన అస్త్రాలపైపు చూచి శక్తి తప్పినవని తెలుసుకుని నిరుత్సాహములైన గుర్రాలను, ఏనుగులను చూచి—"మరణిస్తే స్వర్గం; బతికితే కీర్తి; రెండూ ఇష్టమే; యుద్ధం ఎప్పుడూ నిష్ఫలం కాదు; పోనీ రథం"అని గుండె రాయిచేసుకుని మహావీరుడుగా ముందుకు నడచినాడు.

ఇక్కడనుంచి రూపకం సంఘటనతో బిగిసి కర్ణుని ఉదారధర్మదీక్షలకు మెరుగులుపెట్టి ఠీవిగా నడచి ముగుస్తుంది.

మహేంద్రుడు మాయావిప్రుడై కవచకుండలాలకు వచ్చి 'భిక్షాం దేహి' అన్నాడు.

"బ్రాహ్మణోత్తమ పాదధూళిచే పవిత్రమైన శిరస్సుతో కర్ణుడు నమస్కరిస్తున్నాడు"అని జవాబు.

నిజమైన బ్రాహ్మడైతే 'దీర్ఘాయు ర్భవ'అని ఆశీర్వదించాలి. ఇంద్రుని గొంతు పట్టుకుంది. "సూర్యచంద్రులవలె, హిమవత్సాగరాలవలె నీ కీర్తి శాశ్వతమవుగాక"అని దాటివేయగా కర్ణుడు కనిపెట్టి నిర్లక్ష్యంగా—"హతేషు దేహేషు గుణా ధరన్తే"అని తన హృదయౌన్నత్యం వెల్లడించి, తనకున్న విలువైనవన్నీ ఇస్తా నన్నాడు. కపటవిప్రుడు ఆశపడినట్లు నటించి వద్దన్నాడు. ఈ ఆశానటనంలోనే ఉంది కవిమానవమనస్పర్శ.

కర్ణునకు మాయాతంత్రమని తెలుసు. ఆడినమాట తప్పకుండా కవచకుండలాలు తెగగోసి ఇచ్చి వెళ్లిపోతాడు.

ఈ రూపకంలో కవి చూపిన మనస్తత్వనిరూపణం ఎన్నదగినది.

కర్ణునకు గొప్ప హృదయం ఉంది. దానిలో రాజభక్తి ఎంత దూరం ఆక్రమించినా ఏదోఒక మూల బంధుప్రేమ, ఆత్మాభిమానం, స్నేహదౌర్బల్యం ఉన్నాయి. అన్నీ కలిసి అతడు రథమెక్కుతూండగా కోలాహలం ప్రారంభించాయి. అత డంటాడు : "కోపగించిన యమునిలా విక్రమంచూపే నాకు కూడా ఈ

యుద్ధమంటే ఏదో దిగులుగా ఉంది" అనుకుని, వెను వెంటనే మాతృదేవి కుంతి జ్ఞాపకంరాగా "మొదట కుంతీదేవి నన్ను కన్నది. తర్వాత రాధేయుడనైనాను. ధర్మరాజాదులు నా చిన్నతమ్ములుగదా" అని తన ఆర్ద్రహృదయం చూపుతాడు.

## దూ త ఘ టో త్క చ ం

భాసుని శంఖారావముల చురుకు ఘాత ప్రతిఘాతాలతో సుర్రాల్లా పరుసులెత్తి ఈ రూపకంలో విశృంఖలవిహారం చేసింది.

అభిమన్యువధానన్తరం కృష్ణసందేశంతో ఘటోత్కచుడు ధృతరాష్ట్రుని వద్దకు వచ్చి దుర్యోధనాదులను లెక్కచెయ్యక నిర్భీతిగా మాట్లాడి వెళ్లడం ఇందులోని ఇతివృత్తం. ఇందులో ప్రత్యేకత గాంధారీ ధృతరాష్ట్రుల అపూర్వసృష్టి.

అభిమన్యువధవల్ల ఉత్సాహతరంగితమైన కౌరవ భటలోకంలోనుంచి ఆ వార్త ఉద్ఘోషింపబడగానే కలవరపడిన ధృతరాష్ట్రుడంటాడు— "ఎవడురా, నా చెవులను దుర్వార్తామలినములు చేశాడు ? ఎవడు వీడు మాకు ప్రియమనుకుని ఈ అప్రియవార్త చాటుతున్నాడు? ఎవడయ్యా చిరుతవానిని చంపిన మావంశనాశనాన్ని ప్రకటిస్తున్నాడు ?" అని దురపిల్లుతాడు. గాంధారి ముక్తకంఠంగా విలపిస్తుంది.

కుటుంబస్నేహోదారములైన ఈ వృద్ధదంపతుల హృదయాలను ఇంత ఉన్నతంగా చిత్రించిన కవులు లేనేలేరేమో—

ధృతరాష్ట్రపుత్రిక, సైంధవభార్య అయిన దుస్సల అక్కడే ఉంది. అంటుంది—"పాపం, పసిపిల్ల ఉత్తరకు వైధవ్యం చేకూర్చినవాడు ఎవడోగాని ఆచేతితోనే తన భార్యకుకూడా ఇచ్చినవాడయాడు" ఈ మాట దుస్సలే అనడం నాటకత్వంలో భాసుడు చూపే ఒక చణుకు.

ఇందులోని ధృతరాష్ట్రుడు కురుకులధర్మ తేజస్సుగా, కుటుంబస్నేహపరమావధిగా, అన్యాయ తిరస్కరణదీక్షితుడుగా మనకు కనపడి కవిచిత్రణములో వినూత్నవ్యక్తి అయిపోయినాడు. దుర్యోధనాదులు వచ్చి నమస్కరించగా ఆశీర్వదించడు. దుర్యోధనుడు ఆశ్చర్యపడి "తండ్రీ, ఎందు కింత ఆందోళనం?" అంటే ధృతరాష్ట్రుడు "నూరుగురు కొడుకుల్లో ఈమె ఒక్కతే ఆడుబిడ్డ నాకు. మీ అందరికంటే ఈమెమీద నాకు ప్రాణం. మీ మీ దయవల్ల ఈ బిడ్డ వైధవ్యం పొందబోతున్నదిగదా." అని దుర్యోధనాదుల దుశ్చేష్టితాన్ని ఒక్కమాటతో ఖండించాడు. తనతో తర్కంపెంచిన దుర్యోధనాదులకు నుక్కతిరగకుండా సమాధానం చెప్పి ముఖపిధానం చేయించాడు. దారుణమైన అర్జునప్రతిజ్ఞ వినపడ్డది. అర్జునప్రతిజ్ఞాభంగమైతే అతని చితారోహణమని దుర్యోధనుడు విన్నాడు. అతడు ఉత్సాహోన్మత్తుడై "మాతుల! చితారోహణమ్! చితారోహణమ్. దుశ్శాసనచితారోహణం చితారోహణమ్" అన్న మాటలు ఎంత నేర్పుగా కవి కావ్యార్థసూచనకు ఉపయోగించుకొన్నాడో గమనించదగ్గది.

ఈస్థితిలో ఘటుడు దూతగా అవతరించాడు. సముదాచారప్రకారం తాతపాదునికి నమస్కారం చేశాడు.

తన మాటకు అడ్డంవచ్చిన దుర్యోధన దుశ్శాసన శకునులను చీల్చి చెండాడాడు.

శకుని—మాటలచేతనే విజయాలు చేకూరితే మాటలవల్లనే సర్వక్షత్రియవధా జరుగుతుంది.

ఘట—ఎవరిది ? ఓహో శకునిగారా ! చిత్తం. శకునీ ! ఇది జూదంకాదు. పాచికలు పనిలెయ్యి. భార్యను అపహరించడం, రాజ్యకుతంత్రాలూ ఇక్కడ సాగవు. బాణాలతో పని ; ప్రాణాలతో పందెం.

దుర్యో—హద్దుమీరి మాట్లాడుతున్నావు. తల్లి పక్షపు రాక్షసగర్వం గాబోలు. మేంకూడా రాక్షస స్వభావం గలవాళ్ళమే. జాగ్రత్త !

ఘట—శాంతం పాపం. రాక్షసులకంటే గూడా మీ క్రౌర్యమే దొడ్డది. ఏ రాక్షసుడూ లక్కయింట నిద్రించే సోదరుల్ని కాల్పించలేదు. నిండు సభలో ఏ రాక్షసుడూ వదినగారి జుట్టుపట్టుకు పరాభవించలేదు. ఏ రాక్షసుడూ పుత్రుణ్ణి నిరాయుధుణ్ణిచేసి యుద్ధంలో చంపలేదు. వికృతరూపమూ, భీకరాచారాలూ ఉన్నా రాక్షసులకు ఏకోశానైనా దయ ఉంటుంది.

ఈ ఉక్తి ప్రత్యుక్తికలలో భాసుని ప్రజ్ఞాసారము పదతేరినది.

## ఊ రు భ ం గ ం

ఈతని ఏకాంకములలో తుదిది ఊరుభంగం. సంస్కృతసాహిత్యంలోని ఏకైక విషాదాంత రచన. ఇందులో ఒక పరిణతప్రజ్ఞుని వాణి వినపడుతుంది.

* "తొడలు విరిగిపడిన దుర్యోధనుని గాథ
మృదులకుసుమకల్పహృదయబాధ;
విశదరసవిశేషవిలసద్భాషాకావ్య
గణ్య; భాసకావ్యపుణ్యరేఖ."

ఈరూపకరచనములో కవి రససిద్ధుడు. ప్రారంభ విష్కంభంలో ఇతడు పరచిన నీరవనీరస బీభత్సవిశాల కురుక్షేత్రయుద్ధానంతరచిత్రం పాఠకహృదయాలను కలచివేసి రాబోయే దురంతవిషాదాంతఘట్టానికి పదునుచేసి పక్కకు తొలుగుతుంది.

ఈపద్యము ఈరూపకానికి ప్రస్తావన.

ఈమహాకవి సిద్ధలేఖిని ఎక్కడ సోకితే అక్కడ రసఘుంటలు చివ్వున ఎగయవలసిందే.

రెండుమూడంతరవుల్లో లెక్కచేసి అక్కడ పెట్టినట్టు ఇతడు నాలుగుమాటలతో ఒక రసం సృష్టించి పాఠకహృదయాలను గుప్పిటలో పెట్టుకుని స్పందింపజేయగలడు.

ఈ రూపకంలోని బీభత్సదృశ్యం వేణీసంహార మాలతీమాధవాలకు ఎంత బలమిచ్చిందో మనం గ్రహించగలం.

కరుణ, వీర రసాల నిర్వహణంలో ఈయన ప్రత్యేకత స్ఫుటంగా కనబడుతుంది. విశేషించి ఈ నాటికలో ఈ రెండురసాలూ విచిత్రగంగాయమునా నదీవేణికలవలె అనగి పెనగి ఒక విలక్షణమాధుర్యాన్ని కల్పించాయి.

ఇందలి దుర్యోధనపాత్రసృష్టి సంస్కృత సారస్వతానికే ఒక విశిష్టప్రసాదం. దూతవాక్యం నుంచి దూతఘటోత్కచందాకా ధీరోద్ధతుడుగా అహంకార, కుటిలస్వభావదూషితుడుగా కనపడ్డ దుర్యోధనుడు తుదిని దివ్యుడై మానవమలినాశయాతీతుడై తుదిసారి వెలిగి మరీ వెళ్ళిపోయాడు.

బలరాముడు "దుర్యోధనా! నీకు జరిగిన అన్యాయాన్ని నా నాగలితో పరిహరిస్తా"నంటే ఇతడు "నమస్కారం, కౌరవకులానికి తిలోదకమేఘాల వంటి పాండవుల్ని బతకనీ." (జీవన్తు తే కురుకులస్య నివాపమేఘాః.) అని పలికిన ఔదార్యము తుదిని అశ్వత్థామ వచ్చి నపాండవంగా కృష్ణుణ్ణి చీల్చివేస్తా నంటే—

"సకలరాజన్యలోకమ్ము సమసిపోయె;
శాంతనవు డీల్గె; కర్ణుండు చనియె దివికి;
ఎదుటనే భ్రాతృశతము హరించిపోయె;
మమ్ము చూచితి వింక చాపమ్ము విడుము."

అన్న లోకాతీతసహనమూ ఈ ఒక్క సుయోధనుడికే చెల్లినది.

విశాలకురుక్షేత్రశూన్యభూమిలో భారతచక్రవర్తి ధూళిలో, నెత్తుటిలో పొరలుతూ తలరొత్తి ఏకైకవీరమూర్తిగా అక్కడికి వచ్చిన తల్లిదండ్రులతోను, అసూర్యంపశ్యలైన తన రాణులతోను అన్న మాటలు ఈ రూపకంలోని మణిసంపద.

ఎక్కడ తాకితే మానవమనస్సు స్పందిస్తుందో ఈకవికి కరతలామలకం.

దుర్యోధనని పుత్రుడు దుర్జయుడు తల్లులతో, తాతతో కురుక్షేత్రానికి వచ్చి 'తాతగారూ, కాళ్ళులాగుతున్న'వంటాడు. ధృతరాష్ట్రుడు 'బాబూ, కాస్సేపు నడువు. తండ్రితొడమీద కూర్చుందువుగాని" అన్నాడు. పాపం! ఆతొడలు నలిగిపోయి నెత్తుర్లో దోగుతున్నాయని ఎరగడు.

దుర్జయుడు వెదకి వెదకి తండ్రిదగ్గరికి వెళ్ళి "నాన్నగారూ, అలసివచ్చాను; తొడమీద కూర్చోనా?" అంటే సుయోధనుడు "ఆఁ ఆఁ... వద్దు. నాయనా! వద్దు—

అమృతసంస్పర్శ మిచ్చెడి అనుగుబిడ్డ!
పాండువిక్రీడలం బడి వచ్చి నీదు
హక్కుగా ననుభవించు సింహాసనమ్ము
ఊరుతల మింక నీకు లేదోయి తండ్రి!"

అని బాధతో కుమారుణ్ణి నివారించడం చూచి ఏ సరసహృదయం ద్రవీభూతం కాకుండా ఉంటుంది?

ఈవిధంగా తన ప్రతిభాసారం వెల్లివిరిసేలా రచించిన ఈ నాటకాచార్యుని రూపకాలనుగురించి ఎంత వ్రాసినా ఏదో మిగిలిపోయినట్టే కనపడుతుంది. ఇంతవరకూ ఈ రూపకములలోని నాటకత్వం గురించే ప్రసంగించడం జరిగింది. కవితనుగురించి వ్రాస్తే మరో ఇంత వ్యాసం అవుతుంది. అవకాశం దొరికినప్పుడు ఆ విధికూడా నెరవేర్చి ఈ రూపకాలకు నేను పడిన ఋణం తీర్చుకుంటాను.

---

* ఉదాహృత పద్యములన్నీ నే ననువదించిన 'ఊరుభంగము' లోనివి.

# రహదార్లు*

శ్రీ మాచిరాజు దేవీప్రసాద్

[శ్రీ. శ్రీ. గారి సలక్షణమైన 'దేశచరిత్రల'కు విలక్షణ విహీన వికటకవిత్వపరివర్తన.]

ఏరోడ్డుచరిత్ర చూచినా
ఏ మున్నది గర్వకారణం.
రహదారీచరిత్ర సమస్తం
ధూళిధూసరపరివ్యస్తం.

రహదారీచరిత్ర సమస్తం
యాతాయాతజనసంయుక్తం
రహదారీచరిత్ర సమస్తం
పథికవాహనప్రయాణసిక్తం.

ఝాంకారగర్జితదిగ్భాగం
చక్రాంగజ్వలితసమస్తాంగం
రహదారీచరిత్ర సమస్తం
పైజమ్మాలను పాడుచేయడం.

పెనుదారులు కాలిబాటల
సామంతుల కావించెను
హైరోడ్డులు అశోకుల్లె
చరిత్రమున ప్రసిద్ధికెక్కెను.

బాటలు తీరని పట్నం భూ
స్థలమంతా వెతికిన దొరకదు;
పురమంతా తీరును వీథులు
కాకుంటే కోయును మజ్యకి.

దుమ్మెక్కిన సితభిత్తికలూ
పల్లిచ్చిన పృథువేదికలూ
ఇహలోకపు వైతరణీ†
పురవీథుల భూషించెను.

చిక్ పిక్ క్వా దంతపుకట్టూ
చైనాపాపూ, గోవిందప్పా
గిడ్డంగులు, గుళ్ళూ, కోనేళ్లూ,
వీథుల భాగ్యం నిరూపించినవి.

లారీ రాజం, భారీ యిఫ్ఫా
రోడ్డురోలర్, బ్రేక్ గా క్యారీర్
ట్రాంకారూ, ఏవైతేనేం, ఒత్తే
యును టూత్పేస్టుల ట్యూబల్లే.

---

* ఈ యిది మద్రాసు వంతెపేకసుండా ఏలూరువర్య సాహిత్యపరిషత్తున శ్రోతలపై హుంకాహుంకిని వడ్డించ బడ్డది.

ఈ క్రింద సూచించిన మార్జిన్ దాఖలా జనసందోహం సావధానంగా విని ఏకగ్రీవంగా మెచ్చుకో వటంకూడా జరిగింది. హాజరైన జనబాహుళ్యం... 1598.

14 ... అన్యభాషీయులు (బందోబస్తుడ్యూటీలో)
24 ... చెవిటివారు (అ. భా. సెన్సస్ ప్రకారం)
350 ... నిద్రించువారు.
224 ... గుఱకతో నిద్రించువారు.
448 ... పైనఅకవల్ల వినపడనివారు.
532 ... స్త్రీపర్యవేక్షణానిమగ్నులు.
1592 ... ఖరవి.

అనగా విన్నవారు—
1598
1592
1 శ్రోతుడు.

∴ ఏకగ్రీవంగా మెచ్చుకొన్న జనసందోహం = 1.
‡ ఉ. ఇది చదివిన నేను.
† సైడుకాలువ.

జమీందారూ, గుర్రపుసార్టూ
సర్కిల్ శకటపు ఘుర్ఘురనాదం
యుద్ధపుసైన్యపాదవిఘాతం
నాళుల నన్నిటి స్పందించును.

వామహస్తపు వక్రీకరణం
భటవేదిక కర్ధ్రభమణం
కుచోద్గారితతీవ్రధ్వానం
పుట్టిన వెన్నో రక్షణకై.

ఆకసమంటే ఓవర్ బ్రిడ్జి
ప్రక్కన పరచిన పద వేదికలూ
పచ్చని ఎర్రని దీపకాంతి
తగ్గించున ప్రాణాపాయం?

ఒక కారును వేరొక కారూ
ఒక బస్సును వేరొక లారీ
చుంబించే క్షణమందున,
రూల్సన్నీ దాగెను ఎచ్చట?

ఈ నడవీథికి సంగమ ముందా!
ఆరహదారీవాలం బెంతది?
పోసిన రాళ్లూ నడపిన గుళ్లూ
యివి కావోయ్ బాటల భాగ్యం.

బంగాళాదీవపు తేజం
త్రాసింగుల కేటాయింపులు
శృంగాటకకింకరు నాట్యం
యివి కావోయ్ బాటల శాస్త్రం.

వింధ్యధరావిపిన శ్రేణుల
భీకర కానల చిందులు త్రొక్కే
మార్గా లెన్నో కావా లిప్పుడు
మరణించిన మరణించని సత్యం.

ఏ ఘన్నున ఫియిడ్షైడ్స్
బర్మాదేశపు కాందిశీకులు
లంఘించిన వాయుతనూజుడు
దారెరుగని ధీరు లందరూ
ధృవాంతర స్కేటర్; ఎస్కిమో,
పంథా లెరుగని పాదచారులూ
మార్గాటవి గమ్యావిశేషం
గ్రోలింతురు గోల్డ్స్ఫ కల్లే.

రహదారుల మధ్యదారిలో
అగుపించే హంతకు లెవ్వరు
ప్రక్కన పెట్టిన రోలర్ కాదోయ్
దాని గుద్దిన బం గ్లెన్నీ ?

నల్లమలాకనుమలమధ్యన
జల్లించని వంకర లెచ్చట
మైలున్నర కృతసైరందున
గోళ్ళను లేపని రా గ్లెన్నీ.

కారాకోరం, లక్ష్మణఝూలా
టర్కీలో గ్రహాంతరమార్గం
హుగ్లీబ్రిడ్జి, ధెర్మాపైలే
యమునాస్తంభితఘట్టంలో
చారిత్రకవిభాతసంధ్యల
మార్గవినిర్గతశాస్త్రిం బెట్టిది ?

ఏగీతం ఏకాలంలో
సాధించిన దీ పరిపూర్ణం
ఏ జలసూత్రం, ఏ కలవింకం
చూపించిరి యీ వికటత్వం
ఎగతాళుల యీ ప్రతిబింబం
ఈ భావం, ఈ కిష్కింధం,
ఈ భావ్యం, ఈ బాంధవ్యం.

---

# అనుమానం ప్రాణసంకటం

[కథానిక]

●

శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి

పైన మబ్బు వేసినట్లుంది. గాలి సరీగ్గా ఆడుతున్నట్లు లేదు. సాంబయ్యగారు బాగా మాసిన గడ్డాన్ని అలవోకగా నిమురుకుని, భ్రుకుటిని సడల్చాడు. కుంకుమబొట్టు చెరిపేసింది. యిందాకటి నుంచీ చెవులు దోరపెట్టుకుని, కళ్లు మూసుకుని, శ్రావ్యమైన సంగీతం వింటున్నట్లున్న సత్యం కళ్లు తెరిచాడు. సాంబయ్యగారికేసి చూచాడు. తను యిందాకానే సమర్పించిన తాంబూలం అల్లాగే వుంది. కూర్చున్న సాంబయ్యగారు అల్లాగే ఉన్నాడు. గొంతుక పెసల్చుకుని, "అయ్యా! పంచమభావం చూస్తారూ!" అన్నాడు.

సాంబయ్య కళ్లు ఓసారి చికిలించి, బాబూ! మీకు యింకా పాతిక ముప్ఫైలోపునే, అప్పుడే ఏంతొందర!" అన్నాడు. సత్యం మాట్లాడలేదు. "పంచమ భావాన్ని గూర్చి చూచేప్పుడు అటు ద్వితీయం, ఇటు సప్తమంగూడా చూడాలంటాను. వింటున్నారాండి... ఈ జాతకానికి..."

"నాదేనండి జాతకం!" అన్నాడు సత్యం.

సాధారణంగా, తన జాతకాన్ని తనదీ అని చెప్పటానికి సంకోచపడతారు జనం. అందుకూ 'యీజాతకానికి' అని పల్లవి ప్రారంభించటం. కాక, 'ఈజాతకానికి' అని చెప్పటం వారి. 'గడ్డం అంటే బొట్టు' అన్న సోది పద్ధతినిగూడా పోటానికి ఇది వీలు. నాదే ఈజాతకం అని చెప్పినవాడు, ధక్కా మొక్కీలకు అగ కలపన్న మాట—అనుకుని సాంబయ్య "చిత్తం. అతే చెప్తున్నా. యీ జాతకానికి పుత్రపుత్రికాసంతానం ఉంది. ఎవరెవరు, ఎందరెందరూ! అని ప్రశ్న! సహజం. యిద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. చిత్రం ఐన జాతకం సుమాండి—నలుగురిచేతా ఓహో అనిపించుకునే జాతకంగాని, మరోటా! సంతానం... కొంచెంఆలస్యం. ఆలస్యమే మంచిదిలెండి. యీలోగా నాలుగుతిరహోలా గమనించవచ్చు. స్థిమితపడవచ్చు. ఏమంటారు?"

సత్యం వింటున్నాడు. అసలు అతను వచ్చింది యిందుకే పుత్రప్రాప్తిఉందా లేదా అనేది మనస్సును మథిస్తోంది. భార్య అయితే చాటుగా తనదగ్గిర వాపోయింది. తను ఏమీ పెదిమ విప్పలేదు. యింట్లో ఉయ్యాల ఊగడం, సన్నసన్న అల్లర్లూ, తను యింటికొచ్చేప్పటికి నవ్వి వాటేసుకోటం, ముద్దు పల్కులతో మురిపించటం—వీటికోసం గుండె ఆరాటపడుతోంది. కనుక్కుంటే ఆలస్యం అని చెప్పారు ఒకరిద్దరు. మీరూ అమాటే అన్నారు. యింకేం! కాక, సాంబయ్యగారు యిందాకటినుంచీ చెప్పినవి అన్నీ యథార్థాలు అని హృదయం అప్పుడే చెప్పేసింది. నిజం చెప్తారనేగా యింతదూరం తను వచ్చింది. "చిత్తం, చిత్తం" అన్నాడు సత్యం.

"అసలు యీ జాతకంలో ఉన్నది ఒక్కటే గమత్తు."

"చెప్పండి."

"చిత్రం, చెప్తా. ఓ, యామైనా జంఝామారుతంగా పెరుగుతుంది, దళే!"

"గమత్తు ఏమి టంటారు..." జిజ్ఞాసతో అడిగాడు సత్యం.

సాంబయ్య నవ్వాడు.

"చెప్పండి."

"యిల్లాంటివి గుండెనిబ్బరం ఉన్నవాళ్లకే చెప్ప మని శాస్త్రం."

"ఫరవాలేదు. చెప్పండి..."

"చెప్తున్నా. చిత్రమైన శృంగారయోగం వచ్చి పడుతోంది!"

నవ్వక, తుళ్లక, యికిలించక, నిశ్చలదీపంలాగు ఉన్నాడు సత్యం.

సాంబయ్యగారు ఆగారు.

"చెప్పండి, చెప్పండి" అని కుతుకం చూపాడు సత్యం.

"నాయనా! యివీ ద్వంద్వాలు. ద్వంద్వాలు దాట డమే యోగ్యత. తొందరపడకు మరి. నీవు ఎవరిమీద ప్రేమ కురిపిస్తావో ఆ స్త్రీహృదయం నీ మీద మన సుంచదు, పరాసక్త. నిన్ను మనసా తనవా డని ఎంచు కునే స్త్రీని నీవు కన్నెత్తి చూడవు!"

చాలదూ, చిత్రానికి.

సత్యంముఖం వింతగా అయింది. "వివరించాలి, వివరించి చెప్పం" డన్నాడు.

"శాస్త్రం యింతే చెబుతుంది. సమన్వయం ఎవరికి వారు చేసుకోవాలి. మాట వరసకు—నీవు మరొక స్త్రీ మీద ప్రేమ కురిపించవచ్చు. ఆమె నిన్నెరగనట్లుండ వచ్చు!..."

"నే నింకో స్త్రీని ఎరగను."

సాంబయ్య నిజమా అన్నట్లు చూచాడు.

"నిజం. నేను మరో స్త్రీని ఎరగను. వాంఛించలేదు కూడాను" అన్నాడు సత్యం. అతని కళ్లముందు సీత కనబడుతోంది. యిన్నేళ్లూ తాను గోతిలో పడ్డాడా? హృదయం కుంగుతోంది...తన భార్య అనేకాక, సీత అనికూడా అతను అనుకున్నాడు. సీతనేగాని మరొకర్ని చేసుకోనన్నాడు; కున్నాడు.

"ఐతే మరొక స్త్రీ నీకయి తన హృదయాన్ని సమ ర్పించుకూం దన్నమాట. శాస్త్రం తప్పదు!" అని దస్త్రం కట్టి పెట్టాడు సాంబయ్య.

కావాలని లేవలేక కూచున్నట్లు కూచున్నాడు సత్యం...

"మరింకా యేమైనా ప్రశ్నలు....?"

"లేవండీ!"

సత్యం బరువుగా లేచాడు. సాంబయ్యగారు... ఏదో చెప్పబోయారు. అతని చెవికి ఎక్కలేదు ఆ మాటలు. తల వొంచి బరువుగా ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

సీత వెక్కిరిస్తున్నట్లు కనబడుతోంది. యిన్నాళ్లూ, మరెవరో వాసనచూచిన తల్లో పూలన్నా, తను చూచి ఆనందించింది! కాఫీహోటలులో రేడియో చెవుల్ని ఆపేస్తూంది. సన్నగా చినుకులు!! సత్యం కాఫీహోటలులో దూరాడు. శూన్యం. ఎవరో జనం, ఈగలల్లే వస్తారు. ఏదో అరుస్తారు, వెళతారు. రోడ్డు మీద జనం ఎందుకో నడుస్తారు. పోతారు. సర్వర్ వచ్చి, ఏదో అడిగి, లాభంలేక వెళ్లిన సంగతి తెలీని స్థితిలో ఉన్నాడు. ఉలిక్కిపడి తలెత్తి చూచాడు. పదిగంట లయింది. ఎటూ కానివేళ, వచ్చినందుకు కాఫీ తాగేస్తే సరి—బిల్లు చెల్లించాడు. సిగరెట్లు కొన్నాడు. మళ్లీ సిగరెట్లు మానేసికూడా రెండేళ్లయింది. అంటించాడు. ఘాటుగా వుంది. రోడ్డున పడ్డాడు.

సన్నసన్న తుంపర ముదిరి జల్లుదశకు వచ్చింది. తడవడం ఎందుకని యాదాలాపంగా హోటలులోకి వెళ్లాడు. భోజనానికి ఎందరో టిక్కెట్లు కొంటున్నారు. తనూ కొన్నాడు. వడ్డన అయింది. ఉల్లి పాయల పులుసు యింత వడ్డించి వెళ్లాడు. పులుసు పెడితే, సీతే పెట్టాలి. అమృతం. తనే నేర్పాడు. ముద్ద ఎక్కలేదు. విస్తరినిండా కూరలు, పచ్చళ్లు. ఓం ప్రథమంలో పులుసు. తనకు యిష్టమైనవే అన్నీ. నోటికి ముద్ద ఎక్కలేదు. ఏమీ అవలేదు. ఏం చెయ్యాలికి ఏం చెయ్యాలో తోచదు, తడిబట్టను పిండి

నట్టు ఏదో గుండెను పిండేస్తోంది. అన్నం వదిలి, చెయి కడుక్కుని బయటపడ్డాడు. సిగరెట్టుమీద సిగరెట్టు దహిస్తూ కూచున్నాడు. తోచదు. కూచో లేడు. వాన వెలుస్తోంది. లేచాడు. నడవాలి. ఏదో చెయ్యాలి. హుఁ. యింతకాలమూ తాను నందనవనం అనుకున్నది నరకం అన్నమాట, నటన అన్నమాట. ఎంత గొప్పగా నటించిందీ...చాచి దవడపళ్లు ఊడేట్టు కొడితే-ఇంత ద్రోహమా ? ఎవర్నీ కొట్టనం...తప్పు. ఛ. కొట్టనేమా...నీకకు ఎదురుగా నవ్వుతూ నుంచుని, 'నాకు తెలిసిందిలే!' అంటే. ఇంకేముంది ?...

"ఇంతకూ నిజం అంటావా ?"

"ఎందుకు కాగూడదు ?"

ఎవరూ లేరు. తానే ఇద్దరైనాడు. రెండో వాడి మాట అది.

"ఏమిటి కాగూడదు ?"

"అబద్ధం"

"అబద్ధమా ? వుత్తది"

"నీవు ఉత్త వెదలసన్యాసివి. ప్రతీదీ నీకు అనుమానమే. వాడెవడో ఏదో అన్నాడని యిల్లా మల్లా గుల్లాలు పడుతున్నావు !"

"అంతే నంటావా ?"

"అక్షరాలా. వాడి బొంద."

"ఎందు కల్లా చెప్పా లంటావు. వాడి కేమిటీ లాభం—ఇలా చెప్తే"

"లాభంలేదు, నష్టంలేదు. వాడి కలా చెప్దామనిపించింది, చెప్పాడు. ప్రతి దానికీ డూడూ బసవన్నా అని తల ఆడించేవాళ్లుంటే ఎన్నయినా చెప్తారు"

"నాన్సెన్స్. వాడు వయస్సు, అనుభవం ఉన్న పెద్ద మనిషి"

"కాదు. నీవు అయిదు రూపాయలు ఇచ్చి, యీ మాటను కొనుక్కున్నావు !"

"ఇందుకే వెళ్లానంటావా ?"

"ఆ. కాళ్లుచ్చుకు లాక్కెళ్లినట్లు వెళ్లావు."

"సంతానంవిషయం కనుక్కుందామని"

"శాస్త్రి చేశాడు."

"..............."

"అయినా నీలో వుందిలేస్తూ. వాడెవడో అని విచారిస్తివి. వాడు చెడు చెప్పటంలో గొప్పవాడు అని చెప్పిరి నలుగురూ. అదే మన క్కావాలి అంటివి. వాడు ఖయాలీ అన్నారాయె. ఖయ్యాలీలే నిజం చెప్తా రంటివి...యిల్లా ఎవ రెన్ని చెప్పినా, అదంతా ఓహోహో, ఛేఫ్. అదే మనక్కావాలి అని పరిగెత్తు కొచ్చావ్. అనుభవించు"

"మన కర్మం ఇంతేనని అఘోరించ మంటావ్ ?"

"నేను నీకు చెప్పనిక. చెప్పిచెప్పి విసుగేస్తోంది గూడాను"

"మాబాబుగా, నీమాట విన నంటానా ?"

"ఎప్పుడు విన్నావ్, ఎప్పుడూ వెలక్కాయి నొక్కినట్లు నానోరు నొక్కిపారేశావుగాని!"

"తప్పు. క్షమించు. ఇక చూస్కో"

"అయితే, వెళ్లి, నీవు అంటే ఎవరు పడి ఛస్తాం టారో వారిని వలవేసి వెతుకు"

"సాంబయ్య చెప్పింది నిజం అని నీవూ నమ్మా వన్నమాట !"

"ఏం చెయ్యనూ. నా సొంత అభిప్రాయం ప్రకారం నమ్మను"

"నీ అభిప్రాయం వివరిస్తావా ?"

"ఆ. ఇదంతా తుడిచిపారేసెయ్. నీదారిన నువ్వుండు!"

"మనస్కరించటంలేదు! "

"ఐతే అఘోరించు !"

"ఉపాయం ఏమీ లేదూ...?"

"ఇక్కడే నాకు రేచిక్కు రేగేది...వాడెవడో అన్నాడని పట్టుకూర్చుంటావేం ?"

వాన మళ్లీ ముంచుకొస్తోంది. పాంపిల్లల్లాగా జలదార్లలో నీళ్లు పోతున్నై. దగ్గర్లో ఉన్న గుళ్లోకి దూరాడు సత్యం. అక్కడో కాయన చేతులు చూచి చెప్తున్నాడు.

"చెయ్యి చూపించుకుంటే—" అనుకున్నాడు.

"ఇక శాస్త్రి చాలదూ...?" రెండోవాడు అన్నాడు.

"నామాటా విను. సుతరామూ కొట్టిపారెయ్యకు. జాతకానికీ, సాముద్రికానికీ ఈ తేడా ఉంది. మన పుట్టిన టైమూ యివన్నీ సరిగ్గా లేక మన జాతకం సరికి తత్తెడు ఎడం కావచ్చు. చెయ్యి అల్లాకాదు చూడూ!"

"ఓరి ఓబయ్యా...వీళ్లకు భవిష్యత్తు తెలిస్తే వాళ్లే బాగుపడుదురుగా"

"కర్మం అల్లా వుందని తెలుసుకుని నిశ్చింతగా ఉన్నారేమో"

"ఇక నీకు చెప్పి లాభం లేదు"

సత్యం చూస్తూ అలాగే నుంచున్నాడు. "ఏడిసి నట్టుంది. అన్నీ అబద్ధాలే. గంజాయి ముండా కొడుకు!" అంటూ చేయి చూపించుకున్న ఆసామీ చెయి దులుపుకుంటూ లేచాడు. నవ్వి, పళ్లికిలిస్తూనే మరోడు చెయ్యి చాపి ఆయనముందు కూచున్నాడు. సత్యం అప్పుడే అంటించిన సిగరెట్‌ను విసిరి పారేసి రోడ్డు పట్టాడు.

తను యివాళే బయలుదేరి యింటికి వెళ్లాలన్న మాట గుర్తొచ్చింది. యేమైనా వచ్చితీరుతానని చెప్పాడు. సీతతోనే గదా...ఏం వెళ్లకపోతే. అలాంటి దానితో చెప్పినట్లు నడుచుకోవాలిగూడాను!

"తప్పకుండా వస్తారుగదూ!" అంది కళ్లల్లోకి చూస్తూ.

"ఆ" అని పుట్టింటికి పంపాడు. తను యిల్లాగ వచ్చాడు.

బర్రుమంటూ బస్సు వచ్చి యింత బురద చిమ్మి వెళ్లింది. తన బట్టలు చెడ్డై.

జట్కాబండీ రాచుకుంటూ వెళ్లింది. వెంట్రుక వాసిలో తప్పిపోయిందిగాని మీదా పైన దెబ్బ తగిలేదే. పైగా జట్కావాడి సాధింపు. 'సత్యం' అలాగే తన బసకు చేరాడు. హోటల్ గణగణమంటోంది... గది అంతా అర్ధాన్నంగా వుంది. అద్దంలో తన ముఖం పీక్కుపోయినట్లుంది. తల పగలేస్తోంది. నాడు. పెందరాళే యింటికి చేరితే నయం. మంచాన పడితే నో ఏమోగూడా. కర్మ అనిపించింది. ఎందుకూ యింటికి వెళ్లడం? దొంగప్రేమలూ, నటనలూ చూడ్డానికేగా. అంతకన్నా ఏ కాశీరామేశ్వరాలకో లేచిపోతే నయం.

దాన్ని ఇంత లాలించే జవరో...? ఎవడో వెధవ. అమేధ్యం అని తెలిశాక రాయిపెయ్యడం దేనికి? మంచంమీద వాలాడు. ఇకో ఇకో అనుకున్నాడు. మసకమసకగా, మబ్బు మబ్బుగా కునుకు కల.

"ఏమండీ—ఏమండీ..." సీత.

"ఏం?"

"పండక్కి ఏం తెచ్చారు?"

"పరుపుకింద ఉంది చూసుకో..."

"నిజంగానా... నిజంగానా..." పరుపుకింద నుంచి కొరడా తీసి, "యిదేమిటి... యిదెందుకు?" అంది.

"నిన్ను ఉతకటానికి" అందామనుకునిగూడా "నీచేతి కిచ్చి ఉతికించుకోడానికి" అన్నాడు.

"యివేం మాటలండీ!" అంది సీత. సీత వీపు— అందం చిందినట్టుండే వీపు రవికలోంచి మెరుస్తోంది. యింతలో సీతను ఎవరో పిలిచారు... "సీతా!" ఆగింది— "నేనంటే అసహ్యమా?"

తలుపు దడదడమని ఎవరో బాదారు. బాదుతున్నారు. లేచి తలుపుతీశాడు. ఎవరో. పక్కగదికి వెళ్లటానికి బదులు ఈ గదితలుపు బాదారు. మళ్లీ నిద్ర పట్టలేదు. ఏకాఏకిని తన సామాను సర్దుకున్నాడు.

"ఆను!" తన రెండోవాడు.

"ఏం?"

"యివాళ కదలకు. రేపు ప్రయాణం"

"ఏంకథ?"

"యివాళ వెళ్లి యింట్లో ఏం ఉపద్రవం తెస్తావో?"

"నే నసలు యింటికెళ్లను... కాని గంటలకు— కాదు, మా చెల్లెలిగారింటికి—"

"ఐతే—మగాడివే"

"మాట!"

తన రెండోవాడు ఐపు లేడు. హోటల్ వాళ్ళకు లెక్కయిచ్చేసి జట్కాను పిలిచాడు. రైలుస్టేషనుకు వెళ్ళి, ఏ రైలు పోబోతూంటే ఆ రైలు ఎక్కుతాడు తను.

"ఎక్కడికి సామీ?" జట్కామనిషి.

"బస్ స్టాండుకు!"

జట్కాబండీ కదలబోతోంది. వద్దు. సరేలే. ఎవరో యీడ్చుకుపోతున్నట్లుగా వుంది తనకు. నేరుగా వెళ్ళి బస్సులో కూచున్నాడు. బస్సు కదిలింది. వికారం. యమయాతన వేరే అక్కరలేదు. అంతా ఇక్కడే అనుభవిస్తున్నా అనుకున్నాడు. కుదించి, ఎత్తేత్తి పడేసి, ఈడిగిలబడి, సాగి—మారాంచేస్తూ బస్సు పోతోంది. బస్తాలో కూరిన దూదిలా నుంది లోపలి ప్రజ. దీపాలు పెట్టబోతారు. సత్యం బస్సు దిగాడు. చీకటీ, వెలి బూడిదలాంటి వెలుతురూ యుద్ధంచేస్తున్నట్లుంది. కండెలు అమ్ముతున్నారక్కడ. మరోబస్సు రావాలి. "సీత ఈ పాటికి ఏం చేస్తుంటుందో!" మనస్సును ఆపలేకపోయాడు. ఇంకా అరగంటకిగాని బస్సు రాదు. కండెలు అమ్మేచోట జరుగుతున్న గమత్తులు చూస్తున్నాడు. పసివాళ్ళ ఏడుపు, పెద్దవాళ్ళ బేరాలు. ఖాళీ కాలని కండెల్ని యివ్వడం, అణాలు సంచీమడత కిందికెయ్యడం —రద్దీగా వుంది. కోరంటికంలాగా ఛలిగాలి. బస్సువొకటి వచ్చింది. అత్తారింటి ముఖమై ఐరుతున్నాడు సత్యం.

"సీత ఏం చేస్తూంటుందో...?" తనకై ఎదురు చూస్తూంటుందేమో! ఏమో — యీవేళా రాకపోతే మంచిదని మనసులో ఓ దణ్ణం పెడుతూంటుందో! చీకట్లు అలముకున్నై. బద్ధకస్తుడి బుద్ధిలాగా తీవ్రంగా పోతోంది బస్సు. కారాపి, ఎవరో ఒకామె ఎక్కింది. ఆ చీరరంగు కారుదీపంముందు ఎంత బావుందని! జానక్కి యీరంగుచీర లిష్టం. జానకి, పాపం, ఎక్కడుందో— ఏం చేస్తోందో... జన్మంతా ఏడవటానికి పుట్టింది జానకి. పాపం, తాళికట్టినవాడు,— ఎందుకులే — జానకీమంచితనం, చక్కదనం అంతా భస్మహాస్యం అయింది. బస్సు ఆగింది. నేలంతా తడి. బాగా వాన కురిసినట్లుంది. తన సామాను తీసుకొని కదిలాడు. కంకరరాళ్ళు కుక్కపళ్ళలే గుచ్చుకుంటున్నై. రోడ్డు అయింది. బురద. హోల్డాలును నెత్తినెట్టుకుని, ఊతంగా అడుగులేస్తూన్నాడు. గుళ్ళదగ్గిర కొచ్చాడు. సంగీతవిద్యార్థి ఎవరో జంటస్వరాలు వీణ మీద స్ఫురితం గమకంలో సాధికచేస్తున్నాడు. సాపాలమధ్య, 'ని' అనుమానంగా తలఎత్తి దించుకుంటోంది. చీకటి దీపాన్ని కమ్ముకుంటూన్నది. దారంతా ఒకటే బురద. రావిచెట్టుదగ్గిర మలుపులో కిందపడవలసిందే—

సత్యం అత్తారింటికి చేరాడు. చీకటిసుయ్యారంగా వుం దిల్లు... సకిలించాడు.

"ఎవరదీ?" ఒక గొంతు.

ఎవరు వారసైనా కాదు.

"నేనే" అన్నాడు.

అత్తగారు దీపం చేతపట్టుకువచ్చింది. 'మీరా!' అంది. మరదలు నీళ్ళు తెచ్చింది. కాళ్ళబురద వదిలేసరికి బ్రహ్మప్రళయం ఐంది;—సీత ఏది?

అన్నం తినివచ్చిన చిన్నతమ్ముడికి కథలు చెపుతూంది. విని, లేచివొచ్చింది. నవ్వుతూ— 'ఇప్పుడేనా రావడం?' అంది. ఏం నటన? ముభావంగా ఊఁ అన్నాడు సత్యం. గూట దీపం - నోట అన్నం అయింట్లో. తన మామగారూ, రామ్మూర్తీ వచ్చారు. రామ్మూర్తి సీతమేనమామ; తనయీడువాడే...వొస్తూనే రామ్మూర్తి 'సీతా!' అన్నాడు. ఆ పిలుపు అతిచనవుకు చిహ్నం.

"దొంగ దొరికాడు!" అనుకున్నాడు.

"మేనమామ మరి..." అన్నాడు తన రెండోవాడు. యీరెండోవాడు చిత్రమైన సన్యాసి. పిలిస్తే పలకడు. వాడి చిత్తం వొచ్చినప్పుడు ఊసిపసితాడు. గయ్యాళిప్రేయసికంటె కనాకష్టం."

"అందుకే—అందుకే—" అన్నాడు సత్యం.

"నోరు మూసుకో. రొష్టుపడకు !"

"మీ ఆయన్ని మడికట్టుకోమన వేమే !" రామ్మూర్తి ఏంఅధికారం చెలాయిస్తున్నాడు!

కానీ—కానీ—తొందరపడి రొష్టుపడకూడదు. ఔచిత్యం కాదు... ఔచిత్యం ఎంత గమ్మత్తయినమాట.

ఆనాడు, గుడివెనకాల మిత్రమండలి కలిసింది, నలుగురు మగపురుషులు కలిశాక— చేసే దేముంది... ఫలానావాడి పిల్లాగా! అనేకదా. నరసింహారావుమాట వచ్చింది. నరసింహారావు అన్నివిధాలా యోగ్యత కలవాడు. గొప్పవాడు. రామబ్రహ్మం భార్యాప్రియుడు అన్నది తప్పు, రామబ్రహ్మమూ తగ్గవాడే... 'సుశీల' అంటే పడిఛస్తాడు. ఒక యింట్లోనే వున్నా రామబ్రహ్మమూ, భార్య, నరసింహారావూ, ఏఒక్కనాడూ ఏమీ లేనట్లు ఎరగనట్టుంటారు. ఎవరెవరి పనులు వాళ్లు చూస్తారు... యీ కథంతా విని— వేదాంతిగా రేమన్నారూ— వాళ్లకు ఔచిత్యం తెలుసునన్రా! మంచో చెడ్డో జరిగింది. జరుగుతూంది. జరుగుతుంది. కాని నొప్పించడం, అల్లరిచేసుకోడం, గత్తరా లేదు. ఔచిత్యపరులు వాళ్లు!

"యిదా ఔచిత్యం—" అన్నాడు తను.

"కాదా..." అని రెట్టించి వదిలారు వేదాంతి గారు.

సత్యానికి అప్పుడూ, అది గుర్తుకువచ్చి యిప్పుడూ నవ్వొచ్చింది. అన్నాలయినై. ఆడవాళ్లు భోజనాలకు కూచున్నారు. "రావోయ్ సత్యం"—రామ్మూర్తి ఎంత గుండెలుతీసిన బంటు. సంకోచం కూడా ఏమీ లేదు.

"ఏమిటి విశేషాలు ?"—అరిసే.

"ఏమున్నై..."

"నీ ఖరీదైన సిగరెట్టు యిల్లా తే."

"తీసుకోండి. యిదుగో..."

"ఈ దసరాలకు ప్రోగ్రాం ఏం వేశావ్...? మైసూరు కేమన్నా వెళతావా ?"—సత్యం నవ్వాడు.

రామమూర్తి అవీ యివీ మాట్లాడి, ఆవులించి చిటికవేసి పడుకున్నాడు. మామగారు ఎప్పుడూ మితభాషే. రోజుకు నాలుగో అయిదో మాటలు ఆయన మాట్లాడేవి. కాలుతూన్న సమిధను విసరి పారేసి గదిలోకి వెళ్లాడు. కలంకారీదుప్పటి ఇస్త్రీది పక్క వేసివుంది. దీపం ప్రఫుల్లంగా వెలుగుతోంది. సత్యం దిన్ని వాల్చాడు. తల్లీకూతుళ్లు ఆమాటా యీమాటా నెమ్మదిగా అనుకుంటూ భోంచేస్తున్నారు. యిదీ వరస. ఏ వేళకూ తెమిలిరారు. నిద్ర ముంచుకు రాబోతోంది. సత్యం నిద్రకు స్వస్తి చెప్పాడు. ఎలా కోత ప్రారంభించడమా ? అనుకుంటున్నాడు.

"భార్యకు దండంబు పడకకు వెలిచేత" రెండో వాడు.

"మరి శరీరం అలుపు తెచ్చుకోమంటోంది !" సత్యం.

"నిగ్రహం, నిగ్రహం అనంటావే—ఇదీ నిగ్రహపు వేళ"

"మంచి సలహా చెప్పావ్."

"ఏంలాభం......నిమిషం—నీవు తృణీకరించడానికి."

"నీదుంప తెగా. ఎప్పుడూ నామీదే కత్తులు దూస్తావేం..."

రెండోవాడు తల వొంచి తప్పుకున్నాడు. మంచినీళ్ల చెంబుతో సీత చక్కా వొచ్చింది. ఎదురుగుండా వెళ్లి చేతులు చాచేవాడే. నిబ్బరించుకున్నాడు. తలుపు గడియపెట్టి సీతే వచ్చింది...తమలపాకులు తీసుకుని చిలకలు చుట్టింది. ఇచ్చింది.

"భోజనమైన గంటకు—" అన్నాడు.

"ఇద్దరం కలిసి వేసుకుందా మనుకున్నానండీ!"

ఓరచూపు చూచింది. సత్యంగుండెలు జల్లుమన్నై. నటన అయినా ఎంత మనోహరం, నటన అని తెలీకపోతేను. తెలిశాక నిస్సారమేకాక కారం కూడాను.

"ఏం అలా గున్నారు?" సీతే.

"ఏం, ఎలాగున్నాను ?"

"ప్రయాణం వల్ల కాబోలు—ఏమిటోగా వున్నారు."

ప్రతిదీ తను ఎవరికి చాటులేకుండా చెబుతూ వచ్చాడో—ఆమనిషి—పక్కలో తాచు—శత్రువు. చూస్తూ ఊరుకున్నాడు.

"ఏం జరిగిం దేమిటే?"

"ఏం జరగలేదే."

అబద్ధం. యీమాత్రం తెలుసుకోలేరా అవతల వాళ్లు?

"సరే, మీయిష్టం" అని చోటుచేసుకుని పక్క మీదే వాలింది. ఆడవాళ్లు—అబ్బ, ఎంతకైనా తగు దురుసుమా. మాట అనడానికి వీలులేకుండా, మాట మన మీదే ఉంచి మెసులుకొస్తారు. పూనం పర్యావర్థ పానకం అనుకున్నాడు సత్యం.

సీతే చొరవచేస్తుంది. గాంభీర్యంచవ చ్చను కున్నాడు. సీత ఆవులించి "పొద్దుటినుంచీ రెక్కలు విరుచుకున్నాను. నిద్ర వస్తోం" దని పడుకుంది.

నిద్రరాక, నిద్రపట్టక, నిమిషాలు లెక్క పెడుతూ మేలుకునూచోవ్వలేక, నిద్రపోయేదాన్ని లేపి ఓనణు తెగరగొట్టా లనుకుని, రుజు వేముందని మళ్ళీ పస్తా యించి, చూదాం చూదాం అని చూచే ఓపిక చిక్క పట్టుకోలేక, సత్యం, ఓ రాత్రి నిరోయింతర్వాత కునికాడు.

తెల్లవారింది. సీతే లేపింది. కాఫీ చల్లారుకోం దని. త్రాగి, పొగ పీలుస్తున్నాడు. సీత పనిలో పడింది. పిల్లలకి చద్దన్నాలు పెడుతోంది.

నెమ్మదిగా రత్తయ్యగారింటికి కదిలాడు. బురద కొత్త అరి అడుగులు పడుతూనైన్న. ఆ అడుగు ల్లోనే తాను అడుగులేస్తూ రత్తయ్యయింటికి చేరాడు.

"ఎప్పు డొచ్చావురా? రాత్రేనా?"

ఆప్యాయమైన పిలుపు.

"ఊఁ"

"రా, సావిట్లో కూచ్చో."

నులకమంచం వాల్చుకుని కూలబడ్డాడు సత్యం. బారెడు చుట్ట ముట్టించి ఒకత సున్నాడు. జానకి వొచ్చింది. పాలసముద్రంలోంచి లేచివచ్చిన లక్ష్మిలా నుంది.

"ఎప్పు డొచ్చావయ్యా?..."

"రాత్రి"

"అంతా క్షేమమేనా...?"

"ఆ"

"పేటనుంచేనా .. మీ అన్నయ్య కని పించారా...?

అన్నయ్యంటే జానకిభర్త. అది వరస.

"ఊఁహుఁ"

"ఈ పాడుచుట్టలు మానరూ...కొంపంతా ఒకటే నసీ-మసీను"

నవ్వాడు సత్యం. ఎంతో యిష్టం ఉంటే కాని, వ్యసనాన్ని మానమనరు. ఉన్న వ్యసనాన్ని మన్నించేవారో మరి...ఆలోచిస్తున్నాడు. యిప్పుడే వస్తారా అని ఆ చుట్ట ఆసామీ, రత్తయ్య ఎక్కడికో వెళ్లారు.

"మీ అత్తగా రెక్కడమ్మా?"

"రావాలి. ఊళ్లో లేరు"

తెలిసింది. ప్రస్తుతం అంతయింట్లో తనూ, జానకీనీ.

"ఏమిటయ్యా విశేషాలు?"

"నువ్వే చెప్పాలి" నవ్వాడు. అసందర్భంగా వుంది ఆ నవ్వు. జానకి గమనించిందో లేదో తెలీదు. జానకిని రెప్పవాల్చకుండా చూస్తున్నాడు సత్యం.

"అట్లా చిక్కిపోయా వేం?"

"ఎవ్వరికీ చిక్కలేదే యింకా..."

జానకి నవ్వింది. నవ్వినప్పుడు జానకిముఖం విప్పారిన పెద్ద చామంతిపువ్వులా నుంటుంది. ఆ నవ్వు అంటే సత్యానికి ప్రాణం. ఆ నవ్వుముఖంకోసం అతను ఏ పనైనా చెయ్యగలడు. ఆత్మీయత, ప్రేమ ఉన్నచోటే అలాంటి నవ్వు వస్తుంది. తన భార్య తరపు బంధువైనా, తనకు జానకి ఆత్మీయురాలే, తనదే. జానకి నవ్వుముఖాన్ని గూర్చి తను వెనక చెప్పి నప్పుడు సీత ముఖం ముడుచుకుంది. ఊఁ—అదంతే.

"నవ్వితే ఎంత బావుంటావని!"

ఈ మాట ఎన్నిసార్లో అన్నాడు తను జానకితో. ఇన్నిసార్లూ ఆమాట తోచేది; అనేశే వాడు. ఈసారి తన గొంతుక తనకే మారినట్లు అనిపించింది. జానకి తలఎత్తి చూచింది. తలవొంచి మళ్లీ చాటలో బియ్యం ఏరుతోంది. వీధిలో ఎవరో నడిచి వెళ్లిన అలికిడి అయింది. జానకి తల ఎత్తింది తన మాటకా, ఎవరో వస్తున్నారనా...?

"సీత బాగుందా..." జానకి.

అడిగినతరువాతగా తోచింది. మంచంమీద కూర్చున్నవాడు లేచి—దగ్గిరికి వెళ్లి మంగాళ్లమీద కూచున్నాడు. జానకి ఓ రకంటి తో చూస్తూనే బియ్యం ఏరుతోంది.

"ఎందు కిప్పు డవన్నీ—"

కళ్లు మసకఅయినప్పుడు మగగొంతుక అనే మాటే అది! ఎందరెందరు జాణలు, అమాయికలు ఈ పల్లవిని పాడి వొదిలారో! జానకి ఏమీ మాట్లాడలేదు. నవ్వలేదు. తనను అర్థంచేసుకుంటోంది. తనంటే ప్రేమ కురిపించే స్థలం ప్రత్యక్షమయింది. జోస్యం అబద్ధం కాదు. అబద్ధమే అయితే—తిట్టే వాళ్లు వల్లి మళ్లీమళ్లీ జోషీలకు ఎందుకు ముడుపులు చెల్లిస్తారు?

జానకి బియ్యం ఏరటం పూర్తిచేసి లేచింది. సత్యం మళ్లీ సిగరెట్టు అంటించాడు. టీరుగ్లాసు ముందెట్టుకుని అరగారగా గుక్కెడుగుక్కెడు గొంతుకలో పోస్తున్నట్లుందిగాని—మామూలుగా సిగరెట్లు త్రాగే ధోరణి కాదు.

"రత్తయ్యబాబాయి వొస్తే బాగుండును."

జానకి పడమటింట్లోకి వెళ్లింది. ముభావంగా వుందేమి చెప్మా...?

"రత్తయ్యబాబాయి ఎప్పుడొస్తాడమ్మా...?"

"భోజనానికి వొస్తారు...!"

బిందెలో బట్టలు పెట్టుకుని చెరువుకు బయలు దేరుతోంది జానకి.

సత్యంమనస్సు గంతులేస్తోంది. మనసులో మాట గబగబా చెప్పేస్తే...

"ఉండవమ్మా ఓ నిమిషం...ఎప్పుడూ వుండే దేగా పని!"

"పొద్దెక్కటం లేదూ...పని పేరుక్కుంటుంటే మాత్రం..."

గంపంత వెళ్లబోసుకుందామని కూచుంటే, ఇప్పుడే వస్తాగా అని మరిపించి, పసిబిడ్డను మరిపించి వెళుతూన్నట్లు వెళుతోంది! గొంతుకలో వుండ ఏదో అడ్డపడ్డట్లు తనకే అనిపించింది. "సరే వొస్తా" అని బయలుదేరాడు సత్యం.

దారిలోనే బావమరిది ఎదురైనాడు. మెళ్లో వెండికంటె ఎండలో మెరుస్తోంది.

"ఎందాకా...?"

"నీకోసమే—"

"పద..."

గోడకు పిడకలు కొడుతూన్న వొకావిడ మెడ చాచి చూచి, "ఎప్పుడొచ్చా వబ్బాయ్" అంది. "నిన్ననండీ" అని సమాధానం చెప్పి కదిలాడు. దారిలో ఎవరో అపరిచిత ముఖం కుశలప్రశ్న వేసి మరీ విడిచాడు. బురద అడుసై...అడుగులు పడ్డవి. నెమ్మదిగా ఆలోచిస్తూ సత్యం అత్తారిల్లు చేరాడు. సీత ఎవరిమీదో కొరకొరలాడుతోంది. చెరువులోంచి అప్పుడే వచ్చింది కాబోలు, నీళ్లు ఓడుతోంది...

"పెత్తనా లయినాయా?"

ఏమి టా గీర్వాణం?

"మీజానకివొదిన ఏ మంది?"

"నిన్నడిగింది"

సీత నవ్వాపుకుంది. అత్తగారు ముఖం మురకటించుకుంది...రామ్మూర్తి ఇంతలో ఎక్కణ్ణుంచో ఊడిపడ్డాడు "ఏమే అమ్మాయ్!" అంటూ. "ఇప్పుడే వెళ్తావుట్రా" అంటూ అత్తగారు కసరిస్తోంది. "వెళ్లాలి! వెళ్లాలి!" అంటూ అతగాడు తయారౌతున్నాడు. పొడి బట్టలు కట్టుకొచ్చి సీత, "అందర్నీ అడిగానని చెప్పు మామయ్యా" అంది. రామ్మూర్తి స్నానానికి లేచాడు. ఏదో పనిమీద వొచ్చినట్లు వొచ్చి, "మీరుగూడా

స్నానం చెయ్యరాదూ..." అంది. తానేం తోడిపెళ్లి కొడుకా...?

"మీబావ వొచ్చేదాకా వుండవుట్రా...?" అత్తగారు.

"ఊఁహూఁ, వీల్లేదమ్మా..."

అవును. యింకా వుంటే అనుమానానికి వీలు. తెలివిగా ప్రయాణం పెట్టుకుంటున్నాడు.

"యీ ముసికివానలకు యిల్లూ వాకిలీ యేమైనమో..." రామ్మూర్తి.

"ఏమీ కావు. అక్కడే వుంటై యిల్లూ, వాకిలీ."

సీత నవ్వింది. తనమాటకే నవ్వింది. నాయనమ్మా...అని ఎద్దేవా చెయ్యడం కాదు.

రామ్మూర్తి పట్టుపంచ కట్టి జంధ్యాలు సవరించుకుంటున్నాడు. సీత మెంగుడిదగ్గిర కొచ్చింది. నటన. ఎవ రెరగరు? కాపరాని కొచ్చి ఎన్నేళ్లయినా పుట్టింట్లో కొత్తకొత్తగా వుంటం నటనా, నటనన్నరా...??

"వేణ్ణీళ్లు తోడనా?..." సీత.

"వద్దు. ఆకలి లేదు."

"ఏం?"

"నిన్ను చూస్తూంటేనే కడుపు నిండుతోంది!"

'స—ఛీ'నని పెళ్లి గా అని సీత కదిలింది. తను చూస్తున్నాడు. దబదబా వెళ్లి, మేనమామకు కుంభం తోడుతోంది. వెధవసంబంధాలు. ఆస్తి చూచో, పొలం పొలం కలుస్తాయనో, ఏకపుత్రుడనో, మేనరికమనో తొందరపడి ముడెట్టేదీ...తరువాత నిజస్వరూపాలు చూపించేదీ...కిలోపల మేనమామమాటలకు కిచకిచలాడుతోంది. వడ్డీతోసహా ఆనిక్క ముట్టచెప్తాంటే అప్పుడు—యిప్పు డెందుకు? రామ్మూర్తి బకాసురుడు నిమిషంలో అశనధ్వంసం చేసి చక్కా వచ్చాడు. చెయికడిగి—

"ఏమయ్యా సత్యం...మీ రిద్దరూ మా ఊరుకు రారూ?"

మన్యత నెందుకు?

"నిజ్జం సత్యం!"

"నే నెందుకు, దాన్ని తీసికెళ్లండి కావలిస్తే" మానుషం ఉంటే, కుళ్లి చావొచ్చు.

"అఁహా. అదేం మాట, మీ రిద్దరూ రావాలి. ఏమోయ్ సత్యం, మీ రిద్దరూ వచ్చి నాలుగురోజు లుండిరారాదూ?"

తనకే అక్కడికి పని వున్నట్లూ, యిపతలవాళ్లు త్రిపాదినక్షత్రాల్లాగ తిరుగుతూన్నట్లూ. ఎవ రెరుగరూ ఈ గడుస్దనం! "అందరం కలిశాంగనక-మీరే నాలుగురోజు లుంటే బాగుంటుంది!" అన్నాడు సత్యం.

"మామయ్య ఎందు కుంటాడూ?... అత్తయ్య కోసం బెంగపెట్టుకున్నాడు!" అంది సీత.

"నిన్ను చూస్తుంటే ఆ బెంగ పోదూ?"అన్నాడు తను. సీత వినిపించుకోనట్లు చక్కాపోయింది.

"వస్తా మరి! యీ సారైనా మీరు రావాలబ్బాయ్" అని రామ్మూర్తి లేచాడు. ఎదురుగుండా మామగారు వొస్తున్నారు. శకునం బాగానే వుంది అని నవ్వాడు తను. రామమూర్తి నవ్వలేదు. పరధ్యానంలో వున్నట్లున్నాడు. ఎంత జోరు చూపించబోయినా సూర్యుడు, ఎండకు చురుకుదనం రావటం లేదు. కూచుని లేచి - రామమూర్తి "వెళ్లొస్తానయ్యా బావా!" అని కదిలాడు. ఆపళంగా మామగారు ఉగ్రుడైనాడు. "యిదే మీజాతిలో ఉంది. ఎన్నివిధాల చెప్పినా వినవ్. అక్కడేదో పానిపోతుం దంటావ్... చాల్చాలు. ఉండరా అంటే ససేమిరా ఏమిటి?" అంటూ.

"ఈయనగ్గూడా మాటలతోరు ఉందే. తేలు కుట్టినా బిగ్గరగా ఎవరికీ చెప్ప డనుకున్నాను!" అనుకుని చూస్తున్నాడు సత్యం.

'వొస్తానయ్యా' అని రామమూర్తి కదిలాడు. వెళ్లాడు. అవును యిహ వుండటం ప్రమాదం అనుకున్నాక మనిషి నిలవడు.

సత్యం మధ్యాహ్నం నిద్రతీసి లేచేసరికి యిల్లు సందడిగా వుంది. తెంగుడు నిద్రలేచా డని చూచి సీత

యిన్ని కాలిన మొక్కజొన్నకండెలు తీసుకొచ్చింది. సత్యం సీతను అదేపనిగా చూస్తున్నాడు!

"చూస్తారేమండీ—నమిలి పారెయ్యక."

"ఈ సరదా రామ్మూర్తి ఉన్నప్పుడు యేమైందీ? వాడు వెళ్ళేవెళ్ళాడు. యిక వీడు అని తెంతు మొదలెట్టిందా? ఆడవాళ్లు అసాధ్యులు" అనుకుంటూనే సత్యం నోటికి పని చెప్పాడు. వేడి వేడి కాఫీ తాగి, తల దువ్వి నీటుగా బయలుదేరాడు.

"పెందరాళే రండి!" అంది సీత ముద్దుగా.

తల ఊపి వీధిలోకి వచ్చిపడి కరణంగారి యింటికేసి వెళ్లాడు. ఆ యిల్లొక నిత్యకల్యాణవేదిక. ఆ ఎత్తరుగుల యిల్లు కళకళలాడుతూనే వుంటుంది. సత్యం వెళ్లేసరికి కుదేలు బేస్తులు జమ్కుంటున్నాయ్. రాగానే ఆప్యాయతగా, ఓ చెయ్యి యివ్వబోయారు. వద్దని తనే కూర్చున్నాడు. కరణంగారు, భారీగా ఉన్న చుట్ట కొరికి దులిపి, కాండ్రించి ఉమ్మేసి చేరసగొట్టేసితీరుతా నన్నాడు. సత్యాన్ని పలకరించాడు. 'అమ్మాయ్' అని గాండ్రించి ముక్కలు తీసుకుని కళ్లు చిట్లించి 'అల్లుడు వచ్చాడు.' అని రెండో విసెత ముక్కలు తీశాడు. సత్యం లోపలికి వెళ్లాడు. సరస సరసగా పలకరింపులు అయినై. కరణంగారమ్మాయి వీణ నేర్చుకుంటోంది. మేడమీద గదిలోకి తీసికెళ్లి వీణ చూపించింది. అంతకుముందా గదిలోకి తను వెళ్లలేదు. అదొక అజంతాకుడ్యం. రెండు వీణలు. పులిచర్మాలు. గోడలమీద త్రివర్ణచిత్రాలు. సతీదేవిని భుజాన వేసుకున్న శివుడు కొండలలోంచి బరువుగా నడుస్తున్నాడు. మహాకాముకుడు వేణుగోపాలుడు ఓరకంటితో రాధతో మేలమాడుతున్నాడు. సంధ్యాతాండవపండితుడు మహాదేవుడు నర్తిస్తుంటే అందరూ తైతక్కలాడుతున్నారు. తనూ ఉన్నానని ఎద్దుగూడా పరవళ్లు తొక్కుతోంది. వోమూల ఉన్న తబాలకు నీలుక్కతో మూత మూశారు. ఓపక్క తంబూరా నిలబెట్టివుంది. కిటికీకి పక్కనే పొడుగాటి బల్ల—కిటికీలో పుస్తకాలూ ఉన్నై...

"ఈ వీణ మా మాష్టరుగారికీ—యిది నాకూ" కరణంగారి అమ్మాయి.

"బావుంది...కృతులదాకా వొచ్చిందా చదువు?"

"అప్పుడే—గీతాలు చెప్పుకుంటున్నా."

సత్యం కిటికీలో పుస్తకం తీశాడు. భర్తృహరి. పుస్తకం భరాల్న తీయగా యీ శ్లోకం కనపడింది:

"ఏతా హసంతిచ రుదంతిచ కార్యహేతోః
విశ్వాసయంతి పురుషం నతు విశ్వసంతి
... ... ... ...
వార్యాః శ్మశానసుమనా ఇవ వర్జనీయాః"

తాత్పర్యం చదువుతున్నాడు. మనస్సు బరువెక్కింది. యింతలో కరణంగారే వచ్చారు— "ఏమోయ్! వీణ ఎల్లా వుందీ?" అంటూ.

"దివ్యంగా వుంది!"

"ఏమిటి భర్తృహరా.........గొప్ప వాడు. ఏమన్నాడో చూచావా? "యౌవనం వా వనం వా" అన్నాడు. అమ్మాయ్, వీణ వినిపించావా?" అన్నాడు. అమ్మాయి సిగ్గుపడింది. సత్యం మర్యాదామందహాసం చేశాడు. "ఊఁ, ఏమిటి విశేషాలు?" అని కరణంగారే ఉపక్రమించి "నాలుగురోజు లుంటావా?" అన్నాడు.

"వెళతా"

వెళతా నని ఉంటం సుఖం.

ఆ మాటా యీమాటాతో యిద్దరూ కింది కొచ్చారు. అరుగుమీద పురాణం యమగా సాగుతోంది. బేస్తూ అని పారెయ్యవలసిన ఆటల్ని ఆడి కుదేళ్లు పంచుకున్నారు. కరణంగారు మళ్లీ ఆటలో మునిగారు. యీలోగా కాఫీ ముగించి, పైకొచ్చి అతిథిని పలకరించి మళ్లీ ఆటలో దూరా డాయన. అత్తారూరని ఎగడ్డమేగాని, పొద్దుపోవటం కష్టం. సత్యం నెమ్మదిగా లేచి కదిలాడు. పటంలోని వేణుగోపాలుడు కళ్లు కొట్టినట్లున్నాడు.

"అప్పుడే యింటిమీద యావ పోయిందీ!" కరణం.

సత్యం నవ్వాడు. కదిలాడు. మబ్బులు...కలుస్తూనై. విడిపడుతూనై. సేనల్ని కూర్చుకుంటున్న

ట్లున్నై. గాలి మన్మథబాణంలా తగులుతోంది. జానకి యింట్లోనే ఉంది. రత్తయ్య వాకిట్లో కూర్చుని బూతులు మహాశుద్ధిగా అంటున్నాడు. ఎవడో కుర్రాడు యికిలిస్తూ వింటున్నాడు. జానకి సత్యాన్ని చూచింది. మొహం విప్పారనూ లేదు. మూతి ముడకటించుకుపోనూ లేదు. తనే వెళ్ళి సావిట్లో నులకపక్క వాల్చుకున్నాడు.

"ఒరే సత్యం, ఓ సిగరెట్టియ్యరా?" రత్తయ్య. యిచ్చాడు.

"ధరెంత?"

"మూడు కాన్లు."

"ఒక్కొక్కటే మూడుకాన్లే...? అమ్మాయ్, నిప్పుపిడక ఇలా తే". ఎక్కడో తప్ప పల్లెటూళ్లల్లో ఛస్తే అగ్గిపుల్లను ఖర్చుకానీరు. సత్యం తన జేబులో అగ్గిపెట్టె ఇచ్చాడు. రత్తయ్య ఓ సుక్క పీల్చి, ధప్పగా వుంది అని చక్కా పోతాడు. జానకి ఏ వేళకూ తెమిలి రాలేదు. ఒక్కడూ పడుకుని పొగ వలయాలుగా వదులుతున్నాడు. వరాలు జివ్వుజివ్వుమంటున్నై. తను ఆగలేదు. తను మనస్సంతా పెట్టి పూజ్చేసే దేవతను వరం అడగటంలో తప్పులేదు. మనస్సు తహతహలాడుతోంది!

"జాగర్త!" తన రెండోవాడు.

"ఏం?"

"భాండను పడకు."

"నా ఆరాధ్యదేవత...వరం అడుగుతున్నాను."

"పో రమ్మయ్. పిచ్చిపిచ్చి వేషాలు వెయ్యక. మర్యాద చెడగొట్టుకోకు."

"ఏడిచినట్టుంది నీ సలహా."

"చనువుగా మాట్లాడినంతమాత్రాన ప్రతిస్త్రీ ఆరాధ్యదేవతై, వరా లివ్వదు!"

"జానకి వేరు...జానకి లేకపోతే నే బతకను!"

రెండోవాడు ఐపు లేడు. జానకి నూనెసీసా, దువ్వెనా తెచ్చుకూచుంది సావిట్లో......... సత్యంమనస్సు ఎగిరి గంతులేస్తోంది. అదృష్టం కొద్దీ రత్తయ్య ఎప్పటికప్పుడు తప్పుకుంటున్నాడు. జోస్యం అబద్ధం కాదు; సుతరామూ కాదు—ముందుగతి యిదీ అని దారిచూపించి పోదులుతుందిగాని. సాంబయ్య చెప్పకపోతే, తా నింకా చీకట్లో ఎంతకాలం తడుముకుంటూవుండాలిసొచ్చేదో! యిదీ బాగానే వుంది. మొదటిఉద్ధృతాన సీతను నాలుగు ఉతకలేదు. వేదాంతిగారు అనాడు గుళ్లో అన్న ఔచిత్యం ఇదే అయివుండచ్చు. ఊఁహు, ఇంకా వెనక్కి తప్పుకుంటూ పోవటం దేనికి? జానకి పాపట తీసుకుంటోంది. సత్యం అటే చూస్తున్నాడు. సంధ్యారుణిమ రంగులు మారుస్తోంది. జానకిముఖం పద్మంలాగా ప్రసన్నంగా వుంది. అద్దంలో చూస్తూ చెంపలు దువ్వుకుని నెమ్మదిగా లేచింది. తనను తాను నిలవరించుకోలేకపోతున్నాడు సత్యం. ముఖం కడుక్కోటానికి జానకి పెరట్లోకి వెళ్లింది. తనూ వెళ్లాడు. వరా లివ్వడానికి దేవి సిద్ధం అవుతూన్నది. తను కష్టించి సాధించిన సహానానికి పరిమితి అయిపోయింది.

జానకి వొస్తోంది..."నీ—నీతో ఓమాట చెప్పాలి"...జానకి ఆగింది. కటిక్కిన జానకి చెయ్యి పట్టుకున్నాడు. జానకి చలించింది, ఆగింది.

"జానకి!" సత్యం గొంతు ఆర్తాన్ని ప్రస్ఫుటిస్తోంది.

జానకి నెమ్మదిగా తన చేతిని తీసుకుంది. ఏమీ మాట్లాడలేదు. నేరుగా గదిలోకి వెళ్లింది. తనూ వెళ్లాడు. బాణంలాగు. గోముగా తన ముఖం జానకి వీపున రాచే ప్రయత్నంలో వున్నాడు. జానకి ఆగింది. తనూ ఆగాడు.

"తప్పు..."

"తప్పా...? వుత్తది..." నవ్వాడు. యింకా చొరవ చేస్తున్నాడు. ఆ మెత్తమెత్తగా వుంటం యిష్టపడటం కాదు కర్మ.

"ఊఁ" గర్జింపులాంటిది.

అనుకూల్యానికి నాందిలాంటి పరితుష్టిలా సంది సత్యానికి.

"తప్పు అంటే వినవేం?"...

జానకిమాట సొంపుమారింది. సత్యం రిచ్చపడి చూస్తున్నాడు.

"కల్లా కపటం లేనివాడి వని చనవుగా వుంటే —యిదా నీ ఆలోచన!"

"నాఅంతరంగం...నీవు—"

"వొద్దు. నామాట విను. నీవు యిక్కడినుంచి వెళ్లిపో..."మెత్తని గొంతుకే కాని కత్తి.— లోయలోకి పడ్డట్టైంది.

"సత్యం ఏదో గొణుక్కుంటున్నాడు."

"నీవూ, సీతా సుఖపడండి. చనవుగా ఐన వాళ్లతోటే మాట్లాడగూడదు. తెలిసింది."

జానకి వెళ్లింది.

నివ్వెరపోయి అక్కడనుంచి కదలక లేక పోయాడు సత్యం.

తనమాట తనకే పేలవం అనిపిస్తోంది. కలుగులోకి పాము దూరింది. కలుగుకు మెత్తి వేశారు. దారి లేదు. అక్కడి పాము అక్కడే కుళ్లి చావవలసిందే. బరువుగా పిచ్చిగా కదిలి, సావిట్లోకి వొచ్చి, నులక మక్కి మీద వాలాడు. అంపశయ్యలా గుంది మంచం. పడమటింట్లోకి వెళ్లాడు. జానకి పొయ్యి రాజేస్తోంది. తలెత్తి చూచింది. దగ్గిర కొస్తున్నాడు. "దూరంగా వుండు..." సత్యం మాట్లాడలేదు. "వొస్తా!" నని బయలుదేరాడు. యిల్లు తనను చూచి వెక్కిరిస్తున్నట్టుంది. వీథిలోకి వచ్చాడు. ఎవరెవరో వొస్తున్నారు, వెళుతున్నారు. అలవాటుగా కాళ్లు అత్తారింటికి వెళుతూన్నై. కావాలని దారి తప్పించి సుళ్లకేసి నడిచాడు. సుళ్లో ఎవరూ లేరు. పడుకునిఉన్న కుక్క అతన్ని చూచి లేచి వెళ్లిపోయింది. కూలబడి లేచాడు. నించోలేదు. కూచోలేదు. పచార్లు చేశాడు. ప్రదక్షిణంగా మారింది. కాలవకట్టకేసి నడిచాడు. ఏమీ తోచలేదు. బడబానలంలాగా పొంగుతూన్న మనస్సు పాతాళందాకా కుంగింది. దారిన బడి నడిచినడిచి మళ్లీ వెనక్కు తిరిగాడు. బాగా చీకటి పడింది. అత్తారింటికి వచ్చాడు.

గూట దీపంతోపాటు నోట మెతుకు ఈ యింట్లో. అన్నంముందు కూచుంటే ముద్ద ఎక్కలేదు. మనిషి ముభావంగా వుంటంచూచి ఎవ్వరూ ఏమీ అనలేదు.

చెయ్యి కడుక్కుంటూంటేనే - సీత తమలపాకుల చిలకలూ, వక్క పలుకులూ యిచ్చి వైతొలగింది. సీతతల్లో పూలు మెరిసినై. వొక్కడూ పడుకున్నాడు. ప్రవాహం తిప్పితిప్పి కొడుతోంది. మనసును నిలవరించుకోటం చేత కావటం లేదు. తన రెండోవాడుగూడా ఐపులేదు. ఆకాశం భయంకరంగా కనపడింది. సీత వొచ్చి తచ్చాడి లోపలకు వెళ్లింది. అత్తగారు లోపల ఏవో సర్దుతోంది. లేచి గదిలోకి వెళ్లాడు.

"అల్లా గున్నారేం?" సీత.

"అబ్బే...ఏంలేదు..."

"ఏం జరిగిందీ—మరీ ముడుచుకు పోతున్నారు?"

"లేదే—"

"సరే లెండి. నాతో చెప్పగూడదు కాబోలు"

—సత్యం మాట్లాడలేదు. ఏదో పుస్తకం ఉంటే తీసి చదవబోయాడు. అక్షరాలు అక్షరాలుగానే ఉన్నయ్. గాని, చదవ మనస్కరించలేదు. మనస్సు ఓ పాళానికి వచ్చినట్లుంది—

"సీతా!"

"తలెత్తింది!"

"మీ మామయ్యగారి ఊరు పోదాం"

"ఎందుకూ?"

"పిలిచాడు గదా..."

చప్పరించేసింది సీత.

"సీతా! నిన్ను మీ రామూర్తిమామయ్యకు యిస్తానన్నారా...?"

సీత నవ్వింది.

"ఏం—ఎందు కివ్వలేదు?"

"బతికించారు...యిచ్చేసి ఉంటే వద్దును!"

"ఛ"

"వాడి గుణం మీకేం తెలుసు?"

"ఏం! మంచివాడేనే..."

"మరో గరిటె నెయ్యి వేసుకుంటే—పెళ్లాం మీద కొరకొరలాడతాడు!"

"అంత బోళావాడు...అలా అంటాడనుకోను..."

"నిజం. వుత్త ముదనష్టపు మనిషి!"

"ఏమీ తెలీనీదు. అంతవాడా...?"

"తల్లితో కలిసి, పెద్దమామయ్యను క్షవరం చేశాడు!"

"ఉహూఁ. ఐనా తప్పేముంది? తనమంచి చూసుకున్నాడు!"

"ఎదటిపచ్చ గిట్టదు. మీ కేం తెలుసు?"

"నీకు తెలుసుకాబోలు మహా..."

"వాడి పే రెత్తకండి..." మామయ్యగదా అని పలకరిస్తే పలకటంగాని..."

ధోరణి మార్చిందే—ఎత్తా, నిజమా?

"మనలో మాట, సీతా...అయిన సంబంధాలు ఎప్పుడూ మంచివి సుమా"

"పోనిద్దురూ, ఎందు కిప్పు డా మాటలు?..."

"ను వ్వింత చెప్పుతున్నా, రామ్మూర్తి అంటే నా కేం తప్పు తోచటం లేదు"

"అంతగా యిష్టం అయితే—స్నేహం చెయ్యండి; తలంటుతాడు!..."

"అబద్ధం. నిజమే అయితే మీనాన్న 'వుండరా' అని ఎందు కంటాడు?..."

"అదా? మానాన్న ఎక్కడ గట్టిగా అడుగుతాడో అని నిన్న వొచ్చినవాడు యివాళ దూసుకున్నాడు. మాకు రెండొందలు బాకీ!"

"చచ్చాం; అదా ఉండమంటున్నా ఉండాయించుకుపోటానిక్కారణం!"

"'నయమే. అనుకున్న దల్లా నిజం అని రంపకోత కోశాను కాదు' అనుకున్నాడు.

"సీతా! రా, యిలా రా."

సీత ఏమీ కదలలేదు. ఎలాగ కూర్చుందో అలాగే మంచంమీద ఉంది.

"రా" అంటూ సత్యం సణిగాడు. "పండక్కేం కొందాం అంటావ్!" సత్యం నిట్టూర్చాడు. సీత చెంపలమీద వెచ్చగా పడింది ఆ నిట్టూర్పు.

"ఏం వొద్దులెండి...పండగ పండగ అని పీలా చాలా చూసుకోవొద్దూ!" అంది సీత.

"ఇదీ నీకంటే ప్రేమ కురిపించే స్థలం" తన రెండోవాడు.

మళ్లీ యివతలికి వొచ్చాక చూచినట్లు చూస్తున్నాడు సీతను. అర్థంకాక సీత చూస్తోంది!



# శిలాతపస్వి

•

"సంపత్"

ఋశ్యమూకవచితసహ్యాశైలాగ్రవిపినమున
సంచరించుచు నుండ, అపరసంధ్యాననము
పాటలస్మితముతో బంధూకవన మయ్యె;
అస్తగిరిమాడస్థత ప్తరవికరరచిత
హేమజీమూతమాంజిష్ఠవస్త్రము దాల్చి
వనపర్వతశ్రేణి ధ్యానమున కనుమూసె.

అనునిమిషపరిణామసంధ్యావిలాసములు
చూచి, ముగ్ధుడనగుచు, తలయూచి మనసులో
నేను ధన్యుడ నంచు, సౌందర్యపానమున
వివశుడైయుండంగ, ఏదో సాన్నిధ్యమున
అమరసుస్వర మొకటి వినిపించె; చేరువగ
శిల యొకటి ప్రౌఢైన మానవాకారమున
కనుపించె; నను పిలిచి ఆ శిలామూర్తి తన
ఘణితిలో నిట్లనియె: ఓ కవీ! స్వాగతము.

ఇది శిలాహ్వానమని భయపడకు; మునుపు—
శతశతసహస్రశతమానముల మునుపు—
మన మిద్దరము ఏకగర్భమందే పుట్టి
కాల మను మాయావి కల్పించు లీలలో
మునిగితిమి; సంసారమాయాగ్నికీలలో
నీవు మరచితివేమొ చేతనసుఖము నొంది!
నేను మరువను దాని జడత యను చెరపొంది!

ఆ శిలావిగ్రహము లేచి ముందుకు రాగ
చూచి ఆశ్చర్యమున; పాషాణమూర్తియును
పలుకుచునె కంట తడిపెట్టటను కంటి!
బాష్పస్ఫులింగములు రాల్చుటను కంటి!
రాతిగొంతుక మ్రోత నిండె నాకస మంత
అనురణనప్రతిరావ మగుచు; అచలశ్రేణి
కరగినది మానమున అనుకంప పూని.

దీర్ఘమగు ఛాయలను పరచి ముదివెల్గులో
చెట్టుచేమలుకూడ చెవి యొగ్గినవి; నిలిచి
వినుచుండ, పాషాణ మిట్లు చెప్పగసాగె:

కాల మచ్చట లేదు; దేశ మచ్చట లేదు;
గ్రహకోటి శశిసూర్యతారకలు లేవు;
వెలుగు చీకటి యనెడి వింతభేదము లేదు;
మమకారశూన్యమున మునిగియుండిన దెల్ల!
[మాయు;

ఉదయించె మొదట మమకార మనియెడు
అనుగమించెను పిదప, సృష్టియనునొకఛాయ!
కాలదేశము లనెడి కడలిమథనమునందు
ఆదిమశివాగ్ని పై కుక్షుభించిన దెగసి
సుళ్లుగొని, చిమ్మెనది, దిశదిశకు కదిసి
ఘూర్ణిలుచు విశ్వపుటసంతతనె కవిసి.

ఓకవీ! ఆ దుర్నిరీక్ష్యప్రవాహమున,
నిద్రమేల్కొను ఆ పరబ్రహ్మదేహమున,
ఆ విశ్వదుస్సహప్రసవబాధాగ్నిలో,
సద్యఃప్రఫుల్లకల్పాదికప్రతిభలో
స్వప్నగోచరమైన చిత్రసంకులమువలె,
మంథనములో లేచు జలబుద్బుదము లట్లు,
కవిమనసులో దోచు భావశంపాకృతిగ,
మరుమరీచికలో చలద్వీచికలవోలె,
వైణికుని స్వరమహారోహణశ్రీవోలె
అవ్యక్తవిశ్వకావ్యాస్పష్టగతులలో

స్పష్టతను, పూర్ణతను కాంక్షించి,నిలబడుచు,
నిలబడక, సంచరించితి మగ్ని జలములో.
కనుమింక శేషకథ నా శిలాహృదయమున.
ధ్యానమున నున్న ఆ వనపర్వతశ్రేణి
అలించె తనదైన ప్రతివిధి శ్రీవాణి
యన్నట్లు భీమగిరిశిఖరముల కార్చులుపు
నిడుదనీడలు సాగి కనుమలోనికి మలుపు
తిరిగినవి పెనుభూతముల పగిది. మెలమెల్ల
గా నిరులు కౌగిలించెను పర్వతము నెల్ల.
భూమిపై ఉత్తాలవిజయతిమిరస్థాప
మును నిలిపి, తారకారత్నాంకురస్థాప
నము చేసె రేరాణి; చూడు మని శిలయనగ
దాని నంతర్ముఖుడనై చూచి, ఝల్లనగ
విద్యుదాఘాతమై వెరగుపొందితిని.

కల్పాదివహ్ని గని కన్ను మూసితిని,
ఆసనాతనశిలామూర్తిదగు హృదయమ్ము
యుగయుగాంతరవాసనా నేకసదనమ్ము.
దాని నాళములందు గళమెత్తి కల్పములు
చెప్పుచున్నవి ఆత్మకథ—సృష్టిశిల్పములు,
కాలదేశాదిపరిణామశూన్యము లగుచు—
ఆద్యనిర్లిప్తవైభవనాథము లగుచు—
మరల చెప్పదొడంగె శిల తనదు చెరలోన.

ఇటులుండ,-సేతుబంధము తెగిన ఒక మహా
నదివోలె, వాగురాబద్ధమై గిరిగుహా
కుహరములు మార్మోగ, గర్జించి, విడుదలకు
త్రెంచుకొని లంఘించు సింహసంహతివోలె,
దూకి, హోరెత్తి, ఘోరాగ్నిధుని సుడితిరిగి
దిక్కుదిక్కుల కరిగి, ముక్కలై విరిగి
గ్రహభూమ రవిసోమతారాఖచితమయ్యె!
నాకు భూగర్భమే కడలేని చెరయయ్యె.
**ఇచటనే యుగయుగాంతరము లిటు చెరకితు.**

పడి ఇరుల నవసితిని, జ్యోతిర్మహాభిక్షు
కొరకు మొరలిడి యరచి; తుదకు నాకీశైల
తను విచట ప్రాప్తించె; చనచనగ ఈ నేల
నాదు సోదరులెల్ల చెట్టుచేమల లీల
పుట్టి, ఊపిరితీసి, పెరిగి రానందమున—
చైతన్యరేఖాప్రసారణానందమున!
కొందరేమో స్వప్నపరివేషములు చీల్చి
సంచరించిరి ప్రాణిరూపములు మైతాల్చి.
మెల్ల మెల్లగ కొందరిటు నరాకృతి గొనుచు
తప్పు దారుల నెన్నో శతమానములు చనుచు
నాగరకులై రిపుడు ధీశక్తితో పోరి.
(హా! దూరమున్నదివారు కడచిచనదగు దారి)
గగనతారాపథము గాలించి తిరిగితిని
పూర్వాశ్రమమునందు; లేదంచు నెరిగితిని
ఒక్క క్రిమిలో నున్న చైతన్యకణమైన
వాటిలో! లేదచట లెక్క కొక తృణమైన.
ఈ భూమి క్రిమివోలె క్షణజీవియే కాని
తారకల మించినది; యుగజీవినై లోని
ఇచ్ఛ నెరుగని తుచ్ఛదాస్యబంధనమందు
క్రిమికన్న రవిబ్రతుకె కించిదూనత పొందు.
చైతన్యసిద్ధియే జడత వాంఛాఫలము!
ఈ రహస్యజ్ఞాన మార్గప్రజ్ఞాబలము!

ఆ రాతితపసి యుపదేశ మాకర్ణించి
నిష్పందమూర్తినై, కవికరణి వర్ణించి
చెప్పినది మనసులో మననమ్ము చేసితిని.
ధ్యానముద్రామూర్తినై కొంత చూచితిని.
శిలయె కవి; కవియె శిల; అదె తత్త్వబోధ!
శిల గురువు; నే శిష్యు డిదె చిత్రగాథ!
పైన నభమున తార యొకటి సాక్షిగ నిలిచె
అభిమతసుదీప్తితో; నాచుట్టు కనబరిచె
**ఇరులు తన సంశయము!—**

ఓయి కవిసోదరా! వినుము నే నీ శిలా
క్రూరభుజబంధమున చిక్కి, క్రుక్కుచు కలా
హీనతకు పాక్కి, నా జడతలో విసుగెత్తి
జీవకళకై లోన తపియించి, నివమెత్తి
పడియుండ, ఒక శిల్పి శిలలు వెదకుచు వచ్చి
నన్ను గని, మది కరిగి, ఉలిపోగరలు తెచ్చి
గండశిల చెరనుండి విడిపించె. ముక్తి గని
మూర్తిగొని, నిరవధిక నిత్యనవశక్తి గొని
ఆ కళాసాన్నిధ్యమున కొంత కనుతెరచి
పూర్వజీవితశిలాక్లేశమంతయు మరచి,
చేతనచ్ఛాయలో సంతసించితి నపుడు.
(శిలకైన కనులిచ్చు కళ నాకు గురు వెపుడు.)
కళ మెచ్చుకో లేని వాని కే నొక రాయి!
కవికానివానికీ పలుకు వినబడదోయి!
నేను సూర్యోదయము గని పొంగిపోగలను.
తల మెత్తి కనుమలోనికి చూచి నెలకొలను
లో తనదు ప్రతిబింబ మీక్షించి, వెన్నెలల
వెండిపువ్వులు చల్ల, రంగురంగుల కలల
నురుగు తరగలు నాదు రక్తనాళములందు
తరలి, దూకుడుగ సాగుచును మున్ముందు
మురిపించును కెరలి రసపుష్కరణికరణి!
(నాగుండె రాపాడి రగులుకొను అరణి!)
నీవలెనె నేను కోకిలపాట విని కరిగి
పోగలను; చల్లగాలులు వీవ నెదు రరిగి
లోని తాపము నెల్ల మాయించుకొనగలను.
నీవలెనె విశ్వవీథుల కెగిరిపోగలను.
కల్పనావ్యూహములు సృజియించుకొనగలను

ఐన నీలో నున్న పరువు రాలే దింక
దానికై తపముచేయుచు నుంటి నొకవంక.

ఎప్పుడో ఒకనాడు మున్ముందు నీవలెనె
స్వేచ్ఛగా తిరిగెదను. ఆనాడు నీవలెనె
కవినౌచు తెలుగులో కవనమ్ము కట్టెదను
కట్టి, పాడుచు జనుల మనసు చెరపట్టెదను.
దానికై ఓ కవీ! నీ సఖ్యతను వేడి
పిలిచితిని చేరువకు; నీదు రచనలు తెచ్చి
వినిపించు మనుదినము నా యెదుట పాడి.

నీ కళాపరిషేచనమున ప్రాణము వచ్చి
నేను నీవలె విశ్వచిరనిరీక్షితముక్తి
పొంది సుఖ మొందెదను; ఇమ్ము నా కా శక్తి.
భువిని దివితో రాయభోగమును చేకూర్చు-
నీ పలుకు పలుకెల్ల అపరంజిగా మార్చు
రసవాది! కలవోయి నీ కళకు శక్తియును
జడము చేతనపరచు దివ్యతరముక్తియును.
మనుజులకు సుఖమిచ్చు లోకలు నీ కున్న పని
యని విస్మరింపకుము పాడుచుకొని పైకి చని.
నీ కావ్యవాణిచే ఎన్నెన్నొ ఆత్మలకు
జడత యను చెర తొలగి విడుదల లభించినది.

నిలిచిపోయెను మాట. నే నా శిలను ముట్టి
ఒక ముద్దు పెట్టి, నాదారి పట్టితి; పట్టి
కల కాదు, నిజ మన్న దెదో తట్టె నా మూపు.
ఈ శిలాస్నేహితుని విడిచిపెట్టక రేపు
కవి పలుకరించెదను; కవనములు పాడెదను
శిలను కవి చేయుటకు కవనములు పాడెదను.

("కువెంపు" రచనకు స్వేచ్ఛానుసరణము)

# అలంకారశాస్త్ర ఆవశ్యకత

●

శ్రీ జి. వి. కృష్ణరావు

కళారంగంలో, ముఖ్యంగా సాహిత్యరంగంలో నేడు కనిపిస్తున్న తికమకలు, అవకతవకలు, అవ్యవస్థ మరేరంగంలోనూ కనిపించటంలేదు. ఇతరరంగాలలోకూడా అవ్యవస్థ లేకపోలేదు. కాని, వాటిలో స్థితిగతులు ఇంత విషమంగా లేవు. పరస్పర విరుద్ధాలైన పెక్కు వాదాలున్నాయి. అయినా వాటికి కొంత వ్యవస్థ ఉంది. భిన్న భిన్న విమర్శనలు, నిశిత నిశిత వివాదాలు ఉన్నా ఆ వాదాలను, పక్షాలను తేలికగా చెప్పుకోవచ్చును. అందలి మంచి చెడుగులు, సత్యాసత్యాలు అప్పటికప్పుడు కాకపోయినా కాలక్రమాన అయినా తెలిసి వస్తున్నాయి.

ఉదాహరణకు ధరలకంట్రోలు, రేషనింగుపద్ధతినే తీసుకోండి. కొంతమంది ధరలకంట్రోలు, రేషనింగుపద్ధతి ఎత్తివేయాలన్నారు. అలా ఎత్తివేసినప్పుడే అవినీతి పోయి ధరలు తగ్గి జనసామాన్యం సుఖంగా జీవిస్తుందని రాయి గ్రుద్ది చెప్పారు. మరికొందరు ధరల కంట్రోలు, రేషనింగ్ పద్ధతి తీసివేస్తే ప్రబలమైన అనర్థం చుట్టుకొంటుందన్నారు. పేదసాదలకు, అంతంతమాత్రంగా ఉన్నవారికీ జీవితం దుర్భరమై పోతుందన్నారు. ఈ రెండువాదాలలోని సత్యాసత్యాలు మామూలుప్రజకు మొదట్లో తెలియకపోయినా తరువాత తరువాత తెలిసివచ్చాయి. ప్రజలకేకాదు, ప్రతిపక్షులకుకూడా సత్యం బోధపడక పోవటంలేదు.

ఇలాంటి స్థితి, వ్యవస్థ అయినా కళారంగంలో, ముఖ్యంగా సాహిత్యరంగంలో కనిపించటం లేదు. ఏ కథల సంపుటినో సమీక్షకోసం నాలుగు పత్రికలకు పంపితే పది అభిప్రాయాలు వెలువడుతున్నాయి. అందులో ఏ రెంటికీ పొత్తు ఉండదు. ఒక పత్రిక దాన్ని ఆకాశానికి ఎత్తితే, మరొకటి అథఃపాతాళానికి అణగద్రొక్కుతుంది. మరొకటి దాని ప్రస్తావనే తలపెట్టదు. పోనీ, రాజకీయాలలోవలెనే పుస్తకం మంచిచెడుగులు కాలక్రమాన వెల్లడి అవుతాయందామా, అలాంటిదానికి ఏమాత్రం అవకాశం కనిపించటం లేదు.

అయితే యీ ఘోర అవ్యవస్థకు కారణ మేమిటి? చిత్తశుద్ధిలేదా? కాక అభిమానద్వేషాలు ప్రబలాయా? అలాంటివృష్టివల్ల ప్రయోజనం లేదు. దానివల్ల అసలు విమర్శకే తావులేకుండా పోతుంది. ఎందుకంటే, ప్రత్యర్థి చిత్తశుద్ధి శంకకు ఆస్పదమైతే, వారికిమాత్రం అలాంటిదోషం లేదని నిర్ధరించటానికి ఎలా వీలుపడుతుంది? కాబట్టి వ్యవస్థారాహిత్యానికి వేరే ప్రబల కారణం ఉండాలి.

కళలో, ముఖ్యంగా సాహిత్యంలో నేడున్న తికమకలకు, అవకతవకలకు,అవ్యవస్థకు కారణ మేమిటి?

ఈ ప్రశ్న ప్రజాస్వామ్యవాదులకు, కమ్యూనిష్టులకు, కేవల కళావాదులకు అపోహ కలిగించక మానదు. ప్రజాస్వామ్యవాదులు ఇలా ప్రశ్నించవచ్చును—కళలనుగూర్చి ప్రజలు తమకు తోచిన అభిప్రాయాలను, సిద్ధాంతాలను వెల్లడించుకోటానికి అవకాశంలేదా ? ఒకేనాయకుడు, ఒకేజెండా, ఏకైక ఖండం అన్న వివాదాలు లేవనెత్తే ఫాసిస్టులకూ మీకూ తేడా యేమిటి? వ్యవస్థపేరుతో తమ తమ అభిప్రాయలను వెల్లడించుకోరాదని ప్రజలను అనుశాసించటమే కదా !

కమ్యూనిష్టులు ఇలా ప్రశ్నించవచ్చును—మానవుడు అనివార్యంగా ప్రవర్థమానుడు అవుతాడని చరిత్ర ఉద్ఘోషిస్తున్నది. ఈ ప్రవర్థమానత అనేది వర్గకలహాల ద్వారా సిద్ధిస్తుందని ఆ చరిత్రే ముక్తకంఠంతో

చెబుతున్నది. కాబట్టి ప్రపంచమందంతటా కమ్యూనిష్టు సామాజికవ్యవస్థ యేర్పడేటంతవరకు వర్గకలహం అనివార్యం. అభ్యుదయకాముకులంతా వర్గకలహం మాటుపరచక ప్రజలకు వివరించి అభ్యుదయకరపాత్ర నిర్వహించే వర్గంపక్షాన పోరాడాలి. సాహిత్యంలో, కళలోకూడా అంతే. వర్గాలను పురస్కరించుకొని వాదభేదాలు బయలుదేరాయి. బయలుదేరుతున్నాయి. ఇలా బయలుదేరే వాదాలలో ఏవేవి యేయే వర్గాలకు చెందినవో బట్టబయలుచేసి అభ్యుదయకరపాత్ర నిర్వహించే వర్గంవారి వాదనను బలపరచాలి. కాబట్టి కళాభ్యుదయానికి వాదవైవిధ్యం, వాటి వివరణఖండనలు అవసరం. అంతేకాని సాహిత్యవ్యవస్థపేరుతో వాదభేదాలను అణచివేయటం ఏమాత్రం సమంజసంకాదు. పైగా అది విప్లవవిరోధి చేసే పని.

కేవల కళావాది ఇలా అనవచ్చును — కళ అంటే ఒక విశిష్టఅనుభవం కలిగించేది. ఆ అనుభవ తత్త్వమేమిటి? దానికి అంశా లేవి? లక్షణాలు ఏవి? ఇలాంటి విచారమునకు పూనుకొంటున్న క్షణంలోనే కళానుభూతి ప్రపంచంలోనుంచి జారిపోయి మరొక ప్రపంచంలో పడుతున్నాము. కాబట్టి ఇలాంటి విచారణవల్ల నిష్పన్నమయ్యే సిద్ధాంతం మరేమైనా అవుతుందేమో కాని కళాస్వరూప నిరూపకంమాత్రం కాదు, కాజాలదు. కళానుభూతి నిజంగా సహృదయ హృదయైకవేద్యం. అది అనిర్వచనీయం. వ్యవస్థకూ, కట్టుబాట్లకూ, కళకూ ఎక్కడా పొత్తులేదు. నిజానికి ఈ రెండూ అగర్భశత్రువులు. కట్టుబాట్లలో కళా? అసంభవం.

పై మూడు ప్రతివాదాలకు సమాధానం చెప్పకొనక ముందు ఒకవిషయం ఆలోచించాలి. ఒక వ్యవస్థ కావాలి అనటంలో విభిన్నవాదాలు ఉండగూడదనీ, తమకున్న అభిప్రాయాలను వెల్లడించుకొనటానికి అధికారం ఉండగూడదనీ యీ రచయిత అభిమతంకాదు. అంతేకాదు. ప్రజలు నిర్భయంగా, నిరాఘాటంగా ఈ అధికారం వినియోగించుకోవాలి. అలా చేయని వాళ్లు తమకు తామే ద్రోహం చేసుకొంటున్నారు. జీవితమే నిరర్థకం చేసుకొంటున్నారు. అయితే ప్రజలకున్న యీ అధికారంతోపాటు బాధ్యతకూడా ఉన్నది. ఒకడు ఒకవిషయాన్నిగూర్చి చెప్పేటప్పుడు అంతకుముందు ఆ విషయాన్నిగూర్చి ఇతరులు వెల్లడించిన అభిప్రాయాలను పరిశీలించి ఉండాలి. పూర్వాభిప్రాయం సరిగా లేదని తోస్తే, ముందు దాన్ని ఖండించి తన అభిప్రాయాన్ని సహేతుకంగా నిరూపించుకోవాలి. అలాకాక పూర్వాభిప్రాయంలో అవ్యాప్తి, అతివ్యాప్తి దోషాలుంటే, వాటిని వివరించి సవరించాలి. అలాకాక పూర్వాభిప్రాయమే మంచిదని తోచి దానిని తిరిగి చెప్పటమే ముఖ్యమని భావించినప్పుడు, ఆ పూర్వాభిప్రాయాన్నే విపులీకరించి అందలి విశిష్టతను సుబోధకం చెయ్యాలి.

“అలాకాదు, నాకొక అభిప్రాయం తోచింది. దాన్ని వ్యక్తంచేసుకొనటానికి నాకు అధికారం ఉన్నదా, లేదా!” అన్న ప్రశ్న రావచ్చును. ఈ ప్రశ్నకు జవాబు చెప్పకముందు రెండు ముక్కలు చెప్పాలి. మానవుడు గతచరిత్రతో సంబంధం లేకుండా ఆకస్మికంగా, ఇతర సహాయం లేకుండా, స్వయంగా ఆలోచించగలగటం అసంభవం. విస్పష్టభావాలు కలగాలంటే భాష నేర్చుకొని ఉండాలి. అలాంటి సంస్కారం లేకుండా అభిప్రాయాలు కలగటం అసంభవం. కేవలం చేతనకోటికి సహజమైన అవ్యక్తసంవేదనలు కలుగుతాయే కాని ఇతరులకు వెల్లడించటానికి వీలైన నిశ్చితాభిప్రాయాలు ఏర్పడవు. ఇందుకు సమాజంతో ఎలాంటి సంబంధం లేకుండా నిర్జనప్రదేశంలో పెరిగిన వ్యక్తి, శిశువు నిదర్శనం. కాగా వక్తవ్య అభిప్రాయాలు ఒకనికి కలగాలంటే, సమాజంలోని భూత వర్తమాన అభిప్రాయాలతో సంబంధం ఉండితీరాలి.

ఒక వ్యక్తి పూర్వమున్న అభిప్రాయాలనే, ప్రజలకు చిరపరిచితమైనవాటినే తిరిగి ఏకరువు పెడుతా డనుకోండి. దానివల్ల ఆవ్యక్తికి కాని, సమాజానికి కాని కలిగే ప్రయోజన మేమిటి? అలాంటి చర్యలవల్ల గుడుగుడుగుంచాలు నాలుగుకంబాల ఆటలు తప్ప అభ్యుదయం ఎలా కలుగుతుంది?

కాబట్టి వ్యక్తి వెల్లడించే అభిప్రాయాలు విశేషార్థ బోధకాలు కావాలి. విశేషార్థబోధకం అవగానే

ఒక వ్యవస్థ, ఒక క్రమం ఉండవలె నని వేరే చెప్పనవసరం లేదు. అలా కానిపక్షంలో వ్యక్తి తన అభిప్రాయాలను ఇతరులకు తెలియజేయటానికి కాని, తద్ద్వారా ఇతోధిక జ్ఞానం సంపాదించటానికి కాని అవకాశం ఉండదు.

ఇలాంటి వ్యవస్థ కళాతత్త్వవిచారంలో కూడ ఉండాలని యీ రచయిత ఉద్దేశం. అంతేకాని, పెక్కు సిద్ధాంతాలు ఉండరాదనీ, కేవలం ఒకేసిద్ధాంతం ఉండి తీరాలనీ రచయిత అభిప్రాయం కాదు. కళారంగంలో, సాహిత్యాదిక్షేత్రాలలో ఎన్ని సిద్ధాంతాలైనా ప్రతిపాదించవచ్చును. అలా ప్రతిపాదించటానికి ప్రతి ఒక్కనికీ అధికారం ఉంది. అయితే అలాంటి సిద్ధాంతానికి తలా తోకా ఉండాలి. అందులో అంతర్వైరుధ్యాలు ఉండకూడదు. పైగా ఆ సిద్ధాంతం నేలవిడిచి సాముచేయకూడదు. సిద్ధాంతంకోసం సిద్ధాంతం బయలుదేరక ఉన్న కళాసృష్టులకు అన్నిటికీ (*works of all arts*) అన్వయించాలి. ఋగ్వేదకాలంనుంచి యీనాటివరకు వివిధదేశాలలో, వివిధ జాతులలో జరిగిన సమస్తకళాసృష్టుల సౌందర్యాన్ని, లక్షణాలను, విశిష్టతావిశిష్టతలను, అర్థాలను (*values*) వివరించగలగాలి. ఇక్కడ మరొక విషయంకూడా ఉంది. కళ జీవితంలో ఒకభాగం, లేక ఒకవిధమైన జీవితం అవుతుంది. జీవితంలోని అన్ని అంశాలకు పరస్పరసంబంధం ఉంది. కార్యకారణభావంలేకుండా శూన్యంనుంచి ఏదీ రాదు. కాబట్టి జీవితంలోని అన్ని అంశాలు కార్యకారణభావంతో అల్లిబిల్లిగా పెనవేసుకొని ఉంటాయి. అందువల్ల అన్ని అంశాలలోను అంతర్వాహిగా దండలో దారంవలె ఒక సామాన్యవిషయం ఉంటుంది. అంటే, జ్ఞానస్వరూపం సకలశాస్త్రాలకు, సకలకళలకు ఒకటే. కళాప్రతీతిలోని జ్ఞానస్వరూపం ఒకవిధంగాను, శాస్త్రోపలబ్ధిలోని జ్ఞానస్వరూపం మరొకవిధంగాను ఉండదు. కాబట్టి ఒకవ్యక్తి నూతన సాహిత్యసిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నాడంటే, ఆ సిద్ధాంతంలో అంతర్భూతంగా ఉంటున్న జ్ఞానస్వరూపం ఇతరశాస్త్రాలవల్ల వ్యక్తమౌతున్న జ్ఞానస్వరూపంతో సమన్వయం పొందాలి. అంతేకాని కేవలం దానికి పరకోటిగా, విరుద్ధంగా ఉండటానికి వీలులేదు.

ఇలా వ్యాఘాతరాహిత్యం, సకలశాస్త్రవిహిత జ్ఞానస్వరూపం, అఖండత అన్నవి కళాసిద్ధాంతాలకే కాక అన్ని సిద్ధాంతాలకు అవసరం.

ఇక కమ్యూనిస్టు పేర్కొన్న వర్గకలహం, కేవలకళావాదిప్రశ్న మిగిలి ఉన్నాయి. వర్గకలహంలో ప్రత్యేకతత్త్వదృష్టి అంతర్భూతమై ఉంది. అందువల్ల ఆతత్త్వాన్ని వివరించికాని సమాధానం చెప్పుకొన వీలు లేదు. అదంతా యీ రచయితే మరొకచోట వివరించటంవల్ల ఇక్కడ పేర్కొనటం లేదు. పోతే కేవల కళావాదిప్రశ్నకు సమాధానం చెప్పుకోవాలి.

కేవలకళావాది తన వాదం మరొకసారి పరీక్షించుకుంటే, అందులో అంతర్భూతమైఉన్న సిద్ధాంతం అతనికే వెగటుకొల్పటానికి అవకాశం ఉంది. ఎందుకంటే ప్రపంచంలో ఏదీ హేతువునకు అందదనీ, కేవలం ఏకతానతా మాత్రగ్రాహ్యమనీ, *Intuition* వల్లనే అర్థంచేసుకోటానికి వీలవుతుందనీ ఆ సిద్ధాంతానికి అంతరార్థం. ఈ అనుమానం నిరాధారం కాదు. కళానుభూతి సహృదయహృదయైకవేద్యమని కేవల కళావాది అంటున్నాడు. మానవజీవితంలో, జగద్వ్యాప్తిలో ఈ కళ కేవలం ఒకభాగం మాత్రమేనని ఒప్పుకొనక తప్పదు. ఎందుకంటే, జీవితంలో కళాసృష్టి, తదనుభూతిమాత్రమే కాక శాస్త్రాదిక వ్యాపారంకూడ కనిపిస్తున్నది. ఈవిధంగా జీవితం, జగద్వ్యాప్తి వివిధవిశేషవిశిష్టం. జీవితంతో పోల్చిచూస్తే కళ స్వల్పాతిస్వల్పమైనది కాకపోయినా, ఒక భాగం మాత్రమేనని స్పష్టం కాకమానదు. ఇలా ఏకదేశమైన కళ హేతుభిన్నము అతీతము అయినదై సహృదయ హృదయైకవేద్యమే అయితే ఏకదేశి అయిన జీవితం శాస్త్రవిచారానికి ఎలా అందుతుంది? కాబట్టి కేవల కళావాది ప్రతిపాదిస్తున్న అర్థాన్ని అనుసరిస్తే, జగత్తత్త్వం జీవితస్వరూపం హేతువునకు, శాస్త్రానికి అందేది కాదు. హృదయైకవేద్యమే. అది నిజమైతే శాస్త్రంద్వారా అర్థంచేసుకోటానికి, ఉన్న లోటు దక్కబరచుకొని అభ్యుదయం పొందటానికి వీలులేదు.

అది అలా ఉంచి హృదయైక అనుభూతార్థం సత్యమో, అసత్యమో తెలుసుకోవటానికి ఎలా వీలవుతుంది? మానవుడు క్రమక్రమంగా జ్ఞానం పెంపొందించుకొంటూ వస్తున్నట్లు చరిత్ర చెబుతున్నదికదా. ఏకతానతావాది ఇలాంటి చరిత్రను ఎలా త్రోసివేస్తాడు? ఇవన్నీ అలా ఉంచుదాము. పరామర్శకు తావు లేకపోతే మానవునికీ, జంతువుకూ వ్యత్యాస మేమిటి? ఋగ్వేద కాలంనుంచి ఈనాటివరకు శాస్త్రవిచారం ఎందుకు చేస్తున్నాడు? ఇలాంటి విచారం నిరర్థకమైతే ఇలాంటి ప్రవృత్తి ఎలా సంభవిస్తున్నది?

ఈప్రశ్నలకు కేవల కళావాదినుంచి సంతృప్తికరమైన సమాధానం లేదుకనక ఆ వాదాన్ని ఆదరించటానికి వీలులేదు.

ఇక రెండటి ప్రశ్న అలాగే ఉన్నది. నేడు కళాక్షేత్రంలో ఇన్ని అవకతవకలు, తికమకలు, అవ్యవస్థ ఎందుకు ప్రబలాయి? ఇలాంటిస్థితి తెలుగు దేశములో ఉన్నంత విపరీతంగా పాశ్చాత్యదేశాలలో లేకపోయినా, అక్కడకూడా కొంతవరకు ఇలాంటి స్థితే కనిపిస్తున్నది. ఇటీవల అక్కడ బయలుదేరిన ఆలంకారికమతాలు చూస్తే, యీ విషయం స్పష్టమౌతుంది. కాబట్టి ప్రపంచమందంతటా మొత్తముమీద ఇలాంటి విషమస్థితే ఆవరించి ఉంది.

ఇలా చెప్పినంతమాత్రాన మూలకారణం వివరించినట్లు కాదు. ఈలోటు ఎక్కడ ఉందో పరిశీలించాలి.

ప్రపంచంలో ఏదీ శూన్యంనుంచి పుట్టిపడదు. కారణం ఉంటుంది. ఇవాళ మన సంస్కృతి, సంస్థలు, ఉద్యమాలు, జీవితం ఇలా ఉన్నాయంటే, ఇంతకు ముందు మనకున్న సంస్కృతి మొదలైనవి కొంతవరకు కారణమని అంగీకరించక తప్పదు. తరువాత ముఖ్య కారణం నేటి సంస్కృతి, సంస్థలు, జీవితానుభవం మాత్రమే.

కాగా నేటి అవ్యవస్థకున్న కారణాలను రెండు శాఖలుగా విభజించవచ్చును—(౧) పరంపరాగతాలు, (౨) ప్రకృతజీవితసిద్ధాలు. పరంపరాగతాలను తిరిగి రెండు ఉపశాఖలుగా విభజించవచ్చును: (౧) తాత్త్వికాలు, (౨) చరిత్రాత్మకాలు.

**తాత్త్వికకారణాలు:**

భారతీయసద్దర్శనాలు భిన్నభిన్న దృక్పథాలను ప్రకటిస్తున్నా, కొన్ని ప్రధానాంశాలలో ఏకీభవిస్తున్నాయి. జ్ఞానం అనవచ్ఛిన్నం, పరిణామరహితమని అంటున్నాయి. ఈ భౌతికప్రపంచం అనిత్యమనీ, జీవులు తమతమ పూర్వజన్మకర్మఫలానుభవంకోసం పుడుతున్నాయనీ చెబుతున్నాయి. కాబట్టి మానవుని జీవితం, జగత్తు పరమార్థానికి సాధనాలే తప్ప స్వతః ప్రయోజనకారులు కాకుంటున్నాయి. అంటే అపవర్గగమ్యస్థానానికి బయలుదేరిన జీవికి ఈ జగత్తు ఈ జీవితం మధ్యలో తటస్థపడే ధర్మశాలలవంటివి. వచ్చిపోతుండే యాత్రికులకు నిలువనీడ కల్పించటమే ధర్మశాలలకు ఎలా పరమార్థమో, ఈ జీవితజగత్తుల ప్రయోజనంకూడా అంతే. అంతకన్నా వీటినిగూర్చి విచారించవలసిన పని లేదు. ఈ విషయాలను షడ్దర్శనాలు ముక్తకంఠంతో ఆమోదిస్తాయి.

ఇవి సిద్ధాంతాలైనప్పుడు కొన్ని విషయాలు అనివార్యంగా ఏర్పడుతాయి. జ్ఞానం అనవచ్ఛిన్నమై, ఎదుగుబొదుగులులేక ఎల్లకాలం ఒకేవిధంగా ఉంటున్నప్పుడు, దానిని ఎప్పుడో, ఏ ఒక్కడైనా తెలిసికొని ఉండాలి. అంతేకాని క్రమక్రమంగా తెలిసికోవటంకాని, జ్ఞానం అభివృద్ధిచెందటంకాని అసంభవం. అందువల్ల ప్రాచీనతమమైన వాక్కే సత్యం చెప్పి ఉండాలనీ, క్రమికప్రవర్ధమానత అసంభవమనీ సిద్ధిస్తున్నది. దీనితో సర్వజ్ఞానం వేదాలలో ఉన్నదనీ, ఆ వేదాలు అత్యంతప్రామాణికాలనీ, వాటివెలుపల అంతకన్న అధికంగా జ్ఞానం ఉండటానికి వీలులేదనీ తేలికగా నిష్పన్నమౌతుంది. ఇలాంటిదానితో చరిత్రాత్మకజ్ఞానం కుంటుపడక తప్పదు. అసలు దృష్టి అటువైపు పోవటానికికూడా వీలులేదు. ఈవిధంగా సునిశితబుద్ధులైన శాస్త్రకారులకుకూడా ప్రాచీనతమ శాస్త్రగ్రంథాలు అనుల్లంఘనీయాలు, పరమప్రామాణికాలు, శిరసాపరిధార్యాలు అయి, స్వతంత్రవివేచనకు, సత్యాన్వేషణకు అడ్డు తగిలాయి. స్వతంత్రసిద్ధాంత

ప్రవర్తకులైన మనీషులుకూడ తమ వాదాలను స్వోపజ్ఞములుగా కాక కేవలం ప్రాచీనగ్రంథార్థాలకు అనువాదాలుగా ప్రకటించుకొనటం జరిగింది. ఇందు బ్రహ్మసూత్రాలమీద విభిన్నభాష్యాలు, నాట్యశాస్త్రంపై వెలువడిన అభినవభారతీవ్యాఖ్య నిదర్శనాలు.

జీవితము, జగత్తూ పరమార్థాలు కాక, కేవలం అపవర్గానికి సాధనాలుగా మాత్రమే స్వీకరించటంవల్ల ఈ జగజ్జీవితతత్త్వాలనుగూర్చి ఉపేక్షించటం జరిగింది. నిజానికి పరమప్రామాణికులైన భారతీయదార్శనికు లెవరూ కళానుభూతిని గూర్చి వ్రాయలేదు. అసలు వాటి సంగతినికూడా వారు తడవలేదు. అభినవగుప్తుడు, రాజానకుడు, మధుసూదనసరస్వతివంటివారు తొమ్మిదవశతాబ్ది తరువాతివారుగాని, అంతకుముందున్నవారు కారు. పైగా ప్రాచీనభారతీయసంప్రదాయానికి కట్టుపడిఉన్న యీనాటి కళోపాసకులుకూడా కళకు స్వతంత్రసత్తాను అంగీకరించరు. తత్త్వార్థం ఉత్తమోత్తమ మనీ, కళ దానికి న్యూనమైన దనీ యీనాటికీ భావించటం జరుగుతున్నది. కళవల్ల బ్రహ్మాస్వాద సహోదరానుభూతి కలుగుతున్నదని చెబుతున్నారేకాని బ్రహ్మాస్వాదం కలుగుతున్నదని అనటం లేదు.

ఇలా జీవితమూ, జగత్తూ మరొకదానికి సాధనంగా భావించటంవల్ల కళాదుల తత్త్వవిచారం పాశ్చాత్యదేశాలలోకంటె వెనుక బయలుదేరింది. ఈ సందర్భంలో "రసో వై సః" అన్న శ్రుతిని పేర్కొనవచ్చును. ఈ శ్రుతిలోని రసశబ్దానికీ, ఆలంకారికులు చెప్పే రసానికీ సంబంధం లేదని రసగంగాధరకర్తకు వ్యతిరేకంగా నిర్ధారించటం జరిగింది. పోతే భరతుని నాట్యశాస్త్రం ప్రాచీనతమమైనది కాదా అని ప్రశ్నించవచ్చును. పైని పేర్కొన్న విషయాలను గమనించి నాట్యశాస్త్రాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే శైలినిబట్టి, ప్రసక్తవిషయాలనుబట్టి అది సూత్రయుగంలో వెలువడినది కాదనీ, పౌరాణికయుగంలోనిదనీ స్పష్టం కాకమానదు.

షడ్దర్శనార్థాలు ఇలాంటి స్థితికి దారితీసినా, అలా కాదు ఇలా ఉండాలని అనుశాసించినా జీవితం, జగత్తు తన తన ధర్మాలనుబట్టి ప్రపంచిల్లింది. రామాయణం, భాగవతం, భాసకృతులు, గాథాసప్తశతి, బృహత్కథ, అశ్వఘోషుని కావ్యాలు, కాళిదాసాదుల మహాకావ్యాలు, మరొకప్రక్క అజంతాచిత్రాలు బయలుదేరాయి. వాటితో కళాతత్త్వానుశీలనం ప్రారంభమయింది. దానితో అలంకారమతం తొలకరించింది. తరువాత క్రమక్రమంగా దార్శనికులు తమ తమ దర్శనాలను పురస్కరించుకొని కళాతత్త్వాన్ని, ముఖ్యంగా సాహిత్యతత్త్వాన్ని వివరిస్తూ ఆలంకారికగ్రంథాలను వ్రాశారు. కాలక్రమాన సౌందర్యవిషయంలో షడ్దర్శననిర్వచనాలు నిరాకృతాలై అద్వైతవాదుల మతం సిద్ధాంతమైపోయింది. ఇలా బయలుదేరి పాతుకొనిపోయిన రసవాదం పరమప్రమాణమై సర్వసాహిత్యవిశిష్టతావిశిష్టతలను నిర్ణయించసాగింది. రసవాదులు పేర్కొన్న ఏ ఒక నియమం ఉల్లంఘించినా ఎలాంటి ఉదాత్తకావ్యంకూడ తీవ్రఖండనకు పాల్పడింది. అలా ఖండించటానికి వీలులేకపోతే ఆ కావ్యాలను విరిచి ఎలాగో సూత్రార్థాలకు సరిపోయేటట్లుగా అన్వయించటం జరుగుతూవచ్చింది. దీనికి శాకుంతలంలోని నాందీశ్లోకం, ఉత్తరరామచరిత్రరసచర్చ మొదలైనవి నిదర్శనాలు.

ఇలా ఎంతసేపటికీ సాహిత్యతత్త్వం ఇలాంటిది కాబట్టి ఇలా ఉండాలని అనుశాసించటంతప్ప, ఉన్న కావ్యాలు ఇలా ఉన్నాయి, కాబట్టి సాహిత్యతత్త్వం ఇలా ఉండాలని ఆలంకారికసిద్ధాంతాలను ఎప్పటికప్పుడు సవరించుకొనిపోవటం జరగలేదు.

పైగా అలంకారం, గుణం, రీతి, వృత్తి, వక్రోక్తి మొదలైన వాదాలు ఏపద్యానికి ఆపద్యం బాగోగులు కొంతవరకు తూచిచెప్పగలిగినవేతప్ప మొత్తంమీద కావ్యం విశిష్టతావిశిష్టతలను నిర్ణయించి చెప్పగలిగిన స్థితిలో లేవు. లోచనవ్యాఖ్యాకర్త అయిన అభినవగుప్తుకూడా రసవంతంకాని రచన కావ్యం కాదని ధ్వనికర్తను అధిగమించి చెప్పగలిగాడేకాని ధ్వనికర్త పేర్కొన్న అలంకారధ్వని, వస్తుధ్వని ఎలా

రసంగా పర్యవసిస్తాయో చెప్పలేదు. తరువాత వచ్చిన ఆలంకారికులైనా యీవిషయాన్ని అంతగా లోతుకు తరచి చూచినవారు లేరు.

నేటి సాహిత్యంలో ఖండకావ్యం, కథానిక, ఏకాంకిక, నవల ప్రధానం. వీటి మంచిచెడుగులు మొత్తంమీద చెప్పుకోవలసిందే తప్ప పద్యాలవారీగా కాని, పేరాలవారీగాకాని చెప్పుకోటానికి వీలులేదు. అందువల్ల ఈ నూతనకావ్యరూపాల విశిష్టతావిశిష్టతలను ఆలంకారికమతాలు స్వతః నిర్ణయించలేని స్థితి ఏర్పడింది. దానితో వాటిపై విద్యావంతులకు గురికప్పి ఆలంకారికమతాలను పూర్తి ఉల్లంఘించటం, విశృంఖలవృత్తి ప్రబలటం, అవ్యవస్థ నెలకొనటం జరిగింది.

## చరిత్రాత్మక కారణాలు :

చరిత్రదృష్టితో చూస్తే ౧౧ వ శతాబ్దివరకు, అటుపిమ్మటకూడ నాటి విద్యావంతులకు దేశభాషల మీద ఏమాత్రం గౌరవ ముండేదికాదు. ప్రాంతీయ భాషలు వారికి అపభ్రంశాలుగా తోచేవి. అన్నివిషయాలూ ఏ సంస్కృతభాషలోనో వ్రాయవలసినదే తప్ప వాటి ప్రకటనకు దేశభాషలు ఏమాత్రం పనికిరావన్న అంధవిశ్వాసం వారికి ఉండేది. దీనికి ఆంధ్రశబ్దచింతామణిలోని "స్వస్థానవేష భాషాభిమతాస్సంతో రసప్రలబ్ధధియః లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చావ్యదపహోయ" అన్నవాక్యం అథర్వణకారికలలోని "సన్మూలకత్వాత్ రూఢత్వాత్ గృహీతత్వాచ్చ సాధుభిః, నాపభ్రంశత్వమేవ స్యాన్నియమాభావతస్తు తత్"అన్న కారిక సూచిస్తున్న అర్థం నిదర్శనం. పైగా నన్నయభట్టువంటివాడుకూడ "శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతో. వక్షోముఖాంగేషు"అన్న శ్లోకంతో తెలుగుభారతం ప్రారంభించటం, నన్నయ పూర్తిచేయని భాగం తిరిగి ౧౩ వ శతాబ్దిలో తిక్కన ఎత్తుకొనేటంతవరకు ఎవరూ అనువదించటానికి పూనుకోనకపోవటం, కవిబ్రహ్మకూడా హరిహరనాథుడు తనకు కలలో ప్రత్యక్షమై మిగిలిన భారతాన్ని పూర్తిచేయవలసినదని ఆదేశించినట్లు చెప్పుకోవటం దీనికి దోహదమిస్తున్నవి.

భారత ఆంధ్రీకరణంతో పురాణేతిహాసాలు తెలుగులో వ్రాయటానికిమాత్రమే దారి యేర్పడిందికాని, శాస్త్రవిషయాలేవీ అప్పటినుంచి ఇటీవలవరకు తెలుగు ముఖం చూడలేదు. చివరికి ప్రామాణికాలైన తెలుగు వ్యాకరణ గ్రంథాలుకూడా ౧౯ వ శతాబ్దిమధ్యవరకు ఎక్కువగా సంస్కృతభాషలోనే వ్రాయబడుతూ వచ్చాయి. ఇంతమాత్రంచేతనే అసలు శాస్త్రానికి సంబంధించిన గ్రంథాలేవీ అణుమాత్రంకూడ తెలుగులో వ్రాయలేదని నా అభిప్రాయం కాదు. ఆంధ్రభాషాభూషణము మొదలైనవి వచ్చాయి. చిన్నకోట పెద్దన, భట్టుమూర్తి మొదలైనవారు తెలుగువారికి అలంకారశాస్త్రంతో అత్యల్పపరిచయం కలిగించారు. కాని కళాతత్వం, సౌందర్యలక్షణం ఒక్క తెలుగుమాత్రమే చదువుకొన్నవారికి ఈనాటికీ అచుంబితవిషయాలే. తత్వశాస్త్రాలలో ఒక అద్వైతగ్రంథాలు మాత్రం కొలదిగా తెలుగురూపం సంతరించాయి. ఇలా తెలుగులో ఇంతవరకూ వచ్చిన శాస్త్రగ్రంథాలను చదివినంతమాత్రాన ఏ శాస్త్రంలోను గాఢపరిచయం లభించదు.

ఈ విధంగా కేవలం ఒక్క తెలుగు చదువుకొన్నవారి సంగతి ఈ నాటివరకు చాల శోచనీయంగా ఉంది. బాగోగులను నిర్ణయించుకొనవలసివచ్చినప్పుడు ఎవరి ఇష్టం వచ్చినట్లు వారు పోవటం జరుగుతున్నది. అందువల్ల కేవలం తెలుగుసాహిత్యంలో ఎలాంటి వ్యవస్థ లేదంటే ఆశ్చర్యపడవలసిన పని లేదు.

ఇంతమాత్రంచేత శాస్త్రార్థవిచారశక్తి తెలుగువారికి లేదనటానికి వీలులేదు. నేటికి ఆయారంగాలలో ప్రామాణికాలుగా భావింపబడుతున్న వేదభాష్యం, పంచదశి, రసగంగాధరం, పరిభాషేందుశేఖరం, తర్కసంగ్రహం మొదలైన ఉద్గ్రంథాలు వ్రాసినవారు ఆంధ్రులే. కాని తెలుగుభాషమాత్రం శాస్త్రార్థప్రకటనకు నోచుకోలేదు. దీనికి కారణం అఖిలభారతప్రశంసాగౌరవాలను సంపాదించాలన్న అభిప్రాయమే ఆనాటి ఆంధ్రశాస్త్రవేత్తలను సంస్కృతభాషలో తమ గ్రంథాలను రచించటానికి ప్రోత్సహించింది. ఈనాడు శాస్త్రకారులు తమతమ అభిప్రాయాలను అంతర్జాతీయ

*Mehta's...*

# SUNDARI ELIXIR



గర్భాశయరోగాలకు

ప్రసిద్ధ బలవర్ధకౌషధము
సర్వవిధాలైన బహిష్టు చిక్కులకూ
అనుపమ నివారిణి
సుప్రసిద్ధ భిషగ్వరులచే
ప్రశంసింపబడినది.

**K.S. MEHTA & CO., 250, CHINA BAZAAR, MADRAS.**



## డోంగ్రేగారి

**బాలామృతము**

**బలహీనమైన బిడ్డలకు పుష్టియున్ను, బలమున్ను ఆరోగ్యము నిచ్చును**

## ఫాలసుగంధిలేహ్యం

ఇది రక్తశుద్ధిచేయు అనేక మూలికలతో తయారుచేయబడినది. సవాపేహాములు, మేహాపాడలు, మచ్చలు, కురుపులు, చర్మ వ్యాధులు, కుష్ఠు, మలబద్ధము, కీళ్ల వాపులు మొదలగు అనేక విధములగు వ్యాధులను ఖండించుటలో అద్భుతమైనది. 2 డబ్బీలు చాలును.

**20 తులముల డబ్బీ రు. 2/-**
**పోస్టేజి ప్రత్యేకము.**

## పి. సి. ఏ. అండ్ కంపెని,

పెరిదేపి, (నెల్లూరు జిల్లా).

మదరాసు బ్రాంచి :
7. సీను మొదలి వీధి. (మిద్దెమీద)
పెరెట్టు టాకీస్ ఎదురుగా, జార్జిటవున్.

ప్రఖ్యాతికోసం ఆంగ్లంలో వ్రాస్తున్నట్లే నాడు మన వారు సంస్కృతంలో వ్రాశారు.

నాడు, నేడు కూడా మాతృభాష అనాదృతి పాలు కావటంవల్ల తెలుగుసాహిత్యంలో ఇంతటి ఘోర అవ్యవస్థ కనిపిస్తున్నది.

ఈనాడైనా యీ అవ్యవస్థను తొలగించటానికి ప్రయత్నాలు చేయవచ్చునుగదా అన్న ప్రశ్న పాఠకునకు కలుగకపోదు. కాని యింతవరకు పేర్కొన్న ప్రకృతిజీవితసిద్ధాలైన కారణాలు అడ్డు తగులుతున్నాయి. ఇవి ఎలా అవరోధకాలుగా ఉన్నవో పరిశీలించటం ముఖ్యం.

ప్రకృతజీవితసిద్ధకారణాలను కూడ ప్రధానంగా మూడుభాగాలు చేయవచ్చును:—(౧) సాంస్కృతికాలు, (౨) సంస్థాసిద్ధాలు, (౩) వర్తమానజీవితసిద్ధాలు.

## సాంస్కృతిక కారణాలు:

౧౯ వ శతాబ్దిచివరనుంచి మన దేశంలో ఎన్నో మార్పులు వచ్చాయి. ముద్రణయంత్రాలు, రైళ్లు, స్టీమర్లు, తంతి, రేడియోలు, సినిమాలు, విమానాలు క్రమంగా వ్యాపించాయి. వీటివల్ల ప్రపంచంలోని వివిధభాగాలకు సన్నిహితసంబంధం ఏర్పడింది. వివిధ దేశాల చరిత్రలు, సంస్కృతులు, సాహిత్యాలు, తత్త్వాలు, భావాలు, ఆదర్శాలు, సంప్రదాయాలు మన దేశానికికూడ ప్రాకాయి. వీటివల్ల కళలలో, సాహిత్యంలో వచ్చిన మార్పులన్నీ యిన్నీ కావు. సాహిత్యక్షేత్రంలో అంపశయ్య కూలింది గ్రాంథికం. కథానిక, ఏకాంకిక, ఖండకావ్యం, నవల, వ్యాసం, రేడియోనాటిక, కథ సాహిత్యరంగంలో ప్రవేశించాయి.

లోగడ వ్యావహారికభాష కావ్యానికి పనికి రానిదిగా ఉండేది. సామాన్యప్రజాజీవితం దానికి నిషిద్ధము. ఆభిజాత్యం, ధనసంపద ఉన్నవారే తప్ప ఇతరులు కావ్యంలో నాయికానాయకులుగా ఉండటానికి వీలులేదు. నాటకంలో ప్రధానరసం శృంగారమో, లేక వీరమో ఉండవలెనేకాని మరొకటి ఉండటానికి వీలులేదు. మిగిలిన రూపకోపరూపకాలకు ఆయాసంజ్ఞలు, సంధ్యంగాలు, నాయికానాయకులు, రసాలుతప్ప సంధిసంధ్యంగాదులు ఉండటానికి వీలులేదు. కవిసంప్రదాయాలు, అలంకారగతనిబంధనాలు అనుల్లంఘనీయాలు, అనుసరణీయాలుగానుండేవి.

విదేశీయకావ్యాలలో ఈ నిబంధనలు కనిపించలేదు. ఇవి కనిపించనంతమాత్రాన రసపుష్టిలో లోటు కనిపించలేదు. పైపెచ్చుగా లోగడ పాటింపబడుతూవచ్చిన సంప్రదాయాలన్నీ చాలవరకు ప్రతిబంధకాలుగా కనిపించసాగాయి. ఇలా పోయి పోయి పద్యంలో యతిప్రాసలు దేనికి అన్నంతవరకూ వచ్చింది.

ఈవిధంగా కళాదేవతకు సంకెళ్లు తగిలించారన్న భావం ప్రబలి ముమ్మరమవుతూ కనివిని ఎరుగనంత మార్పు అనతికాలంలోనే బయలుదేరింది. ఆ మార్పు అనుదినం జరుగుతూనే ఉన్నది. ఇలాంటి స్థితిలో క్రొత్తపోకడల అంతర్యం గ్రహించలేక ప్రాచీనమతానుయాయులు, విప్లవవేగంలో కొట్టుకొనిపోతూ తమ గమ్యంగా, ప్రాచీనుల సిద్ధాంతాలు అర్థంచేసుకోలేక నవీనమతానుయాయులు అయోమయస్థితిలో పడ్డారు.

## ప్రజాస్వామ్యం:

సాంస్కృతికరంగంలో మరొక ముఖ్యవిషయం ఉంది. అంధవిశ్వాసాలను అధిగమించి పాశ్చాత్యులు పరిశోధనలు సాగించి అనేకనూతనవిషయాలు కనుగొన్నారు. యంత్రాలు అవతరించాయి. వీటివల్ల ఎక్కువ సరకులు ఉత్పన్నము కావటానికి, ఎక్కువ మంది ఎక్కువసుఖాలు అనుభవించటానికి వీలు కలిగింది. "మహాత్మా సర్వభూతాంతరాత్మా" అని శతాబ్దుల నుండి మానవుని హృదయంలో ఉపన్యసిస్తున్న సిద్ధాంతం ఆచరించిచూపటానికి అవకాశాలు క్రమక్రమంగా పెంపొందుతూవచ్చాయి.

వీటిని పురస్కరించుకొని ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలైన పాశ్చాత్యదేశాలలో ప్రజాస్వామ్యం ప్రబలసాగింది. యంత్రసంస్కృతిప్రేరితులై ఆంగ్లే

యులు మన దేశానికి వచ్చారు. ఆసేతుహిమాచలం వారికి కైవసమైపోయింది. వారు ప్రవేశపెట్టిన ఆర్థిక రాజకీయవిధానాలతో పూర్వవ్యవస్థ సడలింది. పూర్వాచార వ్యవహారసంస్కారాలపై ఆదరాభిమానాలు సన్నగిల్లసాగాయి. ఇదేసమయంలో ప్రభుత్వానికి ఇష్టంలేకపోయినా ఇంగ్లండుమొదలైన దేశాలలో ప్రవర్ధమానములవుతూవచ్చిన ప్రజాస్వామ్యభావాలు ఇండియా మొదలైన ప్రాచ్యదేశాలలోగూడ ప్రాకసాగాయి.

శతాబ్దులనుంచి స్తంభించిపోయి ఉన్న సమాజంలో ఉధృతంగా సంచలనం ప్రారంభమైనది. పూర్వం విద్యాదికసంస్కారాలు కొన్నివర్గాలకు మాత్రమే ఉండేవి. కాని నూతనప్రభుత్వం దేశంలో నెలకొనటం, దానితో నూతనసంస్కృతి రావటంవల్ల విద్యాదికం వర్గైకనిష్ఠం కాక వివిధవర్గాలలోను ఆర్థికానుకూల్యం ఉన్నవారికి అలవడసాగింది. అందువల్ల వెనుకటిలోవలెగాక ఇప్పుడు అన్నివర్గాలలోనుంచి రచయితలు బయలుదేరారు. రచన ఎప్పుడూ రచయిత అనుభూతిసంస్కారసంభావనీయములమీద ఆధారపడి ఉంటుంది. దీని ననుసరించి వివిధవర్గాల అనుభవాలు, సాహిత్యరూపం, కళారూపం సంతరించసాగాయి. స్వతః అవర్ణనీయం అంటూ ఒకటి లేకపోయింది. అంతరికవైచిత్రి ఉండి, వైరుధ్యం లేకపోతే అవస్తూకార్యం లేకపోయింది. అందువల్ల మాలనిదగ్గరనుండి బ్రాహ్మణునిదాక, ఆతతాయినుంచి ధీరోదాత్తునివరకు, పరమాణువునుంచి బ్రహ్మాండపర్యంతం చిత్రింపరానిది లేకపోయింది. వస్తుస్వీకారంలో లోగడ ఉన్న అభిమానద్వేషాలు, ఆదరవైముఖ్యాలు నశించాయి.

ఇలా చిత్రాతిచిత్రంగా వస్తున్న వస్తువైవిధ్యం, చిత్రీకరణవైపరీత్యం విమర్శకుల కన్నులకు మిరుమిట్లు కొలుపుతున్నాయి. నల్లికుక్కిమంచం, సెంటుపోసు, సెరసినవిం ట్రుక, ఘోరహత్య, నాయకుడు లేని నాటకం, శీర్షశ్నాంగి అయిన రూపకం, ఇతివృత్తం లేని ఈహామృగం, వీరులు లేని ఇతిహాసాలు బయలుదేరుతున్నాయి. సమకాలీనసాహిత్యాలలో ఇవి బయలుదేరకపోయినా విదేశీయసాహిత్యాలలోనుంచి దిగుమతి అవుతున్నాయి. ఇలా త్వరత్వరగా బహుముఖసృష్టి, లేక సృష్టివాహకం, వెలువడుతుంటే అవ్యవస్థ ఎందుకు ఉండదు?

పైగా మరొక విషయం ఉంది. ప్రజాస్వామ్యభావం అపార్థం చేసుకోవటంవల్ల ఎవరికి వారే రాజులైపోతున్నారు. కళారంగంలో, సాహిత్యం నేర్చుకోవలసినది ఒకటి ఉన్నది అన్న భావం పోయింది. ఉన్నత విజ్ఞానశాస్త్రాలు (*Natural sciences*), సామాజికశాస్త్రాలు (*Social sciences*) చదివినవారు, చదువుతున్నవారు సాహిత్యాది కళారంగంలో సాముగరిడీలు చేస్తున్నారు.

వీరు సృష్టికి పూనుకోరాదని అపోహ పడకూడదు. కాని కళాసృష్టికికూడ తక్కిన శాస్త్రాలలో వలెనే వ్యవస్థ ఉన్నదని చాలమంది గ్రహించటం లేదు. పూర్వసాహిత్యాలతోను, కళాసృష్టులతోను (*works of arts*), అలంకారశాస్త్రంతోను సంబంధం లేకుండా సృష్టికి దిగుతున్నారు. అంతమాత్రాన అభ్యంతరం చెప్పవలసిన పనిలేదు. కాని అసలు బయలుదేరిన కళాసృష్టుల మంచిచెడ్డలు, అర్థాలు నిర్ణయించటంలో అధికారిత్వం ఎవరికి ఉండాలి? అధికసంఖ్యాకుల సమ్మతి ననుసరించి శాస్త్రార్థనిర్ణయం జరగాలని శాస్త్రవేత్తలు అంగీకరిస్తారా? ప్రజాస్వామ్యం అలా అనుశాసిస్తున్నదా?

అలంకారశాస్త్రంతోను, పూర్వకళాసృష్టులతోను సంబంధం లేని నవ్యకళారాధకులు చేతికి దొరికిన ఏవో విమర్శనగ్రంథాలనో పట్టుకొని అందులో తమకు నచ్చినవాటిని పరమప్రామాణికాలుగా భావిస్తున్నారు. వీటికి అలంకారశాస్త్రసాహిత్యంలో ఎంతవరకు స్థానమున్నదో, అవి ప్రతిపాదించే అర్థాలు ఉన్న కళాసృష్టులకు ఎంతవరకు అన్వయిస్తాయో, ఆ యా విమర్శనగ్రంథకర్తలు ఏవిషయాలలో ప్రామాణికులో, ఎందులో అప్రామాణికులో గుర్తించటం లేదు. ఒక పుస్తకంమంచిచెడ్డలను నిర్ణయించవలసివచ్చినప్పుడు హడ్సన్ ఇలా అన్నాడనో, బేట్సు కథాలక్షణం ఇలా ఉండాలన్నాడనో, సోమర్సెట్ మామ్ సాహిత్యం ఇలా ఉండాలని

అన్నాడనో, టాల్‌స్టాయ్ కళాతత్త్వాన్ని ఇలా నిర్ణయించాడనో, లెనిన్ కళలు ఇలాంటిపనులు నిర్వహించాలన్నాడనో, ఫ్రాయిడ్ కృతిఅవతరణం ఇలా జరుగుతుందన్నాడనో పేర్కొని, ఆ నిర్వచనాలను పురస్కరించుకొని కళాసృష్టుల భాగోగులను నిర్ణయించటం జరుగుతున్నది. ఇలా కళావిషయంలో పుర్రెకొక బుద్ధిగా ఉంటున్నది.

కొంతమంది రచయితలు, కళాకారులు తమ తమ చిత్తాలకు కళాతత్త్వం నిరూపించుకోటానికి కొత్త కొత్త మార్గాలు త్రొక్కుతున్నారు. అతివాస్తవికవాదం (sur realism), సత్తావాదం (existentialism) మొదలైనవి ఇందుకు నిదర్శనాలు. ఈ వాదాలు కేవలం అత్యల్పసంఖ్యాకుల సృష్టి సమర్థించుకోటానికి పనికి వస్తున్నవి తప్ప ప్రాచీన అర్వాచీన కళాసృష్టులన్నిటికీ గాని, కాక కేవలం కళైకశాఖాగతసృష్టులకు అన్నిటికీ గాని, లేక కనీసం ఒక యుగంలో ఒక దేశంలో వెలువడిన సృష్టులకు అన్నిటికీ గాని అన్వయించటం లేదు. దీనివల్ల అలంకార క్షేత్రంలో వాదాలు అడ్డాదిడ్డంగా పెంపొందటం, తికమకలు, అకతకలు, అవ్యవస్థ పెచ్చరిల్లటం తప్ప మరొక మేలు జరగటంలేదు.

సంస్థాసిద్ధాలు :

సమాజంలో బయలుదేరే వైవిధ్యవైరుధ్యాలకు సమన్వయసహకారాలను కల్పించి అభ్యుదయానికి కీలుచీలలైన సంస్థలు కళలకు తోడ్పడుతున్నవో లేదో పరిశీలింతాము.

ఆంగ్లప్రభుత్వం మన దేశంలో నెలకొన్న తరువాత వివిధ ప్రాంతాలలోను విశ్వవిద్యాలయాలు ఏర్పడ్డాయి. వీటి పరమావధి మొదట్లో పరిపాలనానిర్వహణకు, విద్యాశాలల నిర్వహణకు కావలసిన ఉద్యోగులను, ఉపాధ్యాయులను తయారుచేయటమే. అందువల్ల విద్యార్థులు నేర్చుకోవలసిన విషయాలనుగూడ తదనుగుణంగా నిర్ణయించటం జరిగింది. రాజభాష ఆంగ్లభాష కావటంవల్ల ఆంగ్లానికి ప్రాముఖ్యం వచ్చింది. దేశభాషలు ఒకవిధంగా మూలబడ్డాయి. సద్యఃఫలమివ్వని తత్త్వశాస్త్రాదులవంటివి పూర్తిగా ఉపేక్షితాలయ్యాయి. పరిశ్రమలు మొదలైనవి ఆ రోజులలో ఇక్కడ పెరగకపోవటంవల్ల విజ్ఞానశాస్త్రాలు చదువుకొన్నవారు చాల తక్కువగా తయారయ్యారు.

ఉద్యోగనిర్వహణకు ఆంగ్లభాష ప్రధానం కావటంవల్ల ఆ భాషమాత్రమే ఎక్కువ ప్రాధాన్యం వహించిందికాని ఆ సాహిత్యం, కళలు అంతగా ప్రాధాన్యం వహించలేదు. అందువల్ల పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులలో భాషాచరిత్ర ప్రాధాన్యం పొందినంతగా సాహిత్యం ప్రాముఖ్యం పొందలేదు. (తతిమ్మా కళల సంగతి అసలు చెప్పనే అవసరం లేదు) బోధించే ఆ సాహిత్యంలో కూడా విడివిడిగా ఆయాకవులను గూర్చి, ఆయాయుగీనసాహిత్యలక్షణాలను గూర్చి ఉన్న విమర్శలను, వివిధకావ్యభేదాల లక్షణాలను స్థూలంగా పరిశీలించటం జరిగిందికాని, "రామణీయకమంటే ఏమిటి? అది వస్తుగుణమా, ధర్మమా, లక్షణమా? లేక ప్రమాతగుణమా, ధర్మమా, లక్షణమా? కాక ప్రమాతాప్రమేయముల సంబంధమా? జీవితానికి రామణీయకానికి, ధర్మానికి రామణీయకానికి, శాస్త్రానికి రామణీయకానికి ఏమిటి సంబంధం? జీవితంలో, జగత్తులో కళకున్న అర్థం ఏమిటి? అని అణుమాత్రమైనా విచారించటం జరగలేదు.

సంస్కృతసాహిత్యవిద్యార్థులు అలంకారశాస్త్రం చదవకపోవటం లేదు. కాని, అవి అన్వయరహితమై లోగడ పేర్కొన్న కారణాలవల్ల రక్తికి రంగానికి రావటం లేదు.

ఈ విధంగా విద్యాసంస్థలుకూడా కళలలో-ముఖ్యంగా సాహిత్యంలో అవ్యవస్థను దారితీస్తున్నవే తప్ప వ్యవస్థ నెలకొల్పటానికి తోడ్పడటం లేదు.

రాజకీయపక్షాలు - ప్రచారం - కళలు :

ఇటీవల క్రొత్తగా వచ్చిన సంస్థలు, పార్టీలు, పత్రికలు వీటివల్ల కళకు ఏమి జరుగుతున్నదో పరిశీలింతాము.

ప్రజాస్వామ్యభావాలు ప్రబలినవని ఇంతకు ముందు చెప్పుకొన్నాము. ఈనాడు వాటికున్న ఆద

రాభిమానాలు మరే సిద్ధాంతానికీ లేవు. నియంతృత్వం అపేక్షించేవారుకూడా తాము ప్రజాస్వామ్యమునే కాంక్షిస్తున్నామని చెప్పకొంటేతప్ప అంతర్జాతీయ రంగంలోనే కాని, జాతీయ రంగంలో కాని నీళ్ళు పుట్టవంటే అతిశయోక్తి లేదు. అయితే యీ ప్రజాస్వామ్యమనే పదానికి అంటగట్టే అర్థాలు అన్నీ యిన్నీ కావు.

ఏది ఏమి చెప్పినా, ప్రజాస్వామ్యభావాలు ప్రబలటంవల్లను, ప్రజాస్వామిక ప్రభుత్వాలు పెక్కు దేశాలలో నెలకొనటంవల్లను వివిధదేశాలలో భిన్న భిన్న రాజకీయపక్షాలు బయలుదేరాయి. తుదికి ప్రజాస్వామ్యసిద్ధాంతానికే ఎసరుపెట్టే రాజకీయపక్షాలు కూడా బయలుదేరాయి. ఇంకా బయలుదేరటానికి ఈనాటివరకూ అవకాశ మున్నది. ఈ పక్షాలు తమ తమ సిద్ధాంతాలను అమలులోకి తేవాలంటే వాటిని ప్రజలకు ప్రచారంచేసి వారి ఓట్లు సంపాదించి అధికారం చేపట్టాలని చూస్తున్నాయి. ప్రజలను విజ్ఞానవంతులను చేస్తే వారే తమ పరిపాలనను చక్కబెట్టుకొంటారన్న భావం ఈనాటివరకూ ఏదేశంలోను ప్రధాన రాజకీయపక్షాలకు లేదు. తాము, తమ పార్టీ మాత్రమే అలాంటిదానిని అమలుపరచగలమని ఆయా పార్టీసభ్యుల విశ్వాసం. అందువల్ల అన్ని రాజకీయ పక్షాలకు రాజకీయ అధికారసముపార్జనం అత్యంత ముఖ్యమైపోయింది. పార్లమెంటరీపద్ధతి అమలులో ఉంటున్నప్పుడు, ఆ పద్ధతికన్నా గత్యంతరం లేనప్పుడు ప్రచారం ఎంత ప్రాముఖ్యానికి వస్తుందో వేరే వివరించి చెప్పనవసరం లేదు.

ప్రతిరాజకీయపక్షంకూడా తన సిద్ధాంతాలను, వాటికంటె తన నాయకుల గొప్పతనాన్ని చాటుకోటానికి వీలైన సాధనాలను తీవ్రంగా అన్వేషిస్తూ వచ్చింది. సభలు, సమావేశాలు, ప్రదర్శనాలు, నిరసనలు, సమ్మెలు, కరపత్రాలు కనిపెట్టాయి. వీటిప్రభావం తాత్కాలికంగా ఉంటున్నదే కాని మానవుని హృదంతరాంతరాలలోకి ఎక్కి అవసరమైనప్పుడెల్లా ప్రజ్వరిల్లటం లేదు. ఇలాంటి సాధనం ఏమిటా అని చూస్తే, నాటకాలు, ఒపేరాలు (*Opera*), జానపద గేయాలు, నృత్యాలు కనిపించాయి. అసలు కళలకు మించిన ఉత్తమప్రచారసాధనాలు దొరకటం అసంభవమని పుష్కిన్ నుంచి టాల్‌స్టాయ్‌వరకు వచ్చిన రష్యన్ సాహిత్యం కన్నతె చింది.

మొట్టమొదట ఈవిషయాన్ని కనిపెట్టిన గౌరవం కమ్యూనిష్టుపార్టీకే యివ్వాలి. ఎందుకంటే సాహిత్యాన్ని పార్టీప్రచారసాధనంగా మొట్టమొదట వినియోగించుకొన్నది వారే. పురాణేతిహాసాలకాలం నుంచి కళలలో, సాహిత్యంలో ఒకవిధమైన ప్రచారం (నేటిప్రచారంకాదు) చైతన్యవిశిష్టదృక్కు, హృదయస్పందనం మొదటినుంచీ ఉంటూనే ఉన్నది. కాని ఒక పార్టీకోసమని, పార్టీవ్యక్తులకోసమని లోగడ సాహిత్యం, కళ పూర్తిగా ఆహుతిచేయటం జరగలేదు. తన హృదయస్పందనాన్ని, తన అనుభూతికి గోచరిస్తున్న సత్యాన్ని అభివ్యక్తం చేయటం జరిగింది. పుష్కిన్ కాలంనుంచి ౧౯౧౭ దాక రష్యన్ రచయితలూ అలాంటిపనే చేశారు. కాని కళను రాజకీయ పక్షానికి ఒక సాధనంగా సమర్పణ చేసుకోవటం ఈ శతాబ్ది ప్రథమపాదంచివరిలోనే ప్రారంభమైనదని చెప్పాలి. ఏది ఎలా ఉన్నా యీ విషయంలో ముందంజ వేసింది కమ్యూనిస్టుపార్టీయో, లేక మరొకటో నిర్ణయించవలసిన బాధ్యత చరిత్రజ్ఞులకు వదిలివేదాము.

ఇలా కళలను పార్టీప్రచారసాధనాలుగా వినియోగించటానికి అవకాశం ఉన్నదని స్ఫురించగానే ప్రతిపార్టీకూడా తన పార్టీకి అనుబంధంగా ఒక ప్రత్యేక సాహిత్యపరిషత్తును, నాట్యకళాపరిషత్తును, అలంకారికమతాన్ని లేవనెత్తింది. లేవనెత్తుతున్నది. ఇందుకు మన దేశంలో కమ్యూనిస్టుకాంగ్రెస్ పార్టీలు చేస్తున్న ప్రయత్నాలే నిదర్శనం. కళ అంటే ఏమిటో, ఎలా ఉండాలో గాంధీజీ సెలవిచ్చిపోయాడు. కాంగ్రెస్‌ప్రభృతులుకూడా కళాతత్త్వాన్ని ఉపదేశిస్తున్నారు.

నూతనసాహిత్య సిద్ధాంతాలు వస్తున్నవంటే బుద్ధిమంతుడెవ్వడూ ఉలికిపడవలసిన పని లేదు. పైపెచ్చుగా సంతోషించాలి. కాని యీ సిద్ధాంతాలు

రామాయణకాలంనుంచి నేటివరకు వచ్చిన కళాసృష్టుల అర్థాలను నిర్ణయించుకోటానికి తోడ్పడుతున్నవా? లేదనే చెప్పాలి. ఎందుకంటే బమ్మెరపోతన్న అభ్యుదయకవి అవుతున్నాడు. శ్రీనాథుడు కావటం లేదు. ప్రబంధకవులు అభ్యుదయనిరోధకులైతే కవిత్రయం అభ్యుదయికం అవుతున్నది. ఈ కవులు ఏనాటికో ఆ పార్టీవారు చెప్పేదాకా గుండుగా చెప్పటం సాహసమే. ఒక్క ఈ కవులను వినహాయిస్తే మిగతా ప్రాచీనాంధ్రకవులందరిదీ మొత్తంమీద తత్త్వరీతి ఒకటే దృష్టి. ఆధ్యాత్మికవాదాన్ని ఆశ్రయించారు. వారు స్వీకరించిన ఇతివృత్తం, చిత్రించిన విధానం దానిని స్పష్టం చేస్తున్నాయి. అలాంటప్పుడు వారిలో కొందరు అభ్యుదయకవులనీ, మరికొందరు అభ్యుదయనిరోధకులనీ విభజించటం హాస్యాస్పదం కాకమానదు. రాజులను ఆశ్రయించనంతమాత్రాన పోతన్న అభ్యుదయకవి అయి, రాజులను ఆశ్రయించినంతమాత్రాన శ్రీనాథుడు అభ్యుదయనిరోధకకవి అనటం చాలా శోచనీయం.

రాజకీయపక్షాలు పురస్కరించుకొని బయలుదేరుతున్న సాహిత్యసిద్ధాంతాలవల్ల మరొక ఘోర అపకారం జరుగుతున్నది. ఆయాపార్టీల సిద్ధాంతాలను చిత్రించిన రచనలే సాహిత్యమనీ, తద్భిన్నాలు తాకటానికికూడా యోగ్యాలు కావనే అంధ ఆవేశాలు నానాటికీ ప్రబలిపోతున్నాయి. కొంత నిర్లిప్తంగా ఉండి ప్రశాంతంగా ఉండి ఆలోచించుకొని ఎవనికి వాడు స్వయంగా నిర్ణయించుకొనే అవకాశం పోయి పార్టీలో ఆవేశం, మాస్‌హిస్టీరియా బయలుదేరుతున్నాయి. ఆవేశాదికం కళానుభూతికి కేవలం గర్భవిరోధులుకాని దోహదకారులు కావు. ఇలాంటి ఆవేశాలు, ఉన్మాదాలు పనికిరావని బ్రిటన్‌లో మాథ్యూ ఆర్నాల్డ్ ఒకప్పుడు మొత్తుకోవటం జరిగింది.

ఏది ఎలా ఉన్నా, రాజకీయపక్షాలు కళారంగాలలో ప్రవేశించి అవ్యవస్థను సంపాదించటానికి తోడ్పడుతున్నవే తప్ప ఈనాటివరకూ మరొకవిధంగా సహాయం చేయటం లేదని భావించవలసి వస్తున్నది. *

## పత్రికలు:

కళావిషయాలలో పత్రికలుకూడ ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్నవి. ఈ నిర్వహిస్తున్న పాత్రను తెల్పుకోవాలంటే వాటి తత్త్వం కొంత తెలుసుకొననిదే ప్రయోజనం లేదు. 'ఇలలో ఎంతో, కలలో అంత' అన్నట్లుగా సమాజ పెట్లో పత్రికలు అంతే. కాని మొత్తంగా పరిశీలించి ఆర్థికోపాధులనుబట్టి చెప్పవలసివస్తే పత్రికలను మూడు తరగతులుగా విభజించవచ్చును:—(౧) పార్టీ పత్రికలు, (౨) కుక్షింభరలు, (౩) స్వతంత్రలు.

## పార్టీ పత్రికలు:

దినపత్రికలు, సరియైన వారపత్రికలు సాధారణంగా పార్టీలు పూనుకొని నడపాలి. లేదా, లక్షాధికారులుకాని, కంపెనీలుకాని నడపాలి. సాధారణ వ్యక్తులకు ఆ నిర్వహణం ఈరోజులలో అసాధ్యమంటే అతిశయోక్తి రవమాత్రం లేదు. అందువల్ల పార్టీలవల్ల నడుపబడుతున్నప్పుడు పత్రికలు పార్టీల విధానాలే అవలంబిస్తవి తప్ప మరొకవిధానం అవలంబించవు. పార్టీవిధానాలలో ద్వైతభావం ఉన్నంతకాలం— అంటే సాధనమూ సాధ్యము, పాలితులూ పాలకులు, వీటిమధ్య అగాధమైన వ్యత్యాసం ఆయాపార్టీవిధానాలు ప్రతిపాదిస్తున్నంతకాలం లోగడ చెప్పినట్లు కళార్థనిర్ణయంలో అవ్యవస్థ దాపురించక తప్పదు.

---

* రాజకీయపక్షాలు కళాస్వరూపనిరూపక సిద్ధాంతాలను, అర్థాలను ప్రచారం చేయరాదని అపోహపడకూడదు. జీవితం స్వతంత్రమై మరొకదానికి సాధనం కానట్లే, కళ స్వతంత్రం. మరొకదానికి సాధనం కాదు. మానవుడు తల్లిదండ్రులవల్ల ఆవిర్భవించియూ స్వతంత్రుడైనట్లు కళ జీవితమూలకమయ్యూ స్వతంత్రం. రాజకీయపక్షాలు, సిద్ధాంతాలు, కార్యకలాపాలు మానవునికోసమైనట్లే రాజకీయపక్షాలు కళావిషయమై సాగించే ప్రచారం, ప్రతిపాదించే సిద్ధాంతాలు కళకు తోడ్పడాలి. అంతేగాని అది పార్టీలకు సాధనం కారాదు. ఇలాంటి దృష్టితో కళనుగూర్చి వ్యక్తులు ప్రచారంచేసినా, రాజకీయపక్షాలు ప్రచారం చేసినా దూష్యం కాదు.

కుక్షింభరలు:

ఈజాతిపత్రికలకు డబ్బు సంపాదించటమే ప్రధానం. అంతేకాని, సత్యం చెప్పాలనికాని, ప్రజలను సంస్కారవంతులను చేదామనికాని, తమకు చెప్పతోదగిన ప్రత్యేకసిద్ధాంతాలు ఉంటే వాటిని ప్రచారంచేసుకోందామనికాని వీటికి ఆదర్శంకాదు. అడ్వర్టయిజ్‌మెంట్లు రాబట్టుకోవటం, పదిప్రతులు ఎక్కువగా అమ్ముకోవటం వీటికి ప్రధానం. ప్రజలు ఏవిషయాలనుగూర్చి ఎలా వ్రాస్తే సంతోషిస్తారో, ఎలాంటివి ప్రకటిస్తే తల కంటగింపుగా ఉంటుందో గమనించి లాభకరమైన మార్గం అవలంబించటమే వీటికి పరమార్థం. ఒక్క ముక్కలో చెప్పాలంటే అవినీతి అనే ఒక ప్రత్యేకపదార్థం లేదని వీటి సిద్ధాంతం.

స్వతంత్రులు:

ఇవి కేవలం వ్యక్తుల హృదయాలవాలంలో ఆవిర్భవించి కళాకష్టస్తంతో పెరుగుతుంటాయి. అందువల్ల ఇవి స్థిరస్థాయులు కావు. కాని ఉన్నంతకాలమేకాక తరువాతకూడా ఇవి చేయగలిగిన మేలు అనల్పం. తమకు తోచిన సత్యం, మేలని స్ఫురించిన సంస్కారం ఉపదేశించటమే వీటికి ప్రధానం. ఇవి ప్రచారం చేసే అర్థాలు సత్యాలయినా, అసత్యాలయినా వీటి చిత్తశుద్ధిమాత్రం శంకించటానికి వీలులేదు. అయితే తతిమ్మాజాతులవలె ఇవి ఎక్కువ ప్రాచుర్యం పొందటానికి వీలులేదు.

ఈ పైవిభజన పరమమైనదనీ, పార్టీపత్రికలవల్లను, కుక్షింభరలవల్లను అసలు మేలుజరగటం లేదనీ భావించరాదు. సాధారణలక్షణమాత్రమే పేర్కొనటం జరిగింది.

అసలు పత్రికలనుగూర్చి ప్రకలనీ[illegible]చ్చినప్పుడు ముఖ్యవిషయం ఒకటి ఉంది. పత్రికలు పుస్తకాలతో పోల్చిచూచినప్పుడు కారుచౌక. అందువల్ల ఆర్థికంగా, భావికంగా దారిద్ర్యంలో కొట్టుకొనిపోతున్న దేశంలో పుస్తకాలకంటె పత్రికలనే ఎక్కువ కొనటం, సాహిత్యపరమైన, శాస్త్రపరమైనా అవేగా భావించటం జరుగుతుంది. నిజానికి ఏవిషయంపైనా కూలంకషంగా చర్చించటానికి గ్రంథాని కున్నంత పూర్ణఅవకాశం పత్రికకు ఉండదు. అందువల్ల సాధారణంగా పత్రికలలోని వ్యాసాలు గ్రంథంలోని ప్రకరణాలు అయితేతప్ప ఎంత ఉదాత్తాలయినా గ్రంథస్థాయికి అందుకోజాలవు.

అయినా పత్రికల కున్నంత విలువ పుస్తకాలకు లేకపోతున్నది. పత్రికలలో తరచుగా పేరుకని పిస్తేనే తప్ప ఈ రోజులలో కళాప్రపంచం గుర్తించటం దాదాపు అసంభవమే అవుతున్నది. ఇప్పటి పత్రికాతత్త్వంకు ప్రత్యక్ష[illegible] [illegible] [illegible]ంతగా ప్రతిభావ్యుత్పత్తులున్న [illegible] [illegible] తాయి. అసలు ఒక మంచిపుస్తకం [illegible] దన్న సంగతి తెలియజేయటానికి అత్యుత్తమసాధనం పత్రిక. పత్రిక తన కర్తవ్యం సరిగా నిర్వహిస్తే, ఉత్తమగ్రంథాల వ్యాప్తికి వీలుంటుంది. అయితే అలాంటి ఖ్యాతి ఒకటి ఉన్నదని గుర్తించకపోవటంవల్ల కాని, ఏ శాఖల గ్రంథాలు ఎవ[illegible] సమీక్షించటానికి అధికారులో తెలుసుకోలేకపోవటంవల్లకాని, ధనాభావంవల్లకాని, వస్తుతః సమీక్షాకారులలో ఉన్న వ్యవస్థారాహిత్యం వల్లకాని ఈ ఖ్యాతి ఉపేక్షితం.

పత్రికలు ఇలాంటి పాత్ర నిర్వహించటంవల్ల అవ్యవస్థ మెండవుతున్నదికాని తగ్గటం లేదు. పైగా కళాసృష్టుల విశిష్టతావిశిష్టతలు చాలవరకు కళోపాసకులు కానివారిచే నిర్ణయింపబడుతున్నవి.

శాస్త్రాలు:

పత్రికలకు తోడు వివిధశాస్త్రాలంకూ [illegible] కళారంగం తికమకలు పెంపొందటానికి తోడ్పడుతున్నవి. ప్రకృతిశాస్త్రాలు, సామాజికశాస్త్రాలు, ఎన్నో నూతన విషయాలు కనుగొన్నాయి. అయితే ఒక శాస్త్రంతో గాఢపరిచయ మున్నవారికి ఇతరశాస్త్రాలతో బొత్తిగా పరిచయం లేకపోతున్నది. అందువల్ల ఒకదానికొకటికి సంబంధం లేని ఖండవాదాలు అనేకాలు బయలుదేరుతున్నాయేగాని సమగ్రవాదాలు బయలుదేరి కళారంగంలో వ్యవస్థ, స్థాయి కలిగించటం లేదు. వివిధ శాస్త్రసమన్వయం జరగవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. అలాంటి ప్రయత్నాలు మొత్తంమీద ప్రపం

చమం దక్కడక్కడా జరుగుతున్నవి. ఇకముందైనా కళారంగంలో వ్యవస్థ ఏర్పడితే అది శాస్త్రీయసమన్వయంవల్లనే జరుగుతుంది. అంతకుతప్ప మరొక విధంగా అవకాశం లేదు.

వీటన్నిటికంటె అవ్యవస్థకు ముఖ్యమైన ప్రబల కారణం ఒకటి ఉన్నది. శాస్త్రానికీ, కళకూ మూలభూతమైన జీవితమే నిరంతరం మారుతున్నది. ఈ మార్పు నానాటికీ ఎక్కువవుతున్నది. ఏ రంగంలోనైనా ఎప్పటికప్పుడు కొత్తసమస్యలను ఎదుర్కొనవలసి వస్తున్నది. ఒకప్పుడు కావ్యభాష ఎలా ఉండాలన్న సమస్య ఉండేదికాదు. కావ్యనాయకులు సాధారణంగా ఎలాంటివారు ఉండాలన్న విచికిత్స ఉండేది కాదు. ప్రబంధయుగంలో ప్రబంధ లక్షణవిచారం ప్రాముఖ్యానికి వచ్చిందికాని, కథాలక్షణవిచారంకాని, ఖండకావ్యలక్షణ విచారంకాని రాలేదు. నాడు స్వభావోక్తి, అతిశయోక్తి పరస్పరం సమన్వితాలైనవే కాని సాహిత్యక్షేత్రంలో నేటి కాలంలోలాగా ప్రత్యర్థుల వలె ఒండొంటిమీదికి కత్తులు దూయలేదు. వాస్తవికతావాదం, యథార్థతావాదం, అతిలోకతావాదం, వ్యావహారికభాషావాదం మొదలైనవి ఇటీవల బయలుదేరిన మతాలు. ఈవిధంగా కళాదికరంగాలలో సమస్యలు ఎప్పటికప్పుడు మారుతున్నవి. దీనికి అంతకూ కారణం మూలమైన జీవితం ఎప్పటికప్పుడు మారుతుండటమే.

కాబట్టి నేడు కళారంగంలో క్రొత్తసమస్యలు వస్తున్నవంటే ఆశ్చర్యం లేదు. అయితే యీ మార్పు ఎలాంటి కంట్రోలూ లేక అతివేగంగా జరుగుతున్నది. కొత్త అవకాశాలు, అనుశాసనాలు, వాటిని అమలుపరచే క్రొత్తపద్ధతులు వస్తున్నవి. లోగడ వేదాలుకాని, తత్తుల్యాలుకాని పరమప్రామాణికాలు. నేడు అలా కాదు. బుద్ధి, హృదయం, అంతరాత్మ, వివేకం పరమప్రామాణికాలు. పైగా నేటి నూతనస్థితిగతులకు అనుగుణమైన విద్యాసంస్కారాలు కలిగించలేకపోతున్నారు. ఈ కారణాలన్నిటివల్ల నేడు కళారంగంలో తీవ్రమైన అవ్యవస్థ ఏర్పడింది.

అయితే ఇక్కడ కొంతమందికి నవ్వు కలగవచ్చును. సలు కేది ఏమిటి? ఈ మార్పు యథార్థమా? కానప్పుడు అవ్యవస్థ కేవలం ఆభాస; ఉన్న అజ్ఞానం అవిద్యవల్ల అలా కనిపిస్తున్నదని వాదించవచ్చును.

ఈ ఆక్షేపం కొత్తది కాదు. ఉపనిషత్తులు క్రీస్తుపూర్వం అయిదవ శతాబ్దిలోని పర్మెనైడ్సు మొదలుకొని ఏడవశతాబ్దిలోని శంకరుడు, మొన్నమొన్నటివాడైన బ్రాడ్లీదాకా మార్పు అన్నది అయథార్థమని అన్నవారే. ఎవరి మతానికి అనుగుణంగా వారు ఉపపత్తులు చూపించారు.

వారి వాదం శిరసావహించి మార్పు అసత్యమనే అనుకొందాము. అయితే ఈ మార్పులో ఒక క్రమం, కార్యకారణభావం కనిపిస్తున్నది. పైగా ఈ మార్పు వస్తుగతంమాత్రమే కాదు. భావంలో, శాస్త్రంలో, కళలో కనిపిస్తున్నది. ఒక శాస్త్రవిషయాన్నికాని, ఒక కావ్యాన్నికాని తీసుకొంటే ఆయారంగాలలో విద్వాంసులైనవారు కొంచెం ఇంచుమించుగా అది ఏకాలానిదో, దేనితరువాత అది వచ్చిందో చెప్పకోగలుగుతున్నారు. అంతేకాదు, ఇకముందు ఎలాంటి పరిశోధనలు రావటానికి వీలున్నదో, శాస్త్రాదికం, సాంఘికజీవనాదికం ముమ్ముందు ఎలా ఉండబోతున్నవో, స్థూలంగానైనా చెప్పకోగలుగుతున్నారు. ఒక ఖగోళశాస్త్రజ్ఞుడు ఒక నక్షత్రం ఫలానిప్రాంతంలో ఉండాలన్నాడు. తరువాత దూరదర్శినీసహాయంతో అలా ఉన్నదని చూచారు. ఒక రసాయనికశాస్త్రజ్ఞుడు ఇంత ఇంత బరువు కలిగిన పరమాణుక మూలద్రవ్యాలు ఇన్ని ఉండాలని సూచించాడు. అతడు చెప్పిన తరువాత కొన్నేండ్లకు సరిగా ఆ బరువులే కలిగిన ఆ మూలద్రవ్యాలను కనుగొన్నారు. మార్పు అంతా మిథ్య అయితే యివన్నీ ఎలా సంభవిస్తున్నవి? "గజము మిథ్య పలాయనము మిథ్యఅయినట్లే" అనవచ్చును. అయథార్థమనేదికూడా ఒక సత్పదార్థమేనా? అదికూడా హేతుమంతమేనా? అలా అయితే యథార్థతకు, అయథార్థతకు భేద మేమిటి? ఈరెంటికీ ఉన్న సంబంధ మేమిటి?

ఈప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానం లేదు. కాబట్టి మార్పు యథార్థమని అంగీకరించకతప్పదు.

చూస్తూ చూస్తూ భారతకాలంనుంచి నేటివరకూ వచ్చిన తెలుగుసాహిత్యం అంతా ఒకటే. మార్పు లేదనటానికి కాని, అజంతాచిత్రాలనుంచి ఈనాటి చిత్రాలదాకా చిత్రలేఖనం మార్పులేక ఒకటిగా ఉన్నదనికాని అంగీకరించలేము.

కాగా, మార్పు యథార్థమని సిద్ధిస్తున్నది. దానితోపాటు ఇంతదూరం పరిశీలిస్తూవచ్చిన కళాత్మక రంగంలోని అవ్యవస్థకూడా యథార్థమని తేలుతున్నది.

ఇక అసలు ముఖ్యవిషయం అలాగే ఉన్నది. ఈ అవ్యవస్థ ఎలా పోతుంది?

## అవ్యవస్థాపరిహారణకు మార్గం

ఏప్రారంభానికైనా ముందు జ్ఞానం ఉండాలి. జ్ఞానం ఒకవిధంగా వ్యాపారమే. కాని జ్ఞానకర్మల విభేదం యేర్పడినప్పుడు జ్ఞానం ముందు, తరువాత కర్మ అని చెప్పక తప్పదు. మానవచరిత్రలో ఎక్కడ చూచినా యీవిషయం స్పష్టంకాక మానదు. రూసోప్రభృతుల సిద్ధాంతాలు వెలువడి ప్రచారం జరిగినతరువాత ఫ్రెంచివిప్లవం వచ్చింది. కారల్ మార్క్స్ ఏకసూత్ర నిష్టసిద్ధాంతం ప్రచారంచేసిన తరువాతనే రష్యాలో కమ్యూనిష్టుప్రభుత్వం నెలకొన్నది. ఇలా చరిత్రలో నుంచి ఎన్ని ఉదాహరణలైనా ఇవ్వవచ్చు.

కాబట్టి కళాక్షేత్రంలో ఒక వ్యవస్థ ఏర్పడాలంటే ముందు కళ అంటే ఏమిటో, జీవితానికీ కళకూ, విజ్ఞానశాస్త్రాలకూ కళకూ, ధర్మానికీ కళకూ సంబంధ మేమిటో, దాని అర్థ మేమిటో నిశ్చితంగా ఆచరణీయాభిప్రాయం ఏర్పడాలి. అలాంటిది ఏర్పడాలంటే కళాప్రపంచంలోని అనుభూతులను సమన్వయపరచి ఒక సహేతుకవిధానం ఏర్పరచాలి. విజ్ఞానశాస్త్రం చేసే పనికూడా యింతే.* అందుకనే ఐన్‌స్టీన్ "మన అనుభవాలను సమన్వయించి ఒక సహేతుకవిధానం ఏర్పరచటమే విజ్ఞానశాస్త్రానికి అంతిమ లక్ష్యం" అన్నాడు.

అయితే ఒక్కొక్క విజ్ఞానశాస్త్రం ఒక్కొక్క రంగాన్ని మాత్రమే తెలుపుతుంది. కళాస్వరూపం చెప్పకోవాలంటే ఏ ఒక ప్రత్యేకవిజ్ఞానశాస్త్రమూ చాలదు. సాంఘికశాస్త్రాలు, ప్రకృతిశాస్త్రాలు అవలోడించి, అవి ప్రతిపాదిస్తున్న అర్థాలను సమన్వయించి ప్రకృతిజీవితాలను వివరించే సమగ్రసిద్ధాంతం ఏర్పరచాలి. ఈపని తత్త్వశాస్త్రం చేస్తుంది.

"సత్తానంతయు (*existence*) వివరించటం తత్త్వశాస్త్రవిధి. సత్తావివరణకు సత్తాజ్ఞానం కావాలి. సత్తా భిన్నభిన్నదశలకు సంబంధించిన జ్ఞానం వివిధ విజ్ఞానశాస్త్రాలవల్ల లభిస్తుంది. తత్త్వశాస్త్రం వివిధ శాస్త్రాలు ప్రతిపాదించే అర్థాలను అన్నిటినీ సమన్వయించి ప్రకృతిజీవితాలను వివరిస్తూ ఒక సమగ్రసిద్ధాంతం తయారుచేస్తుంది. విజ్ఞానశాస్త్రం ఉన్నదిఉన్నట్లు వర్ణిస్తే, తత్త్వశాస్త్రం ఉన్నదానిని వివరిస్తుంది. అందువల్ల తత్త్వశాస్త్రం శాస్త్రానికి శాస్త్రం అవుతున్నది."

ఇలాంటి తత్త్వశాస్త్రంవల్లనే కళాస్వరూపం నిర్ణయించుకోటానికి వీలవుతుంది. అయితే యిలా చెప్పటంవల్ల కొంత ఆశ్చర్యం కలగవచ్చును. "కళ వేరు—శాస్త్రం వేరు. రచయితసంవేదనం తెలియజేసే కళకూ, సామాజికునకూ చక్షుర్మార్గంద్వారా సద్యఃపరనిర్వృతి కలిగించే కళకూ, అతీంద్రియ అతిలోకార్థాలను వివరించే తత్త్వశాస్త్రానికీ సంబంధ మేమిటి?" అన్న శంక కలుగవచ్చును. ఈ సందర్భంలో ఏ శాస్త్రానికైనా ప్రత్యక్షానుమానాలు అనుల్లంఘనీయప్రమాణాలని జ్ఞప్తికి తెచ్చి ఒక విషయం చెబుతాను. జీవితానికీ, తత్త్వశాస్త్రానికీ ఉన్న సంబంధమే కళకూ అలంకారశాస్త్రానికీ ఉన్నది. జీవితవిశేషమే కళ అయినట్టుగా తత్త్వశాస్త్రవిశేషమే అలంకారశాస్త్రం. తత్త్వశాస్త్రం జీవితతత్త్వాన్ని అర్థంచేసుకొంటూ, తరువాత కొన్నివందల యేండ్లదాకా వచ్చిన జీవితాన్ని ముందుగా సూచించగలిగినట్లుగానే, ఉత్తరోత్తర వచ్చే కావ్యస్వరూపాలను కొన్నివందల

* "Sceice has two purposes. On the one hand, there is a desire to know as much as possible of the facts in the region concerned; on the other hand, there is the attmept to embrace all the known facts in the smallest possible number of general laws." 'Analysis of matter' Betrand Russel.

యేండ్లకు ముందుగానే అలంకారశాస్త్రం సూచించ టానికి వీలున్నది. ౧౯ శతాబ్ది పూర్వార్ధంవరకు ప్రకృతిశాస్త్రాలకు ఆధారభూతంగా ఉన్న పరమాణువాదాన్ని క్రీస్తుపూర్వమే డెమోక్రటీస్, కణాదుడు ప్రతిపాదించారు. ఈనాడు సాపేక్షకవాదం (*Theory of Relativity*), పదార్థవిజ్ఞానశాస్త్రం కనుగొన్న దేశకాలద్రవ్యాలస్వరూపం, ఆశ్రయస్వరూపం, కార్యకారణభావతత్త్వం సాంఖ్యదర్శనం క్రీస్తుపూర్వమే సూచించింది. పరిణామవాదాన్ని హెగిలీయన్ దర్శనం ముందుగానే యథాతథంగా కాకపోయినా స్థూలంగానైనా ఊహించగలిగింది. అలాగే అలంకారశాస్త్రంకూడ, కొన్ని కావ్యస్వరూపాలను, ముఖ్యంగా నేటి ఏకాంకిక, కథానిక, శ్రావ్యనాటిక, నాయకులు లేని నాటకాలు, ఇతివృత్తాలు లేని కావ్యాలు, రససాంకర్యంలోని వైచిత్రి ముందుగానే ఊహించగలిగింది.

ఇంతవరకూ పరిశీలించిన విషయాలనుబట్టి చూస్తే, అలంకారశాస్త్రం కళాస్వరూపాన్ని, వివిధసృష్టుల అర్థాలను, విశిష్టతావిశిష్టతలను, ప్రకృతి సామాజిక శాస్త్రాలతో దాని కున్న సంబంధాన్ని వివరిస్తుందని యీ రచయిత భావిస్తున్నాడని గోచరించకమానదు. అలాంటి శక్తే దీనికి ఉన్న పక్షంలో అలంకారశాస్త్ర చరిత్రను వ్రాస్తూ బోశంకో కవుల, కళాకారుల సృష్టుల బాగోగులను ఈ శాస్త్రం విమర్శించదనీ, వలం రామణీయకం అంటే ఏమిటో, దానికి జగత్తులో ఉన్న స్థానమేమిటో వివరిస్తుంది ; తత్త్వశాస్త్రానికి జగత్తత్త్వం మాత్రమే వివరించటం ముఖ్యమై ప్రవృత్త్యాదులతో సంబంధం లేనట్లే అలంకారశాస్త్రానికి రామణీయకతత్వపరిశీలనం ముఖ్యమై అనుశాసనం అముఖ్యమన్నాడు. అతడు అలా ఎందుకన్నాడని సందేహం కలగక మానదు. బోశంకో లిబరలిజం స్కూలువాడు. అందువల్ల ఆ శాస్త్రదృష్టితో అలా వ్రాశాడు. నిజానికి మానవచరిత్రలో బయలుదేరిన ప్రబలతత్త్వాలు, శాస్త్రాలు ఏవీ తమతరువాత వచ్చిన జీవితాల్ని మార్చి దిద్ది తీర్చలేదు. ప్లేటో అరిస్టాటల్ ప్రతిపాదించిన అర్థాలే అంకురించి ఎదిగి క్రైస్తవమతసిద్ధాంతాలుగా పుష్పించాయి. బౌద్ధతత్త్వబోధివృక్షఫలాలే అశోక హర్షులు, అజంతాచిత్రాలు., హెగిల్ తత్త్వఉల్బణాలే అటు కమ్యూనిజం, ఇటు ఫాసిజం. ఇంతకన్నా విశదంగా తత్త్వశాస్త్రం ఎలా జీవితాన్ని మార్చి దిద్ది తీర్చిందో చూపించవచ్చును. కాని ఆవిషయం మనకు ముఖ్యంకాదు. జగత్తు ఎలా ఉన్నదో మాత్రమే తత్త్వశాస్త్రం వివరిస్తుంది. కాని, నిత్యజీవితమందలి కార్యకలాపాలతో దాని కెలాంటి సంబంధము లేదన్న లిబరల్ పక్షంవారి శాస్త్రాలుకూడ జీవితాన్ని మార్చివేశాయి. యూరప్‌లో నేడు ఆర్థిక, రాజకీయ, సాంఘిక, ధార్మిక, కళావిషయకరంగాలలో ఏర్పడిన తీవ్రవిషమస్థితికి దారి తీసింది, ఫాసిజం కమ్యూనిజం బయలుదేరి ప్రబలమైనదీ ఈ లిబరలిజంవల్లనే. ఈనాడు అణుయుద్ధప్రమాదం ఏర్పడటానికికూడా ఈ లిబరలిజమే కారణ మని మేధావులు భావిస్తున్నారు.*

ఇంతకూ చెప్పవలసిన విషయం—బాహిరిల్లిన భావంకాని, తత్త్వంకాని ముభావంగా ఉండదు. బాహిరిల్లినాడే దానికి రెక్కలు బయలుదేరుతాయి. రెక్కలు వచ్చినప్పుడు ఏదీ ఊరుకోదు. అందువల్ల బోశంకోవాక్యం ప్రమాణంగా తీసుకోనవసరం లేదు.

సరే; అలంకారశాస్త్రం కళాస్వరూపం ఇది, సాహిత్యం ఇలా ఉంటుంది, సంగీతం ఇలా ఉంటుంది, చిత్రలేఖనం ఇలా ఉంటుంది, ధర్మశాస్త్రానికీ కళకూ, జీవితానికీ కళకూ ఈ సంబంధాలు ఉన్నాయి అని తెలుపుతుందే అనుకొందాము. ఇదంతా అనుశాసన మేకదా! ఈ అనుశాసనం స్వాతంత్ర్యవిచ్ఛేదక మేకదా. కాబట్టి అలంకారశాస్త్రం ముఖ్యమంటున్నారంటే కళాకారుల స్వాతంత్ర్యం అంగీకరించటం లేదని స్పష్టం కావటం లేదా? అంటే మానవుడు ఏ భగవదాజ్ఞనో, కర్మఫలాన్నో శిరసావహించటానికో, లేక అనుభవించటానికో భూలోకంలో అవతరిస్తున్నట్లు భావించటం కాదా?

---

*కారల్ మా౯ వ్రాసిన *Man and Society, Diagnosis of our Time* చదివితే కొంత వరకు ఈవిషయం బోధపడుతుంది.

ఇలాంటి ప్రశ్న సహజమే. అయితే యిలాంటి ప్రశ్న వేసేవారికున్న స్వాతంత్ర్యభావం విచిత్రం, విపరీతం. ఇది వ్యతిరేకి లక్షణమే కాని, అన్వయిలక్షణం కాదు. కేవల ప్రతిబంధకరాహిత్యం, పీతవిఘ్నత, ఆవరణభంగము స్వాతంత్ర్యం కాజాలదు. నిజంగా ప్రతిబంధకరాహిత్యమే స్వాతంత్ర్యమయిన పక్షంలో నేటి సామాజికునికంటే ఆటవికుడు, అతనికంటె పశుపక్ష్యాదులు, వానికంటె జడప్రపంచం స్వతంత్రం కావాలి. అది అలా ఉంచి కేవల పీతవిఘ్నత జగత్తుకే లేదు. గ్రహకోటికి, చేతనాచేతనకోటికి నియతసంబంధమున్నది. పూర్వపూర్వదశలచే ఉత్తరోత్తరదశలు అవచ్ఛిన్నము లవుతున్నవి. అందువల్ల కేవలప్రతిబంధక అభావం జగత్తుకే లేదు. అలాంటి స్వాతంత్ర్యం జగత్తుకే లేనప్పుడు జగత్తులో అంశభూతుడైన మానవునకు ఎలా లభిస్తుంది?

## స్వాతంత్ర్యము

స్వాతంత్ర్య మంటే అవివేకం కాదు; వివేకము, హేతుత్వము, స్వయమవచ్ఛిన్నత దానికి లక్షణాలు. కవి కావ్యాన్ని వ్రాస్తున్నప్పుడు తానొక అనుభవం వ్యక్తం చేస్తున్నా నన్న జ్ఞానం యత్కించిత్తైనా ఉండాలి. అలాంటి స్ఫురణమైనా లేనప్పుడు అరిషడ్వర్గానికి వివశుడైనవానివలె అస్వతంత్రుడగుచున్నాడు కాని స్వతంత్రుడగుట లేదు. అది స్వాతంత్ర్యమే అయిన పక్షంలో వాసనాప్రేరితమై కూసే పరభృతంకూడా స్వాతంత్ర్య మనుభవిస్తున్నదని చెప్పాలి.

వివేకమే స్వాతంత్ర్యం అంటే స్థితిగతుల గ్రహణం ఉండాలి. ఏ స్థితిగతులవల్ల ప్రకృత స్థితిగతులు వచ్చినవో, ఎలాంటివాటివల్ల వీటిని మార్చుకోటానికి కాని, నిలబెట్టుకోటానికి గాని వీలున్నదో గ్రహించాలి. అలాంటి జ్ఞానం ప్రవృత్తికి దారితీయక తప్పదు. ఎందుకంటే జ్ఞానం కొందరు భావిస్తున్నట్లు నిష్క్రియం కాదు. ఎఱుక అనేది ఎఱుగుట అనే క్రియవల్ల ఏర్పడుతున్నది. అందువల్ల జ్ఞానం క్రియాగర్భితం. క్రియవల్ల జ్ఞానం, జ్ఞానంవల్ల క్రియ పుట్టుచుంటాయి. ఇలాంటి స్థితితత్త్వగ్రహణశీలమైన జ్ఞానమే స్వాతంత్ర్యంకాని ఉన్న స్థితిగతులు సుఖదాయకంగా ఉన్నాయనో, లేక దుఃఖదాయకంగా ఉన్నాయనో అస్ఫుటభావం కలిగితే అది స్వాతంత్ర్యం పొందటం కాదు. ఇప్పటి సామాజిక స్థితిగతులు బాగున్నాయని కొంద రనుకొంటున్నారు. బాగుండ లేదని కొందరు భావిస్తున్నారు. ఇలాంటి అస్పష్ట సంవేదనం స్వాతంత్ర్యం కాదు. ఇప్పటి స్థితిగతులు ఈయీ హేతువులవల్ల సమంజసాలు, ఆవశ్యకాలు అని గ్రహించి వాటి రక్షణకు కృషిచేయటం స్వాతంత్ర్యం; కాక యీ యీ హేతువులవల్ల ఇప్పటి స్థితిగతులు అసమంజసాలు, అనావశ్యకాలు అని గ్రహించి వాటిని తొలగించి ఇంతకంటె మంచి స్థితిగతులను నెలకొల్పుకొనటానికి పాటుపడటమే స్వాతంత్ర్యం. అయితే వివేకం అనేక హేతువులవల్ల తరతమ భావాలు కలిగినదే అయినా యీ తారతమ్యాలకు స్పర్ధ లేదు. ప్రబలతమమైనదానిలో ప్రబలతరమైనది నదిలో నదంవలె, దావానలంలో విస్ఫులింగంలాగా లీనమైపోతుంది.

ఈ అర్థంలోనే వివేకానికి అంటూ సొంటూ, జాతి కులము, దేశము కాలము, నేను నీవు అన్న పరిచ్ఛేదం లేదు. వివేకానికి ఇలాంటి లక్షణం ప్రత్యక్షంగాకాని, పరోక్షంగాకాని తత్త్వవేత్తలు, శాస్త్రకారులు, కళాకారులు అంతా అంగీకరించారు. అంగీకరించని పక్షంలో శాస్త్రాలకూ, కళలకూ తావు లేకపోవలసింది. అంతే కాదు. ఇలాంటి లక్షణమే వివేకానికి లేకపోతే సమాజం ఏర్పడటానికి ఏర్పడినది విచ్ఛిన్నంకాక రక్షితం కావటానికి వీలులేదు. అనుక్షణం యుధ్యమాను లవుతూ మానవులు పశువులై, ఆ పశువులు జడాలై, ఆ జడాలు నష్టధర్మాలై ఈ జగత్తు, ఈ అనంతప్రపంచం లేకపోవాలి.

అందువల్ల వివేకం ఉన్నది. ఉన్నదానికి దేశకాలాలు ఆనేవి వృత్తులు, ధర్మాలు. ఇది అంగీకరించకపోతే సదసత్తులకు భేదం లేదు. అందువల్ల వివేకానికి శరీరం ఉంటున్నది. ఉనికికి మార్పు లక్షణం. మార్పు యథార్థం కాదన్నపక్షంలో ఆభాసను అంగీకరించవలసివస్తుంది. దానివల్ల భారతీయదార్శనికులవలె సంసారానికి అనాదిత్వము, తద్వారా సదసత్తుల ద్వైతము ఒప్పుకోవలసివస్తుంది. అందువల్ల మారునది, పరిణామి (*becoming*) యథార్థం.

పరిణామి యథార్థము, ఏకైకము. అందువలన ఈ పరిణామి తన పరిణామానికి తానే హేతువవుతున్నది. అంటే పూర్వదశనుంచి ఉత్తరదశ, ఆ ఉత్తరదశ నుంచి తదుత్తరదశగా నిట్లనంతక్రాంతి పొందుతున్నది. అంటే స్వయమవచ్ఛిన్నమౌతున్నది. ఈ స్వయమవచ్ఛిన్నతయే వివేకము, స్వాతంత్ర్యము, ధర్మము.

స్వయమవచ్ఛిన్నతను అంగీకరించని పక్షంలో భిన్నభిన్న దశలకు ఏలాంటి సంబంధం లేదనీ, ఆ దశాస్థితికి తదన్యము హేతువుగా మరొక పదార్థాన్ని అంగీకరించవలసి వస్తుంది. ఆపక్షంలో తిరిగి ద్వైతభావం ఏర్పడుతుంది. ద్వైతము వివేకానికే కుఠారపాతం; అవివేకానికి అంకురారోపణం.

ఇంతకూ స్వాతంత్ర్యమంటే కేవల ప్రతిబంధకాభావం కాదు. ఉన్న స్థితిగతులను తనకు తానుగా నిలబెట్టుకోటానికిగాని, తొలగించుకోటానికిగాని అవకాశం ఉండటమే. ఇది హేతువును పురస్కరించుకొని జరగాలి. అంతేకాని ఈస్థితి సుఖకరంగా ఉన్నది కాబట్టి ఉండా లనుకోవటం, లేక దుఃఖకరంగా ఉన్నది/ కాబట్టి పోవా లనుకోవటం మాత్రమే స్వాతంత్ర్యం కాదు. ఈసుఖదుఃఖాత్మకసంవేదనం స్వాతంత్ర్యనగర ప్రాంచలానికిమాత్రమే కొనిపోతుంది. ఇవి యీ యీ హేతువులవల్ల సమంజసమో, లేక అసమంజసమో నిర్ణయించుకొని రక్షితవ్యమైతే, యీయీపద్ధతులను అవలంబించి మార్చుకోవాలని తెలిసి తదనుగుణంగా ప్రవర్తించటం స్వాతంత్ర్యం. అందువల్ల స్వాతంత్ర్యానికి వివేకం పునాది అవుతున్నది. వివేకంలో తారతమ్యా లున్నాయి.

అందువల్ల వివేకతమమైనదే కాని మిగిలినవి స్వాతంత్ర్యం కాదు. అందుచే ప్రతిదశలోను స్వాతంత్ర్యం అనేది ఒకటే కాని పెక్కులు కావు.

ఉదాహరణ ఉంటే పైవిషయాలు ఇంకా స్పష్టంగా గ్రహించటానికి వీలవుతుంది. కవిస్వాతంత్ర్యమే తీసుకుందాము. అతడు స్వాతంత్ర్యం అనుభవిస్తున్నాడా, లేదా అన్న ప్రశ్నకు ముందు రెండు ప్రశ్నలకు సమాధానం చెప్పుకోవాలి. (౧) అతడు ఆవేశవివశుడై వ్రాస్తున్నాడా? లేక అనుభవం అభివ్యక్తం చేస్తున్నా నన్న స్ఫురణ ఉంటున్నదా? ఆ అనుభవ అభివ్యక్తిమాత్రమే ప్రధానమవుతున్నదా, లేక ఆ అభివ్యక్తి మరొకదానికి అంగముకాని, సాధనముకాని అవుతున్నదా? (౨) అతని కావ్యంలోని అర్థములు అన్యోన్యాశ్రితాలై స్వయంగా అవచ్ఛిన్నమౌతున్నవా? లేక బాహ్యార్థములవల్ల అవచ్ఛిన్నములవుతున్నవా? అనుభవం అభివ్యక్తం చేస్తున్నా నన్న స్ఫురణం కవికి ఉండి అతడు తన కావ్యార్థాలను తదమధ్యైకఅవచ్ఛిన్నాలను చేస్తే అతడు స్వతంత్రుడవుతున్నాడు. లేని పక్షంలో అస్వతంత్రుడవుతున్నాడు.

ఇలా స్వాతంత్ర్యమంటే వివేకము, స్వయమవచ్ఛిన్నత అవుతున్నదేకాని అవివేకము, విశృంఖల ప్రవృత్తి కావటం లేదు. శాస్త్రం వివేకానికి తోడ్పడుతూ స్వయమవచ్ఛిన్నతా సూత్రాలను పేర్కొని స్వాతంత్ర్యవికాసానికి సూర్యోదయమవుతున్నదేకాని అడ్డుతగలటం లేదు. అంతేకాదు. స్వాతంత్ర్యసిద్ధికి మొదటిమెట్టు శాస్త్రం, రెండోమెట్టు ప్రవృత్తి.

ఈవిధంగా శాస్త్రంఆవశ్యకత సిద్ధిస్తున్నది. లోగడ శాస్త్రం ఏమి చేస్తుందో, దాని లక్ష్యమేమిటో చెప్పుకొన్నాము. దానికి రెండంశా లున్నాయి: (౧) అనుభవం, (౨) ఉన్న అనుభవాల సమన్వయీకరణం. శాస్త్రనిర్మితికి ఈరెండూ ముఖ్యం. ఇలాంటి శాస్త్రం ఎవనికి వాడుగా, పూర్వంతో సంబంధం లేకుండ నిర్మించటం అసంభవం. వెనకటి శాస్త్రకారుల అనుభవాలను, సమన్వయీకరణమార్గాలను పరిశీలించి తనకున్న అనుభవాలతో, శోధించి స్వతంత్రంగా ఆలోచించినవాడు సమగ్రశాస్త్రం ఊహించుకోటానికి వీలవుతుంది. అంతకన్న సుగమమైన మార్గం మరొకటి లేదు.

కాబట్టి నేడు కళారంగంలోని అవ్యవస్థ పోవాలన్న సమగ్రమైన అలంకారశాస్త్రంకంటె మరొక తరణోపాయం లేదు. అలాంటి శాస్త్రజ్ఞానం ఉంటే వ్యాప్తిమార్గాలు ఆలోచించవచ్చును. కాని అలాంటి జ్ఞానం కొరతగా ఉంది. అందువల్ల అలంకారశాస్త్రనిర్మితికి ముందు అత్యంతప్రధానమైన ప్రాక్ప్రతీచిప్రాచీనఆలంకారికమతాలను తెలుగులముందు పెట్టటం అవసరం. ఆపని జరిగిననాడు సమగ్రమైన అలంకారశాస్త్రం ప్రతిభావంతులు నిర్మించటానికి వీలవుతుంది. అప్పుడే కళారంగంలో ఉన్న అవ్యవస్థ పోతుంది.

---



"గాలిమేడ" (హవామహల్) - జయపూర్

# కాతే కాంతా?

[కథానిక]

శ్రీ కపిల వెంకటరావు

కొండపల్లి పోస్టుమాస్టరు బొండాడ పరదేశి గారు ఆ రోజుకు టపా కట్టివేసి, స్టాంపులూ, సొమ్మూ లెక్కచూచుకుంటున్నాడు. ఆ లెక్క సుమారు ఒక గంటనుంచీ వేస్తున్నా తెమలడం లేదు. ఒకమాటు వేస్తే మూడణాలు ఎక్కువ వచ్చింది. ఇంకోమాటు అయిదణాలా కానీ తక్కువ వచ్చింది. వాన వచ్చేదీ చచ్చేదీ లేదుగాని ఒక్కటే చెమట పోస్తోంది. అవతల మబ్బులు ముంచుకువచ్చి, అసలే వెలుతురు తక్కువగా ఉండే ఆ పోస్టాఫీసు గదిలో అక్షరాలు కనపడ్డమే లేదు. పరదేశిగారికి ప్రొద్దుటినుంచి ఒళ్లు సరిగా లేదు. ఒళ్లు తిన్నగా లేకపోవడానికి కారణం మనసు తిన్నగా లేకపోవడమే. మూడురోజులనుంచి ఆయనా, భార్యా మాట్లాడుకోవడం లేదు. మాట్లాడడమంటే తోసుకుని, పూసుకుని మాట్లాడే మనిషి కాడు ఆయన. మిక్కిలి మితభాషి. అయితే మామూలుగా ఆడుకునే ఆ రెండు ముక్కలూ కూడా ఆయన ఈ మూడురోజులనుంచీ ఆడడం లేదు. దీనా దానా ఆయనకు లెక్క సరిచూచుకునే ఓర్పు లేకపోయింది. అదేసమయంలో అదివరకల్లా ఎక్కడికి వెళ్లిందో ఆయనభార్య శేషమ్మగారు తిరిగివచ్చింది. వచ్చినందుకు సూచనగా ముందు వీధితలుపు ధామ్మని చప్పుడు చేసింది. పనిలో ప్రవేశించిందని తెలిసేందుకు వంటగిన్నెలు పగిలేట్టుగా నేలమీద ఒకసారికి రెండు సార్లు పెట్టడం, బియ్యం పోసుకునే ఏకఖండపు కొయ్యపెట్టెమూత దభీలుమని వెయ్యడం మొదలైన పనులుచేసి, తర్వాత బియ్యం చేటలో పోసి చెరగడం మొదలుపెట్టింది. శేషమ్మగారు చేసే ధ్వనులన్నీ ఒక ఎత్తు, ఆ బియ్యం చేటలో పోసి చెరగడం ఒక్కటే ఒక ఎత్తు. బియ్యంగానీ, పప్పుగానీ చేటలో చెరగడం చప్పుడు వింటే పరదేశిగారికి తేళ్లూ, జెర్రులూ పాకినట్టుంటుంది. ఆ సంగతి శేషమ్మగారికి బాగా తెలిసే ఉంది. అందుకనే ఆవిడ పట్టుదలగా నిమిషానికి అరవై సార్లు చెరగడమున్నూ.

ఈ విధంగా భర్తని వేధించడం గృహిణి - సహధర్మచారిణి చెయ్యవలసిన పనేనా?

అది ఒక్కటే పరదేశిగారు అడిగిన ప్రశ్న. కొందరు అటువంటి సమయాలలో భార్యలమీద నోరు చేసుకుంటారు. ఇంకా కొందరు చెయ్యి చేసుకుంటారు. ఆయన మాత్రం అటువంటి మనిషి కాదు. ఎప్పుడైతే ఈ దాంపత్యం సరిగా నడవదనీ, దీనివల్ల తనకు సుఖం లభించకపోగా మహాబాధ కలుగుతోందనీ తోస్తుందో, ఆ క్షణమే ఆయన గృహం త్యజించి వెళ్లిపోవాలని లోగడ నిశ్చయం చేసుకున్నాడు. ఆ క్షణం ఎప్పుడు వస్తుందో అని భయపడుతూనే ఉన్నాడు.

ఆ క్షణం ఈ రోజున వచ్చింది. పరదేశిగారు తల రెండుచేతులా పట్టుకొని ఆలోచించారు. అవతల శేషమ్మ "చందమామా, చందమామా" అంటూ పాడుతోంది. శేషమ్మ పెద్ద పాటకత్తె కాదు. కంఠ మాధుర్యంకూడా తక్కువే. వరుసలూ అవీ ఆవిడకు తెలియవు. చందమామా అనకుండా చందమామా అంటుంది. ఆ చవర్గ ప్రయోగం వింటే పరదేశిగారికి చెవుల్లో సూదులు గుచ్చినట్టుగా ఉంటుంది. ఇదివరకల్లా భార్య సంగీతం ఆయనకు దుర్భరమైన విసుగు మాత్రమే పుట్టించేది; ఈరోజునమాత్రం ఆమనిషిమీద

పరమాసహ్యం, రోతా పుట్టిస్తోంది. శేషమ్మగారు ఒడ్డూ పొడుగూ పెద్దవిగ్రహం; ఆ విగ్రహానికి తగనటువంటి చిన్న ఉల్లిపాయంత తలకట్టు; ఒంటిచాయ సామాన్యం; అన్నింటినీ మించి ఆ కంఠం, ఆ పాట 'చందమామా!'

తాను ఈ మనిషిని వివాహం ఎల్లా చేసుకున్నాడో కదా! అప్పట్లో తనకు మతిభ్రమ కలిగి ఉంటుంది. యుద్ధంలో ఏదో డిపార్టుమెంటులో చేరి పూర్తిగా ఒక్క యేడాది నిండకుండానే తనకు మన్యపుజ్వరం పట్టుకుంది. అది ఎన్నాళ్ళకీ కుదరక పోతే అధికార్లు తనని ఇంటికి పంపించేశారు. సర్వీసు చాలినంత లేదని పెన్షను ఇవ్వలేదు. యుద్ధంలో పని చేసినవాడని ఒక తెల్లఅధికారి జాలిపడి పోస్టాఫీసులో పని చెప్పించాడు. జీతం విశేషం లేదు. అయినా తాను దూబరామనిషి కాడు; తిండిపోతూ తిరుగుబోతూ కాడు. ఆ నాలుగురాళ్లలోనే రెండురాళ్లు వెనకబడుతున్నాయి. అల్లా నాలుగుపిచికలు చేరగానే పరదేశిగారికి గృహస్థాశ్రమంమీద కోరిక పుట్టింది. ఒకరోజున ఆయన తన మేనమామగారి ఊరు వెళ్లాడు. మేనమామ ఎప్పుడో పోయినాడు. ఏకమాత్రసంతానం అయిన ఆడపిల్లను పెట్టుకుని కాలక్షేపం చేస్తూ, మర్యాదకోసం పాకులాడి, ఆబిడ్డకు పెళ్లి పెళ్లి అంటూ అంగలార్చి మేనమామ భార్యకూడా పోయింది. దిక్కులేని ఆపిల్లని దూరపుచుట్టాలు దగ్గరతీసి చాకిరీ చేయించుకుని ఇంత తిండి పడేస్తున్నారు. పరదేశిగారిని చూచి ఆ పిల్ల గుర్తించనేలేదు. చిక్కి శల్యంలా ఉంది; చిన్న తలకట్టు; చింపిరిజుట్టు; పళ్లు ఒక్కరవ్వ ఎత్తు; పిల్ల అంత యెరుపు కాదు. కాని కళ్లు మాత్రం చెంపకు చారెడుండి, పిల్లకు ముఖవర్చస్సు తెచ్చిపెట్టాయి. ఎవరో ముసలమ్మ ముందుకు వచ్చి, "నాయినా పరదేశీ, దీన్ని నీకు ముడివేసి ఆ బరువు కాస్తా తీర్చుకోకుండానే గుటుక్కుమంది దీని తల్లి. పిల్ల లక్షణంగా ఉంది చూశావుకాదూ బాబూ, నీనింద్రీలాంటి పిల్ల, నాతండ్రీ. ఎదిగిన పిల్లని ఎవరు నెత్తినపెట్టుకుంటారు నాయినా? వచ్చినవాడవు రానేవచ్చావు, గోపాలస్వామిగుళ్లో ఆ మూడుముళ్లూ వేసి, నీసొమ్ము నువ్వు తీసుకుపో తండ్రీ" అంది. పరదేశిగారు ఒకప్పుడు పద్యాలూ గీతాలూ వ్రాసేవాడు. ఒక పద్యమాలికా, రెండుమూడు గేయాలూ అచ్చుపడ్డవికూడాను. ఆయనకు తన భార్య యెటువంటిదిగా ఉండాలో లోగడనుంచీ దృఢమైన అభిప్రాయాలే ఉన్నాయి. అయినా ఆరోజున ఆయనకు అర్థంలేని జాలీ, త్యాగమూ పుట్టుకువచ్చి, వ్యవధి లేకుండానే వివాహం నిశ్చయించుకుని, ఆ పిల్లను దేవాలయంలో వివాహము చేసుకుని, అప్పటికే ఈడేరిన పిల్లకాబట్టి తేవడం తేవడం కాపురానికే తెచ్చుకున్నాడు. కాపురానికి వచ్చిన మొదట్లో ఆయన ఆమెతో ఒకటిరెండు పర్యాయాలు శృంగార ప్రసంగాలు చేశాడు. ఒకానొకనాటి రాత్రి శరత్కాల చంద్రుని శోభ ఆమెకు చూపించి ఆకాశసరస్సులో ఆ చంద్రుడు రాజహంసవలె ఉన్నాడు అని ఆయన అంటే, ఆ పిల్ల ఇకిలి నవ్వు నవ్వి "ఎవరైనా వింటే నవ్వి పోతారు. ఊరుకోండి. హంసట! హంసేమిటి, చందమామైతేను!" అంది. పరదేశిగారిని ఎవరో బలంగా నడుంమీద తన్నినట్టయింది. మరోకసారి, మందపవనం వీస్తున్నది. ఒయ్యారంగా ఊగుతూ విచ్చిన గోగుపువ్వులు ఆయనమనస్సును హరించినవి. ఆయనకళ్లకు అవి ఎలెక్ట్రిక్కు బల్బులవలె కనబడినవి. ఆ మాట ఆమెతో ఆయన వెలిబుచ్చగానే ఆమె పళ్లసందున కొంగు కరిచిపెట్టి, కిచకిచలాడి, "బాగానే ఉంది. గోగుపువ్వులు బల్బులేమిటే!" అంది. స్వతః మితభాషి అయిన పరదేశిగారు ఇంక భార్యతో రసికసంభాషణ మానుకున్నాడు. రానురాను, ఆయన ఎంత తక్కువమాట్లాడేవాడో ఆవిడ అంత యెక్కువగా మాట్లాడడం మొదలుపెట్టింది. మరికొన్నాళ్లకు శేషమ్మ మాట్లాడింది మాట్లాడినట్టుండేది. ఏమైనా ఆయన మాట్లాడేవాడు కాదు. శేషమ్మకు పాటలు పాడడం అనే ఒక అలవాటు కూడా ఉంది. ఏ పాట పాడినా పెద్ద గొంతుకతో పాడేది. ఆవిడ ఏం చెయ్యగలదు! ఆవిడగొంతుకే అటువంటిది. పరదేశిగారికి ఆ పాటలు బాగుండేవి కావు. ఒక్కరోజైనా ఆపాటలు మానెయ్యమని ఆ మానవుడు భార్యను కోర

లేదు. ఆమె తాన్సై మానమూలేదు. తిన్న తిండి ఒంట బట్టి ఆమె కాపురానికి వచ్చిన కొద్దియేళ్లకే లావైంది. చిన్నతనంలో వయస్సునుబట్టి ఏదైనా ఒక్కింత నేవళం ఏర్పడితే అది కాస్తా నశించిపోయి, ఆమెకు ప్రస్తుతస్వరూపం సంప్రాప్తమైంది. ఒక్క బిడ్డను కనలేకపోగా, ఒడ్డూపొడుగూ గలిగిన ఆ మనిషి తానే ఒక చిన్న బిడ్డలాగ ప్రవర్తించడం సాగించింది. ఆయనపోస్టాఫీసుతాళాలను తీసి దాచేస్తుంది. ఒకమాటు ఒక కట్ట కొత్త కవర్లు పట్టుకు పోయి నీళ్లపొయ్యిదగ్గర గూటిలో పెట్టి మరచిపోయింది. ఇంటిగొడవలన్నీ బంట్రోతు వెంకటస్వామితోటీ, పోస్టాఫీసుకు టపా కోసం వచ్చే పొగాకుకంపెనీదొరగారి నౌకరు తోటీ చెబుతుంది. పరదేశిగారు యుద్ధంలో ఉన్నప్పుడు సంపాదించిన ఉన్ని మేజోళ్లూ బూట్సూ తొడుక్కుని, నెత్తిమీద హాటు పెట్టుకుని పావిట్లో నిల్చుంది ఒక రోజు. అది చూచి ఆయనకు నవ్వు రాకపోగా పట్టరాని కోపం వచ్చింది. ఒకరోజున బల్లసొరుగులో ఉన్న మనియార్డర్ల తాలూకు డబ్బులో కొంత పట్టుకుపోయి చీరెలు కొంది. ఆ రోజున ఆయన శేషమ్మగారిని గట్టిగా చివాట్లు పెట్టాడు. అన్ని చివాట్లూ తిని, శేషమ్మ నవ్వింది—సిగ్గు లేని మొహం!

ఆయనకు ఉన్న కొత్త ఓర్పు నాశనంచేసిన విషయం యేమిటంటే, ఆ మనియార్డరు సొమ్ము గొడవ అయిన రెండుమూడు నెలలకి ఒకరోజున ఆయనకు "ఉత్తరం వచ్చిం"దంటూ బంట్రోతు ఒక కవరు ఉత్తరం తెచ్చియిచ్చాడు. పనితొందరలో ఆయన విలాసం తిన్నగా చూడకుండా కవరు విప్పి చదువుకుంటే, అది శేషమ్మ వ్రాసిన ఉత్తరం. శ్రావణమాసం వస్తున్నదట; తనకు పేరంటానికి వెళ్లడానికి చీరెలు లేవట; యింట్లో సొమ్ము ఎంత ఉన్నా అది ముట్టుకోడానికి తనకు హక్కు లేదట; అందుకని అప్పు వ్రాసి కొట్లో రెండు చీరెలు కొందిట; ఆ కొట్టువాడికి ఇచ్చే నిమిత్తం ముప్ఫైరెండు రూపాయలు తనకు వెంటనే మనిఆర్డరు చేయాలట. పరదేశిగారు ఉగ్రుడై పోయినాడు. ఎదురుగుండా ఉండే మనిషి, ఎప్పుడూ ఆ నోరు వాగుతూనే ఉంటుంది, ఆకొత్త మాటా ఆ నోటితోనే యేడవకూడదా, ఈ ఉత్తరం ఒకటి ఎందుకు? చేసిన పనేమో స్వతంత్రించి చేసింది. ఆ మాట అటుండనిచ్చి దేశాంతరంలో ఉన్నట్లుగా అణన్నర తగలబెట్టి ఈ ఉత్తరం వ్రాయడం చతురత్వమా, చమత్కారమా? ఆ రోజునుంచే ఆవిడతోటి ఆయన మాట్లాడడం మానుకున్నది.

అది జరిగి మూడురోజు లైంది. శేషమ్మగారు ఆ పాట పాడుతూ ఉంటే, అది ఆ విధంగా పాడుతూ ఉంటే, పరదేశిగారికి స్టాంపుల లెక్క ఆసలే తెమల లేదు. ఇంతలోనే టపాసంచి సీళ్లు వేసి కట్టి పెట్టుకుని వెళ్లేందుకు వెంకటస్వామి వచ్చాడు. పరదేశిగారు చూస్తుండగా వెంకటస్వామి మామూలుగా సంచులు మూతులు బిగించి, కట్టి, సీళ్లు వేశాడు. ఇంక సంచులు పట్టుకువెళ్లడమే తరువాయి. ఆ సమయంలో శేషమ్మ ఆఫీసుగదిగుమ్మంలోకి వచ్చి "సూరమ్మత్తయ్యగారు కవరు త్తరం పంపించారు. ఈ పూట టపాలో వెళ్లాలిట. తీసుకో వెంకటస్వామీ" అని ఒక కవరు అందిచ్చింది. "ఈయాల్టికి టపా కట్టేశాం అమ్మగారూ, ఇంక రేపే" అన్నాడు వెంకటస్వామి. "కడితే యేం, మళ్లీ విప్పదూ, సూరమ్మత్తయ్యగారు మాట దక్కనీయరు"అంది శేషమ్మ. ఇదంతా వింటూ పరదేశిగారు వెంటనే సంచులు తీసుకుని వెళ్లమన్నట్టుగా వెంకటస్వామికి సంజ్ఞ చేశారు. వెంకటస్వామి సంచులు బుజాన పెట్టుకొని బయటకు వెళ్లిపోతున్నాడు. శేషమ్మగారు అడ్డంగా వచ్చి ఒక్కతోపు తోసేసరికి వెంకటస్వామి బుజం మీదనుంచి సంచులు క్రిందపడ్డాయి. ఒకసంచి సీలు పగలగొట్టి, సంచి విప్పి, ముద్రా మొహరూ లేకుండానే సూరమ్మత్తయ్యగారి కవరు ఆసంచిలో వేసి, సంచీ కాలితో తోసి "ఇంక పట్టుకుపో" అంది. పరదేశిగారు పల్లెత్తి మాట్లాడలేదు. యజమాని విషయం, యజమానురాలి విషయమూ ఎరిగిఉన్న వెంకటస్వామి సంచి గుమ్మరించి, ఉత్తరాలన్నీ వెతికి, ఆ కవరుకూడా ముద్రవేసి ఉత్తరాలన్నీ లోపలవేసి సంచి మళ్లీ కట్టి, సీలు మళ్లీ వేసి పట్టుకువెళ్లాడు.

అడిగాడు. "నిన్ను చూస్తోంటే సాత్వికంగా ఉంటివి. ఒక పోటనక, ఒక ఊరనక, ఏపకయ్యా, నీవు బొయ్యేది ? ఏరు దాటి పోతుండావు. పెళ్ళాంతో పోట్లాడావా యేం ?"

పరదేశిగారికి కొంచెం ఆశ్చర్యం కలిగింది. "నాకు పెళ్ళాం ఉందో లేదో నీ కేం తెలుసును ?" అని అడిగాడు.

రాఘవయ్య పకపక నవ్వాడు.

"నీ మొగమే చెప్పద్ది. ఎయ్యిమందిని నిలబెట్టు. ఎర్రిమొగాలుండావోళ్ళందర్ని పోల్చేత్తా. పెళ్ళాంతో కాపురం చేసేవోళ్ళా ఎర్రిమొగం ఎయ్యకతప్పదు. అవునా మరి, అదుగో ఆ కోటు చూడు. ఆ కోటు ఆమూల చిరిగిందే, అ దొంగ ముయ్య కుట్టిందీ ? నీ యేళ్ళు చూత్తే నువ్వేదో గుమాత్తావులా గుండావు. నీకు కుట్టుపని రాదని నే డంకామీద దెబ్బకొట్టి చెప్పనూ ! అయిందా, నే నొచ్చి గడియ గాలేదు. అటునుంచి యిటు తిరిగావు, ఇటునుంచి అటు తిరిగావు, మువ్వయి తావులు మూడుదిక్కులా తిరిగావే, అంతే ఆరాట పడేవాడు ఆడదానితో కాపురం చేసే రొగ్రోడని ఒకరు చెప్పాలంటయ్యా ? ఒవరో వత్తున్నట్టు చూత్తావు, ఒవరో పలికినట్టు యింటావు. నువ్వు ఆడ దాని సేతికింద నలిగిన గెటం అని నేను జడ్జీ కోర్టులో వాదిత్తా. ఇన్నెందుకు; ఒక్క మాటకు జవాబు చెప్పు—నాగుడ్డలు చూడు నీగుడ్డలు చూడు, నీగుడ్డలంత చుబ్బరం గుండయి ? నాయి మట్టిగొట్టుకుండయి—ఒవరో ఆడకూతురు నీమీద నిగాచెయ్యబట్టే నువ్వు గుడ్డలికి మట్టి అంటనియ్యకపోతివి, మా దొరా" అన్నాడు రాఘవయ్య.

పరదేశిగారికి ఎంతయినా ఆశ్చర్యం కలిగింది. "నువ్వు చాలా అసాధ్యుడివిలా గున్నావే!" అన్నాడు.

రాఘవయ్య అన్నాడు: "నేను సొయంగా అనుభవించిన మాటతప్ప నుకేమీ చెప్పలేదే. అబ్బో, నేనూ ఆడదానిసంగతి ఎరగనోణ్ణి కాదు. ఇదుగో, ఈ సేత్తోనే మొదటిదాన్ని గొంతుక నులిమింది." పరదేశిగారికి గుండె జల్లుమంది. "నువ్వు తాగుడు మానతావా మానవా అని హటం పట్టుకుని కూకుండెది; నేను తాగేది తాగకేనే, సచ్చిందానా అన్నా. మాటలు మిగిలింది. మాటంటే మా పౌరుషం ఈ గెటానికి. గొంతుక నొక్కేశాను. కెవ్వుమంది. గుడ్లు ఎల్లు కొచ్చినయి. ఏవ్..."

పరదేశిగారు మాట్లాడలేదు. రాఘవయ్య మాట్లాడుతూనే ఉన్నాడు:

"రెండోది పార్లాపడి సచ్చిందా ? అదీ గడు గ్గాయే. నన్నొకంట కాపెట్టి ఉంటద్ది. ఏరుదాటి ఈ రేవదాం రాయే అంటే రాదు. గడుసుది. ఏట్లో తోసేస్తావా, మా అయ్యా అంటది. జొరం ఒచ్చిన తాప మందు దెచ్చిత్తే పారబోసింది; ఆ మందు తాగితే నాసామిరంగా అనుమానపుముడిసితో ఏంకాపురంచేత్తాన్నను ! ఒక్కత్తీ నాయెంట తిరునాళ్ళకి రాదు; తింద్రో, అన్నో యెంట ఉండెందీ కొంప గదలదు. అయినాఈయేల దానిపని అయిందిలే. ఇదిగో యినుకో. తిన్నంగ ఎల్లేది, తలుపుకొట్టేది. కర్రబట్టుకొని నూల నక్కేది. ఓగు ఆదు అంటది. మారుగొంతుక బెట్టుకొని అరిసేది, తలుపు తీయొస్తది. తలుపు కొంత తీయంగానే కర్ర దాన్నెత్తిన బెట్టేది, ఉరుకొత్తేది. దెబ్బకి కొబ్బరికాయలాగ పగలాల తలపండు..."

అదివరదాకా తుంపరలాగ పడుతూ మళ్లీ ఆగుతూ ఉన్న వర్షం కొంచెం విసురుగా పడ్డం ప్రారంభించింది. ఏటిగాలికూడా చాలా విసురుగా వీస్తోంది. మన్యపుజ్వరం ఒంటబట్టించి ఉన్నదేమో పరదేశిగారికి వెంటనే వణికెం పట్టుకుంది. పెడీ పెడీ మని నాలుగు తుమ్ములు తుమ్మాడు. ఇంక కాస్సేపటికి వణుకు పుట్టుకుని వస్తుంది. అది పుట్టుకువస్తే ఇక లాభం లేదు, మనిషి నాలుగురోజులకే మన లోకం. శ్రమపడ్డా, వానలో తడిసినా ఆజ్వరం ఉన్నానని ఊడిపడుతుంది. ఆయనవైపు ఖరిచూచి రాఘవయ్య, "పడవరాదుగాని బాబూ, నువ్వెల్లు ఎన క్కెల్లు. నీ మొహం చూస్తే జొరం వచ్చేట్టుంది. ఎల్లు ఎల్లు పెళ్లాంతో పోట్లాట కేంలే. ఎన్ని తాపులు పోట్లాడినా నువ్వు గెలవలేవు. ఆడజాన్ని గెల్చిన యీారుడు యిక్ర

మార్కుడు కలికంలో లేదు. ఇన్నావా! నేను చచ్చు ఎదవనై కూకున్నానని చెప్పిం దినకో. ఎల్లు బాబూ" అని సలహో ఇచ్చాడు. వాడు ఆ వానలో చీకట్లో ఎక్కడికో వెళ్లిపోయినాడు. పడవ రాలేదు.

పరదేశిగారు వెనక్కి దారిపట్టారు. తుమ్ములు వస్తున్నాయి. జ్వరం ముంచుకుని వస్తుందేమో నని గబగబ నడిచి ఆయన యింటికి వచ్చేశాడు. ఇల్లు పది బార లుండనగా వర్షం పడి ఎక్కువైంది. ఆ కాస్తదూరం లోనే ఆయన బాగా తడిసిపోయినాడు. వణుకుపుట్టుకునివచ్చింది. ఆయన "ఉహూహూ"అంటూ సుమ్మం లోకి వచ్చాడు. తలుపు తెరచుకుని వానజల్లులో తడుస్తూ శేషమ్మ అక్కడే నిల్చుని ఉంది. ఆయనకు చూచింది. "ఆ! అనుకుంటూనే ఉన్నా, జ్వరమో ఏదో ముంచుకు వస్తుందని. ఎక్కడైనా జ్ఞానం ఉన్న మనిషైతేగా. ఛీఛీ నేను చెయ్యలేనమ్మా, ఈ కాపురం. ఇన్నికళ్లు నేను కనిపెట్టి చూస్తుంటేనే ఇల్లాఉంటే, నేను చస్తే యిక చెప్పక్కర్లేదు. ఈ మనిషి కన్న తెలివితేటలకి ఆ దిక్కుమాలినా దెవరమ్మా, పాత గుడ్డ లమ్ముతాడు, రాఘవయ్యగావున్నా, ఆ పాత గుడ్డల రాఘవయ్యలా అయిపోతాడు. జ్వరం వంటిని జీర్ణించిన మనిషికదా వానలో తడవడం ఏమిటి చెప్పండి? చిన్నతనమా, ఏమైనానా? నేను దేనికీ నో గత్తను. ఎప్పుడైనా ఉండలేక 'అః'అంటే అప రాధ మాయెను. 'ఊ'అంటే ఉపరాధమాయె. నేను ఎన్నిందాల చావనమ్మా! దేనికీ ఒక్కటే మాన మాయెను. ఇదిగో ఇల్లా రండి. మీకు అది పడిశెనభారం, జ్వరం కాదు, జ్వరం వచ్చేటుందు మీకు వాంతులూ ఒళ్లుత్రిప్పూ వస్తుంది. అట్టే కంగారుపడకండి. ఇక్కడ పడుకోండి."

అంటూ ఆయనను లాక్కునిపోయి మంచం మీద పడుకోపెట్టింది. శీతలపు గడియవేసి, పెద్ద బూర్నిసు తెచ్చి ఆయనకు కప్పింది. వంటింట్లోకి వెళ్లి రెండు నిముషాలలో తిరిగివచ్చింది. ఒకచేతులో యూకలిప్టసుఆయిలు సీసా, ఇంకొక చేతి చూపుడు వ్రేలి చివర కలికమూ.

"రండి, కలికం వేసుకోండి, తరవాత యూక్లిసు ఆయిలు గుండెలకు రాస్తాను" అంది.

"అః ఆ! కలికం వద్దు"అని మూలిగాడు ఆయన. అని బూర్నీసులో తల దూర్చుకుని పడుకున్నాడు.

"అక్కర్లేదుగా?" అని శేషమ్మ, యూకలిప్టసుఆయిలుసీసా కిందపెట్టి, ఒక్క లాగుతో ఆ దుప్పటి తీసేసి, కాళీచేత్తో వస్తాదులాగ పరదేశి గారి మెడ పట్టుకొంది. "తెరవండి కళ్లు"అంది.





[శిలలో మలిచిన రాయలవారి శీర్షము]

# కృష్ణదేవరాయలు

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

## ప్రకరణము ౧. ఆధారములు

దక్షిణదేశమును పూర్వకాలమునపాలించిన హిందూ చక్రవర్తులలో కర్ణాటసామ్రాజ్యాధిపతి శ్రీ కృష్ణదేవరాయలు ప్రఖ్యాతుడు. ఆ మహారాజుకీర్తిమూర్తి దాక్షిణాత్యహిందూహృదయసీమల స్థిరముగ నెలకొనియున్నను, ఆయనచరిత్ర విద్యార్థులకుగూడ సుపరిచితము గాదు. ఉత్తరాపథమునకు విక్రమాదిత్యభోజనరపాలు రెట్లు వంద్యులో కృష్ణరాయలట్లే సర్వదక్షిణభారతభూమికి బూజనీయుడు. ఆంధ్రవాఙ్మయము నతడెట్లు పోషించినదియు, సంస్కృతకర్ణాటాదిభాషల నెట్లాదరించినదియు నందరెఱుగుదురు. కాని యతని చరిత్రనుగూర్చి జనసామాన్యమున కెఱుకపడిన విషయ మత్యల్పము. ఇటీవల చరిత్రపరిశోధకుల కృషివలన రాయలవారి చరిత్రకు సంబంధించిన విషయములు విదితము లైనవి. లభ్యమైన చరిత్రాంశములనెల్ల క్రోడీకరించి శ్రీకృష్ణరాయల చరిత్రము సాధ్యమైనంతవఱకు సంపూర్ణముగ రచియింపవలయునని నాయుద్దేశము.

ఆద్యమున శ్రీకృష్ణరాయచరిత్రరచనకు గల సాధనసామగ్రులను వర్ణించుట యుక్తము. ఇవి యిరుదెఱగులవి. మొదట పేర్కొనదగినవి శాసనములు. తామ్రపట్టికలేమి, శిలాశాసనములేమి రాయలకాలము నాటివి దాదాపు ౨౦౦ ఇప్పటివఱకు లభ్యపడినవి. ఇవి సంస్కృతాంధ్రద్రావిడకర్ణాటభాషలయందు విరచింపబడియున్నవి. సంఖ్య బహుళమగుటచేత నీ శాసనముల నన్నిటిని ఇట వర్ణించుటకు వలనుపడదు. ముఖ్యమైనవానిని సందర్భానుసారముగ గ్రంథమునం దుదాహరించిన చాలును. పరిశోధనాసక్తి గలవారలు మదరాసుగవర్నమెంటుశాసనపరిశోధకశాఖవారి సాంవత్సరికనివేదికలను, ఎపిగ్రాఫియాఇండికావంటి శాసనసంశోధకపత్రికలను, దక్షిణఇండియాశాసనపరంపర, ఎపిగ్రాఫియాకర్ణాటికా మొదలగు, శాసనగ్రంథసంపుటములను బరిశోధించి తృప్తిపడవచ్చును.

శాసనములతరువాత పేర్కొనదగినది వాఙ్మయము. వాఙ్మయ మనగా కేవలగద్యపద్యాత్మకమైన కావ్య మని యెంచరాదు. గ్రంథరూపమున నుండు సాహిత్యమంతయు నీతరగతిలో జేరినదే. రాయలవాడు

విరచితములైన కావ్యములేకాక మహమ్మదీయచరిత్రకారుల రచనలు, పోర్చుగీసుగ్రంథకర్తల వృత్తాంతములు, వంశానుచరితములు, తరతరములనుండి లోకమున ప్రచారమునందుండు గాథలు, చాటూక్తులు, గ్రామకవిలెలు, కైఫీయతులు మొదలగునవి యన్నియు నిట గ్రాహ్యములు. ముఖ్యమైన ఆధారగ్రంథములను సంగ్రహముగ నిచట వర్ణించుచున్నాను.

కావ్యములు: భాషననుసరించి ఇవి రెండు తెరగులవి.

(౧) సంస్కృతమున కొన్ని గలవు. సంస్కృతకావ్యములలో ప్రధానమైనది రాజనాథ డిండిమవిరచిత అచ్యుతరాయాభ్యుదయము. ఇందు కృష్ణరాయల కళింగదిగ్విజయ ప్రస్తావన గలదు. మఱియు భండారు లక్ష్మీనారాయణకృత సంగీతసూర్యోదయ పీఠికయందు కళింగదిగ్విజయమును సేదులఖానునిపై విజయమును గలుబరిగదండయాత్రయు వర్ణింపబడియున్నవి.

(౨) ఆంధ్రప్రబంధములు: ఇవి ముఖ్యముగ మూడు: (i) మొదట పేర్కొనదగినది యల్లసాని పెద్దనార్యకృతమనుచరిత్ర. పీఠికయందును, నాశ్వాసాద్యంతములందును గటకదహనపర్యంతము గల కృష్ణరాయల కళింగవిజయయాత్రయు, మఱికొన్ని యజ్ఞాత దండయాత్రలును వర్ణింపబడియున్నవి. (ii) కృష్ణరాయరచితాముక్తమాల్యద. దీనికిని మనుచరిత్రకును, పీఠిక చాలవఱకు సామాన్యమైనను, ఇందు కళింగదండయాత్రయందు చేకుఱిన విజయములు మఱియు విపులముగ వర్ణింపబడియున్నవి. మఱియు నిందు ఉత్తర దిగ్విజయము, సగరపురకల్బరిగనగరప్రాంతముల దురకలతో జరిగిన యుద్ధములును, సేదులఖానుని వధయు, కెంబావిరణక్షేత్రవిజయమును వివరింపబడియున్నవి. ఇంకను కృష్ణరాయవిరచితసంస్కృతాంధ్రగ్రంథములును నిందు పేర్కొనబడియున్నవి. (iii) ముక్కుతిమ్మనగారి పారిజాతాపహరణము. ఇందును గృష్ణరాయల కళింగదిగ్విజయము వర్ణింపబడియున్నది. ఇతర గ్రంథములందు గానరాని రాయల యుమ్మత్తూరుదండయాత్ర ప్రస్తావన ఇందు గలదు. ఇంతవఱకును పేర్కొనిన మూడు ప్రబంధములయందేకాక కృష్ణరాయల దండయాత్రలను గూర్చిన విశేషాంశములు తరువాతి యాంధ్రగ్రంథములందచటచట చెప్పబడియున్నవి. కాని వాని నన్నిటిని ఇచట పేర్కొనదలపెట్టలేదు. అర్వాచీనగ్రంథములలో రెంటినిమాత్ర మిచట చెప్పక తప్పదు. ఇందొకటి రాయవాచక మను వచనగ్రంథము. దీనిని వచన కావ్య మనుట తప్పు. కావ్యలక్షణము లెవ్వియు నందు గానరావు. యత్కృతమో తెలియదు. మధురనాయకుడును, అడపము చిననాగినాయని కుమారుడైన కట్యము విశ్వనాథనాయకుని స్థానాపతి యొకడు దాని రచయితయైన ట్లందు కలదు; కొందఱిది కృష్ణరాయల కాలమున విరచింపబడె నని తలచుచున్నారు; కాని యది క్రీ. శ. ౧౬ వ శతాబ్దారంభమునకు ముందు రచియింపబడియుండదని యందు వర్ణింపబడిన యంశములు కొన్నింటివలన రుజువగుచున్నది. (౧) రాయవాచకమందు భాగ్యనగరప్రస్తావన గలదు. ఇది యిప్పటి హైదరాబాదునకు ప్రథమనామము. ఈ భాగ్యనగరమును క్రీ. శ. ౧౫౯౧ వ సంవత్సరమున గోల్కొండ రాజ్యమున కధిపతియైన మహమ్మదకులీకుతుబుశాహు తన రాజ్యారంభదశయందు నిర్మించియుండుటచేత నా పట్టణమును పేర్కొను రాయవాచక మంతకుపూర్వము రచియింపబడియుండదు. (౨) మఱియు రాయవాచకరచయితకు కృష్ణదేవరాయల సమకాలికుడును ప్రత్యర్థియు నైన గజపతి యెవ్వడో తెలియదు. పేరు చెప్పక విడిచియుండిన నతని యజ్ఞానము వెల్లడియై యుండదు; కాని యా గజపతిపేరు ముకుందబాహుబలేంద్రు లని చెప్పుటవలన రాయవాచకరచయిత కృష్ణరాయలవారికి సమకాలికుడు గాడని నిశ్చయమగుచున్నది. వీలన కళింగరాజ్యమును పాలించిన గజపతులలో ముకుందబాహుబలేంద్రనామధారి యొక్కడే. ఇతడు క్రీ. శ. ౧౬ వ శతాబ్దపు చతుర్థపాదమున కళింగదేశమును పాలించెను. గోల్కొండసుల్తానులకును నక్బరుపాదుశాహునకును కర్ణాటసామ్రాజ్యాధిపతి రెండవ వెంకటపతిరాయలకును నితడు సమకాలికుడు; కావున ముకుందబాహుబలేంద్రుని పేర్కొను రాయవాచకము కృష్ణరాయలనాడు రచియింపబడలేదని దృఢముగ జెప్ప

వచ్చును. క్రీ. శ. ౧౬ వ శతాబ్దప్రారంభమున విరచింపబడి యుండవచ్చును. రాయవాచక మంతటి విశ్వాసపాత్రమైన యాధారగ్రంథము గాదు. రక్కసి తంగడియుద్ధానంతరము కావేరికి దక్షిణము నుండు రాజ్యమును నాక్రమించుకొనిన మధురనాయకులు కృష్ణరాయలచే దక్షిణరాజ్యమున నధిష్ఠింపబడి రను నసత్యపు కల్పితగాథను ప్రచారములోనికి దెచ్చుట ఈ గ్రంథముయొక్క ముఖ్యోద్దేశము. కాని యందు వర్ణింపబడియుండు కృష్ణరాయల తైర్థయాత్రాకథన మన్యచరిత్రాధారముల మూలమున వాస్తవ మని తేలుచుండుటవలన దానిని మన మంగీకరింపవచ్చును.

రెండవది కుమారధూర్జటికృతకృష్ణరాయవిజయము. పద్యకావ్యము. కాని దీని నొక ప్రత్యేక స్వతంత్రచరిత్రాధారగ్రంథముగ దలచుటకు వలను పడదు. ఇది క్రీ. శ. ౧౬౩౦-౧౬౪౨ ల మధ్య కర్ణాటకసామ్రాజ్యమును పాలించిన ముమ్మడివెంకటపతి రాయల కాలమున రచింపబడెను. మధురనాయకుల ప్రస్తావన యందు గానరాకపోయినను రాయవాచకమున కిది పద్యప్రతి. కొన్ని సందర్భములందు రాయవాచకమును ముందుంచుకొనినగాని సుబోధము గాదు. కుమారధూర్జటి యుద్దేశము కృష్ణరాయల విజయములను మాత్రమే వర్ణించుట యగుటవలన రాయవాచకమందలి యన్యాంశముల నాతడు విడిచిపుచ్చెను.

మహమ్మదీయచరిత్రలు : మనకు దెలిసినంతవరకు విజయనగరచరిత్రకు సంబంధించిన విషయములను దెలుపు మహమ్మదీయచరిత్రగ్రంథములు మూడు. ఇవి కృష్ణరాయల సమకాలరచనలు గావు; అర్వాచీనములు. మొదట చేర్కొనదగినది తారీఖీఫరిస్తా; క్రీ. శ. ౧౬ వ శతాబ్దారంభమున రచింపబడెను. రెండవది బుర్హాన్-ఇ-మ అసీరు. కొంచెమించుమించుగ తారీఖీ ఫరిస్తాకు సమకాలికగ్రంథ. ఈ రెండు గ్రంథముల యందును కృష్ణరాయల ప్రస్తావన లేదు. కాని ఆ రాయల రాజ్యకాలమున దక్కనీమహమ్మదీయ రాజ్యములకును, విజయనగరసామ్రాజ్యమునకును గల పరస్పరసంబంధము వీనివలన గొంత తెలియవచ్చుచున్నది. మూడవది తారీఖీ మహమ్మదు కుతుబ్‌శాహు. ఇదియు కొంచె మించుమించుగ పైరెండుచరిత్రల రచనాకాలముననే వ్రాయబడెను. ఇందువలన కృష్ణరాయలకును, గోలకొండరాజ్యస్థాపకుడగు సుల్తాన్ కులీకుతుబు శాహునకును నడచిన సమరవృత్తాంతము గొంత తెలియ వచ్చుచున్నది.

పోర్చుగీసుగ్రంథకర్తలు : పోర్చుగీసువారు వర్తకము కొరకు క్రీ. శ. ౧౪౯౮ వ సంవత్సరప్రాంతమున హిందూదేశమునకు వచ్చిరి. వీరికి మహమ్మదీయులతో సహజవైరముగలదు. దీనికి గారణములు రెండు: మొదటిది మతద్వేషము; రెండవది ఇంతకంటె ప్రబలతరమైన వర్తకప్రతిస్పర్ధ. పోర్చుగీసువారి రాకముందు పాశ్చాత్యదేశములకును హిందూస్థానమునకును మధ్యజరుగుచుండిన వాణిజ్యమంతయు నరబీపారశీమహమ్మదీయ మోడవర్తకులమూలమున నడచుచుండెను. ఈ యోడవ్యాపారము దమ కొణయూచి యని పైచేర్కొనిన మహమ్మదీయవర్తకులు దలచుటచేత పోర్చుగీసుల రాకను వీరు సహింపరైరి. పెక్కు నావికాయుద్ధము లిరుపక్షముల వారికిని నడచినవి. ఇందు తుదకు మహమ్మదీయు లోడిపోయిరి. పశ్చిమసముద్రతీరమందలి రేవుపట్టణములు కొన్నింటిని పోర్చుగీసు లాక్రమించుకొనిరి. మఱియు నప్పుడు గుజరాతు దక్కను దేశములు రెండును మహమ్మదీయప్రభువుల యధికారముక్రింద నుండిన కారణమున పోర్చుగీసుల కచట సులభముగ ప్రవేశము గలుగక పోవుటచేత, వారు తమవలెనే మహమ్మదీయులకు సహజశత్రువులైన విజయనగరచక్రవర్తులతో మైత్రిని గుదుర్చుకొనిరి. ఇందువలన పోర్చుగీసురాయబారులు, వర్తకులు, ప్రయాణీకులు పెక్కండ్రు విజయనగరమునకు బలుమారువచ్చి వ్యాపారార్థమేమి, యన్యకారణములవలననేమి కర్ణాటసామ్రాజ్యమునం దంతటను సంచారముచేసి పోవుచుండిరి. ఇట్లు వచ్చిన పోర్చుగీసులం దనేకులు గర్ణాటసామ్రాజ్యచరిత్రను గూర్చియు, మఱియు నందు తాము కన్న విన్న విషయములను గూర్చియు గ్రంథములను వ్రాసిరి. విజయనగరసామ్రాజ్య విషయములను దెల్పు గ్రంథములు పోర్చుగీసుభాషయందు పెక్కు కలవు. కాని పోర్చుగీసు భాష దెలిసిన చరిత్రపరిశోధకు లరుదగుటచే నివి మన

అందుబాటున లేవు. పీటరులెంకారులవంటి పోర్చుగీసు భాషావిదు లుండినను వారి కాంగ్లము దెలియకపోవుటచే వారి పరిశోధన లమూల్యములైనను చరిత్రపరిశోధకులకు నిరుపయోగములైనవి. కాని కొన్ని ముఖ్య పోర్చుగీసు గ్రంథము లాంగ్లములోనికి పరివర్తనము గావింపబడియున్నవి. ఇవి కృష్ణరాయచరిత్ర రచియింపదలపెట్టు వారికి కర ముపయుక్తములు అందు. ముఖ్యమైనవి నాలుగు. సంగ్రహముగ వాని నిచట జెప్పవలయును.

(౧) 'కామెంటరీస్ ఆఫ్ ది గ్రేట్ ఆఫాంసో అల్బూకర్కు'—ఇందు కృష్ణదేవరాయల రాజ్యారంభదశయందు విజయనగరసామ్రాజ్యమందును, బహమనీ రాజ్యమునను జరిగిన విషయములు వర్ణింపబడినవి. సమకాలికరచన యగుటచే దీని సాక్ష్య మత్యంతవిశ్వాసపాత్రమైనది. అర్వాచీనమహమ్మదీయ చరిత్రలయందు గానవచ్చు కృత్రిమములు కొన్ని దీనిమూలమున వెల్లడియగుచున్నవి. కృష్ణరాయల యుమ్మత్తూరు దండయాత్రనుగూర్చియు, బహమనీసుల్తానుతోడి యుద్ధమును గూర్చియు మఱి యెచ్చటను గానరాని యంశము లందు కలవు.

(౨) 'ఈస్టు ఆఫ్రికా అండ్ మలబార్'—ఇది దురాతీ బర్బోసా అను పోర్చుగీసుప్రయాణీకుడు వ్రాసినది. ఇతడు కృష్ణదేవరాయల రాజ్యారంభదశయందు దక్షిణహిందూదేశమునకు వచ్చి కర్ణాటసామ్రాజ్యమున సంచారము చేసెను. అతడు తా నచట గన్న విషయములను దన గ్రంథమున వర్ణించియున్నాడు. కృష్ణరాయలనుగూర్చి కాని, కర్ణాటకసామ్రాజ్యమునకు సంబంధించిన రాజకీయాంశములనుగాని యతడు ప్రస్తావింపకపోయినను కర్ణాటకసామ్రాజ్యప్రజల స్థితిగతులను, వారి యాచారవ్యవహారములను వర్ణించియున్నాడు. కావున కృష్ణరాయలనాటి విజయనగరచరిత్రను రచియించువారి కది మిక్కిలి యుపయుక్తమగు సాధారగ్రంథము.

(౩) 'క్రానికల్ ఆఫ్ డామింగోపయస్'—ఇతడును కృష్ణదేవరాయల రాజ్యకాలమున క్రీ. శ. ౧౫౨౨ ప్రాంతమున క్రిస్తవాఁ డి ఫిగ్వెరెడో యను పోర్చుగీసు రాయబారివెంట విజయనగరమునకు బోయి యచట కొద్దికాలము నివసించియుండెను. ఇతడు బారాస్ అను పోర్చుగీసుచరిత్రకారునికొఱకు విజయనగరమునుగూర్చియు, కృష్ణరాయలనుగూర్చియు ముఖ్యవిషయములను జెక్కింటిని తెలియబఱచియున్నాడు.

(౪) 'క్రానికల్ ఆఫ్ ఫెర్నావ్ న్యూనిజ్'—ఇతడు పోర్చుగీసుగుఱ్ఱపువర్తకుడు; కృష్ణదేవాచ్యుతదేవరాయలకాలమున గుఱ్ఱముల నమ్ముటకు పలుమారు విజయనగరమునకు వచ్చియుండెను. ఇతడును బారాస్ కొఱకే తన గ్రంథమును వ్రాసిపంపెను. పయస్, న్యూనిసులచే రచియింపబడిన గ్రంథములు రెండును క్రీ. శ. ౧౫౩౬ ప్రాంతమున బారాసుకు జేరియుండుటచే నివి రెండును సమకాలికరచన లనుట నిస్సంశయము. హిందూస్థాననివాసులగు హిందూమహమ్మదీయులయెడ సమానదృష్టి గల పాశ్చాత్యుల రచన లగుటచే నివి విశ్వాసపాత్రము లనుట యొప్పు. పయస్ గ్రంథముకంటె న్యూనిసుగ్రంథము గడు ముఖ్యమైనది. రాయరాజ్యస్థాపన మొదలుకొని యచ్యుతదేవరాయల రాజ్యకాలమువఱకు గల విజయనగరసామ్రాజ్య చరిత్ర యందు వర్ణింపబడియున్నది. కృష్ణరాయల విజయములును, నచ్యుతరాయల పాలనావిశేషములును విపులముగ వర్ణింపబడినవి. కావున పయస్ న్యూనిసుల గ్రంథములు రెండును కృష్ణరాయచరిత్రకు మూలాధారము లనుట యతిశయోక్తి కాజాలదు.

వంశానుచరితములు: ఈ తరగతిగ్రంథములలో లింగణ్ణకృత కెళదినృపవిజయ మొక్కటియే నిచట జేర్పదగినది. ఇది కన్నడచంపూకావ్యము. కెళది నాయకరాజుల మూలపురుషుడు చౌడప్పకృష్ణదేవరాయల నాయకులయం దొక్కడు; కృష్ణరాయలకు దురకలతో నైన యుద్ధములలో రాయల పక్షమున పోట్లాడెను. కెళదినృపవిజయమువలన గృష్ణరాయల కాలమున మలెనాడు దేశస్థితిగతులు దెలియవచ్చుచున్నవి.

గాథలు: కృష్ణరాయల రాజ్యాభిషేకమును గూర్చియు, మఱికొన్ని విశేషాంశములనుగూర్చియు నొక్క కథ లాంధ్రదేశమున బ్రచారమునం దున్నవి.

ఇందలి సత్యాసత్యములను నిర్ణయింపగల సాధనములు గానరావు; కాని గాథ లని వీని సాక్ష్యమును త్రోసి వేయరాదు; చిరకాలమునుండియు జనస్మరణయం దివి స్థిరమై నిలిచి యుండుటవలన వీనియందు కొంతయేనియు సత్య ముండవచ్చును. కావున జ్ఞాతచరిత్రాంశములకు విరుద్ధము గానియప్పుడు వీని సాక్ష్యము నంగీకరించుట తప్పగాదు.

చాటూక్తులు : విజయనగరచక్రవర్తులలో కృష్ణ రాయలకు సంబంధించినన్ని చాటూక్తులు మఱియెవ్వరినిగూర్చియు గానరావు. ఇం దనేకములు రాయల విద్యావ్యాసంగములను దెల్పునవి; రాయల విజయములను వర్ణించునవి పెక్కు గలవు. సాధారణముగ నిందు రాయల కళింగవిజయములును, మహమ్మదీయుల తోడి సమరములును ప్రశంసింపబడియున్నవి. ఇతర ఆధారగ్రంథములం దీ విజయములు విపులముగ వర్ణింపబడియుండుటవలన నివి యంత ముఖ్యములు గావు. కాని ఇతరఆధారగ్రంథాదులవలన తెలియరాని విజయములను వర్ణించు చాటువులు కొన్ని కలవు. కృష్ణరాయలు బెడదకోట (బీదరు)ను జయించినట్లే యాధారగ్రంథాదులయందు కానరాదు. కాని—

"సమరక్షోణిని కృష్ణరాయల భుజా
శాతాసిచే బడ్డ దు
ర్దమదోర్దండబెడందకోటయవన
వ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునన్ గాంచి శబా సహో హరిహరం
గాఖూబుఖోడాకి తే
తుముకీ బాయిలబాయిదేములికి యం
దు ర్కింటికిన్ బోవుచున్."

అను నల్లసాని పెద్దనార్యని చాటు వొక్కటి రాయల బీదరువిజయమును దెల్పుచున్నది. ఇట్టివి ముఖ్యమైనవి.

గ్రామకవిలెలు, కైఫీయతులు : పూర్వ మాంధ్ర దేశమున ప్రతిగ్రామమునకును కవిలె లుండెడివి. ఇందు గ్రామముల పూర్వవృత్తములు వర్ణింపబడియుండును. ఇట్టి కవిలెలందును, వీని నాధారపఱచుకొని తయారు సేయబడిన కైఫీయతులందును కృష్ణరాయల యేలుబడిని గూర్చి కొన్ని యంశములు వివరింపబడియున్నవి. కావున కృష్ణరాయల చరిత్రను రచించువారికి నివియు నుపయుక్తములు.

ఇంతవఱకు కృష్ణరాయల చరిత్రకు గల యాధారములను స్థూలముగ వివరించితిని. అన్నిటిని విపులముగ వర్ణించుటకు సాధ్యము గాదు; కాని రాబోవు ప్రకరణములయందు సందర్భానుసారముగ నన్ని యాధారముల నుదాహరించి వలసినట్లు పరిశీలించుచున్నాడను.



# ఆంధ్రవాఙ్మయ చరిత్ర

కర్త: కళాప్రపూర్ణ శ్రీ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు.

చరిత్రా త్రిపద్ధతిని, సంగ్రహరూపంలో నడిచిన సమగ్రసమీక్ష.
విద్యార్థులకు వాఙ్మయ చరిత్రకూ విశుద్ధదర్పణం.
పాతచరిత్రల నన్నిటినీ అవలోడనచేసి, సరిగా సమన్వయించి
క్రోడీకరించిన సిసలైన చరిత్ర.

శాసనాలలోనూ వాటిలోనూ అవ్యక్తస్వరూపంలో ఉండిఉండి, నన్నయ ధర్మమా అని ఒక్క తోపున దివ్యాకారంతో బైటపడి, నానాటికీ నవనవోజ్జ్వలంగా వికసించిన మన వాఙ్మయం పోయిన వలంపోకడలను పొడిమిలో చూపెట్టజాలిన ఉత్తమోత్తమగ్రంథము.

వెల 2 రూపాయలు. తపాలాఖర్చులు 0-6-0.

---

# తెలుగు మెఱుగులు

## గ్రంథకర్త: వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

తెలుగుదనము, తెలుగుసంప్రదాయాలు, తెలుగుభాష అవతరించిన విధము, తెలుగు తేటదనము, తెలుగు కవితా పారమ్యము, ప్రాచీన గ్రంథాల పలుకుబడికి మనపై చెల్లుబడి, విలక్షణమైన మన అరసున్న చరిత్ర, వింత వింత నిఘంటువులు, మన గ్రంథాలలో గ్రంథులు, అవీ ఇవీ, ఇంకా తెలుగులో ఉన్న ఎన్నో మెఱుగులను చూపెట్టుచున్న వ్యాసముల సంపుటి. శాస్త్రిగారి పాతిక ముప్ఫయి సంవత్సరాల సాహిత్య కృషి ఇందులో మూర్తీభవించియున్నది. ఆంధ్రాభిమానముగల వారందరు అవశ్యము చదువవలసిన గ్రంథము. ప్రతులకు త్వరపడవలెను.

వెల ౨ రూ. తపాలాఖర్చులు 8 అణాలు.

---

**ఆంధ్రగ్రంథమాల, పో. బా. 212, మద్రాసు**

# ఆంధ్రవాఙ్మయము: చరిత్ర

శ్రీ వేదము వెంకటరాయశాస్త్రి

ఆంధ్రవాఙ్మయమునకు చరిత్రగ్రంథములు మన పూర్వు లెవరును రచియింప లేదు. అందులకు కారణము వారికి ఆధునిక చారిత్రకదృష్టి లేక పోవుటయే. దేశకాలపాత్రానుసారముగా కవుల దృక్పథము మారుచుండును. జనుల యభిరుచులును అట్లే. ఈ చారిత్రకదృష్టి లేనందునను, కేవలము అలంకారికాది భావములే హృదయముల నాకర్షించి యుండినందునను మనవారు పూర్వకవుల విషయమై పెక్కు పొరపాటులను గావించిరి. చరిత్ర తెలియనందుననే రామరాజభూషణుడు—

"మహిమన్ వాగనుశాసనుండు సృజియిం
పన్ గుండలీంద్రుండు త
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీ
నాథుండు ప్రోవన్ మహా
మహులై సోముడు భాస్కరుండు వెలయిం
పన్ బెంపువాటించు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమున ద
త్ప్రాగల్భ్య మూహించెదన్"

అని రచియించినాడు. ఇందు అలంకారము కొఱకై కాలక్రమము త్యక్తము. సోముడు, భాస్కరుడు శ్రీనాథుని పూర్వులు; అందును భాస్కరుడు మంత్రిభాస్కరుడే యగుచో తిక్కనసోమయాజికి తాత. కాలక్రమమర్యాదను పాటింపక యుండుదేని ఈ పద్యము హృదయంగమము. కాక ఎఱిగి యుండియు మహాకవి యిట్లు కావలయు ననియే చమత్కరించి యుండును. తిక్కనయు, నన్నయయు సమకాలికు లైనట్లును, భారతపూరణమునకై తిక్కన తాంబూలమును నన్నయపద్యముపై నుమిసిన కథను మనవారు చెప్పుచుండిరి. నన్నయయు, అథర్వణుడును సమకాలికు లైనట్లును, వారు పరస్పరకీర్తులను ఓర్వ లేక ద్రోహ మొనరించుకొని రనియు కథలు కల్పించిరి. ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టీయమే యని యెన్నటినుండియు మనము తలచినవారమే గదా. తెనాలిరామలింగయ కృష్ణదేవరాయల సమకాలికుడు గాడనియు, రాయలవారికి స్వయముగా కావ్యముల నొసగినవారు పెద్దన తిమ్మన మల్లన లనియు, ఒకవేళ రామలింగడు వాడు బాలుడేమో ననియు గ్రహించితిమి. ధూర్జటి రాయలవారి యాస్థానియం దుండెనని వారి మనుమని కృష్ణరాయవిజయము సాక్ష్య మిచ్చుచున్నది. 'స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కిట్లు గల్గె నీ యతులిత మాధురీమహిమ నా విని పెద తాత చాల సన్నుతి గనె కృష్ణరాయల మనోజ్ఞ సభన్'. రామలింగయగాని, రామరాజభూషణుడు గాని కృష్ణరాయలవారికి తమ గ్రంథముల నంకిత మీయలేదు. అట్లే పింగళిసూరనయు. దీనినిబట్టి అష్టదిగ్గజములు రాయలవారి యాస్థానియందే యుండిరను పారంపరిని మనము నమ్ముట మానితిమి. వేములవాడ భీమకవిని శ్రీనాథుడు నన్నయకు పూర్వుని పఠించినను, అతడు నన్నయకు తర్వాతివాడేగాని పూర్వుడు గాడు. వీని నెల్ల చారిత్రప్రకాశమున చూడగా పెక్కు నూతనాంశములు వెలువడి భాషానిర్మాణవిషయమున నూతనాంశము లెన్నియో గోచరించుచున్నవి. చరిత్ర భాషకు అత్యంతావశ్యక మనియు, వాస్తవార్థబోధక మనియు, భాషావాఙ్మయపరిణామములను గ్రహించుటకు మార్గదర్శి యనియు గ్రహించితిమి.

మఱి యీ చరిత్ర మనకు సిద్ధముగా లేనందున దానిని నిర్మింపవలసిన యావశ్యకత యేర్పడి యున్నది. భాషాచరిత్ర వాఙ్మయచరిత్రములు దేశచరిత్రలో నంతర్భాగములు. దేశచరిత్ర చక్కగా గ్రహించితిమేని

మిగిలినవి సులువే. ఒకటి నెగ్గిన అన్నియు నెగ్గినవే. దేశచరిత్ర యన్ననో, అదియు పూర్వులు వ్రాసి యుంచనందున నిర్మింపవలసియే యున్నది. చరిత్రరచనకు తేదులు ముఖ్యము. వానిని శాసనములచేతనే గ్రహింపవలసి యున్నది. తేదులు అను పునాది మొదట కుదిరినయెడల తర్వాతి కట్టడము సులువే. ఈ తేదులుగల శాసనములవలన ఆయాశతాబ్దముల భాషాపరిణామమే గాక లిపిశాస్త్రదృష్టి కలుగుచున్నది. ఇందువలన తేదులులేని శాసనముల కాలనిర్ణయము కుదురుచున్నది. వీనికి తోడు వాస్తుశకలములు, కట్టడములు-ఆయా శతాబ్దములవి-నాటి తీరును, నాగరికతను తెలుపుముగదా. నాణెములు ఆర్థికాది పరిస్థితులను, రాజుల పేళ్లను తెలుపును. ఇట్లు కొంత మార్గము కుదిరిన వెనుక జనజీవనాది విషయములు వాఙ్మయముచే కుదురుటవలన చరిత్రరచనకు వాఙ్మయమును ముఖ్యాధారములలో నొకటిగా విద్వాంసులు గ్రహించినారు. సకలదేశములవారి యొక్కయు జాతీయత వారి వారి వాఙ్మయములలో ప్రతిబింబించుచుండును. దేశచరిత్ర యనునది ఒక దేశముయొక్క ఆర్థిక, రాజకీయ, మత, సాంఘిక, నైతికాది ప్రవర్తనముల కథనమే. "వాఙ్మయమును వీనిలో నేదే నొకదాని నైనను, లేక అన్నిటినైనను కొద్దిగనో గొప్పగనో తాకక యుండజాలదు. ఈ విషయమును గుర్తించియే వాఙ్మయచరిత్రకారులు దేశచరిత్రను, దేశచరిత్రకారులు వాఙ్మయచరిత్రను పఠించుట అవశ్యకమైనది. ఈ రెంటికిని అవినాభావసంబంధము. ఎఱిగిన విషయమును బట్టి ఎఱుగనిదానిని గ్రహించుటచే దేశచరిత్రముచే కొంత వాఙ్మయచరిత్రమును, వాఙ్మయచరిత్రచే కొంత దేశచరిత్రను విమర్శించుచు పోగా తుదకు చిక్కులు విడిపోయి రెండును మనకు వాని యథార్థస్థితియందు లభించును.

కావున ఈ వ్యాసము నంతయు రెండుగా భాగింప వచ్చును: (౧) దేశచరిత్రచే వాఙ్మయ చరిత్రము (౨) వాఙ్మయముచే దేశచరిత్రము.

(౧) ఇందులకై కాలనిర్ణయము ఎల్ల గ్రంథములకును అవశ్యకము. ఇందులకు మూడు మార్గములు—(అ) సమకాలికత, (ఆ) శాసన సంవాదము, (ఇ) భాషయు, శైలియు.

(౨) ఈ విధముగా కొంత కుదిరిననేగాని అనంతర చరిత్రరచన సాధ్యము కాదు. అట్లు కుదురగా వాఙ్మయముచే చరిత్రరచన మరల మూడు మార్గముల గ్రహింపవచ్చును. (అ) రాజుల చరిత్రములు, (ఆ) రాజులయు, తదితరులయు ప్రశస్తికొఱకై విరచితములైన కృత్యారంభ పీఠికాదులు, (ఇ) గ్రంథ మధ్యమునందలి వర్ణనాదికములు.

వీని నన్నిటిని సమన్వయించునది సూక్ష్మ విమర్శకదృష్టియు, భాషాంతర సంవాదమును.

## ౧. దేశచరిత్రచే వాఙ్మయచరిత్ర

(అ) ఆంధ్రవాఙ్మయమునందలి గ్రంథముల నన్నిటిని సేకరింపగా మనకు ఆయా కవుల నామధేయములును, వారి పోషకుల చరిత్రములును లభించుచున్నవి. వీనియం దెల్ల ఏదో యొక విధమైన వరుస పాటింపబడియే యున్నది. కవులు ప్రాస్తావికముగా తమ సమకాలికులలో కొందఱను గూర్చి వచించుట గలదు. అట్లే ముందు పోయిన ప్రసిద్ధులను గూడ. ఈ సమకాలికతను ఆంగ్ల పండితులు 'సింక్రానిజం' అందురు. ఒక్కొక్క గ్రంథమును పఠించి అందలి రాజుపేరు చేతనో, మంత్రిపేరుచేతనో సమకాలిక దేశాంతర పాలకులను గుర్తించి విషయ నిర్ధారణ మొనరించుట. ఉదాహరణము: తిక్కన నెల్లూరి మనుమసిద్ధి రాజునకు తాను కులక్రమాగతుడైన మంత్రి నని తెలిపి యున్నాడు. ఈతిక్కనయే అక్కన బయ్యనలనువారు తన రాజురాజ్యము నాక్రమింపగా కాకతీయ గణపతిదేవుని దర్శించి అతని సాయముచే మరల తన రాజును ప్రతిష్ఠించెనని సిద్ధేశ్వర చరిత్రము నుడువుచున్నది. కావున మనుమసిద్ధియు, గణపతియు సమకాలికు లగుదురు. తిక్కనకాలము నరయుదుమేని ఈ ఇరువురు రాజులయు శాసనములను శోధించిన నియ్యది తేలగలదు. తిక్కన నిర్వచనోత్తరరామాయణ భారత గ్రంథముల కాలము నిర్ణయింతుమేని మొదటిది కాకతి గణపతి దక్షిణ దిగ్విజయమునకు ముం దనియు, రెండవది

అనంతరము దేశమున శాంతి నెలకొనిన తర్వాత ననియు, పైగా ఒకవేళ మనుమసిద్ధి మరణానంతరమో యనియు తోచును.

నన్నయకు పోషకుడు రాజరాజనరేంద్రు డని ఆంధ్రభారతమందే స్పష్టము. రాజనరేంద్రుని చరిత్రను అన్వేషించుటచేత భారతరచనాకాలము కుదురుచున్నది. ఈ రాజు స్వతంత్రుడై తన బలపరాక్రమముచే శత్రుభయంకరుడై వేంగీ రాజ్యమును పాలించుచుండె నని చిరకాలమువఱకు తలంచుచుంటిమి. కాని చారిత్రక విమర్శచే పెక్కు నూతనాంశములు గోచరించినవి. వేంగీ చాళుక్యులలో నొకడగు దానార్ణవుడు క్రీ. శ. ౯౭౩ లో జటాచోడ భీమునితోడి యుద్ధమునందు మరణింపగా, రాజ్యము శత్రుహస్తగతము కాగా, వానిని కుమారులు శక్తివర్మ విమలాదిత్యులు కొంత కాలము తిరిగి తుదకు చోళరాజు నాశ్రయించి, తద్బాంధవ్యమున విమలాదిత్యు డందగా, మరల చోళసాహాయ్యమున తమ వేంగీరాజ్యమును సంపాదించుకొని రని చరిత్ర నుడువుచున్నది. విమలాదిత్యుడు రాజరాజ చోళుని కుమార్తెయగు కుందవాంబను వివాహమాడెను. క్రీ. శ. ౧౦౧౧ వఱకు శక్తివర్మ పాలించి చనగా విమలాదిత్యుడు రాజాయెను గాని మరల శత్రువుల బాధలకు లోనై కొంత కాలము చోళరాజుల యాస్థానియం దుండి ౧౦౧౮-౧౯ లో వేంగిని మరల పొంది ౧౦౨౨ వఱకు పాలించి గతించెను. రాజరాజ నరేంద్రుడు తన మేనమామయైన రాజేంద్రచోళుని కూతును వివాహమాడెను. ఈతనికి సవతితమ్ముడు విష్ణువర్ధన విజయాదిత్యుడు. ఈతని బాధచే వెంటనే రాజ్యమునకు రాలేక, మామసాయముచే ౧౦౨౨ లో పట్టాభిషిక్తు డాయెను. ఈతని తమ్ముడు పశ్చిమ చాళుక్యుల సాయమున ౧౦౩౧ లోను, ౧౦౪౨, ౧౦౪౪ ప్రాంతములలోను, మూడు పర్యాయములు తఱుముగా తంజావూరు పాఱిపోయి ౧౦౫౦ లో మరల రాజ్యము సంపాదించుకొని ౧౦౬౧ వఱకు నిరంకుశముగా పాలించెను. ౧౦౫౦-౬౧ వఱకు నాతనికి విశ్రాంతియు, నన్నయ నారాయణభట్టు లిరువురును మాతనముగా రాజు నిర్మించుకొనిన రాజమహేంద్రపురమున నుండుటయు ఘటిల్లినది. పైగా నన్నయ ౧౦౫౪ వఱకు నరేంద్రుని శాసనములను రచియించి నందువలనను, ఈతని భారతము అసంపూర్ణ మగుటచేతను, ఈతడే రాజుకన్న ముందు గతించియుండు నని యూహించుటకు ఎడము కలుగుచున్నది. ఈకాలమున నీతడు 'తన కిష్టుడుఁ సహాధ్యాయుడు నైన' నారాయణభట్టు సాయముచే భారతాంధ్రీకరణమునకు గడంగి యుండును. ఈతని మృతిచే తద్రచన నిలిచిపోయి యుండును. ఈవిషయ మంతయు ఆంధ్రద్రావిడకర్ణాటకశాసనములను పఠించి సమన్వయించుటచే నేర్పడినది. శాసనములచే సమకాలీనత దృఢపడి గ్రంథరచనాకాలము కుదిరినది.

ఈవిధముగా వాఙ్మయమున కంతకును నిర్మించుచు వచ్చిన లెక్కలేని నూతనాంశములు వెలువడగలవు.

## ఆంధ్ర వాఙ్మయప్రారంభ కాలము

(అ) ఆంధ్రకవనమును వాగనుశాసనుడు సృజించలేదని మన విమర్శకదృష్టికి తెలియుచున్నది. అగ్నికుండమునుండి భగవంతుడు ప్రాదుర్భవించినట్లు సర్వాంగసుందరమగు కవిత నన్నయభట్టారకుని వదనమునుండి వెలువడియుండజాలదు. ఆయన అపాటి కవితాశక్తిని అలవరుచుకొనుటకు తగిన ఆకరములు నాడు నుండియుండవలయును. వీశక్తియైనను పరిణామము నొందక ప్రకాశింపదు గదా. మఱి ఎప్పటినుండి ఆంధ్రవాఙ్మయము ప్రారంభమైనదను ప్రశ్నకు సమాధానము కుదురకున్నది. ఆంధ్రుల చరిత్రను చూడవలసినదే. శాసనములను చూడగా కవిత్వదృష్టి ఆంధ్రులకు క్రీ. శ. ఏ డెనిమిది శతాబ్దముల కాలమునుండియు చక్కగా నున్నట్లు కనబడుచున్నది. యుద్ధమల్లుని బెజవాడ శాసనమునందే అక్కరలున్న వనగా నాంధ్రఛందస్సు అంతకు చాలకాలమునకు పూర్వమే ప్రారంభమై యుండవలయును గదా. నన్నెచోడకవీంద్రుడు తన కుమారసంభవమున,

"మును మార్గకవిత లోకం
బున వెలయఁ దేశకవిత బుట్టించి తెనుం

గు నిలిపి రంధ్రవిషయమున
జన సత్యాశ్రయుని గొట్టి చాళుక్యనృపుల్."

అని చెప్పినదానియర్థము రాజరాజనరేంద్రుడు నన్నయచే భారతము నాంధ్రీకరించినదే యని తలచుచుంటిమి. కాని దానియర్థము అది కాదనియు, 'చాళుక్యనృపుల్' అనుమాటకు రాజనరేంద్రుని పూర్వులర్థమనియు గుణగవిజయాదిత్యుని శాసనమునందే తెనుగు ఛందస్సు కనబడుటచే, అతడేనియు నాతని పూర్వులేనియు కావలయు ననియు తలంచుచున్నారము. కావున నన్నయకు పూర్వ మాంధ్రవాఙ్మయ పరిస్థితి శాసనములచేత తప్ప వేఱువిధమున తెలియ వసతిలేదు.

(ఇ) భాషను బట్టియు, శైలిని బట్టియు నన్నెచోడుడు నన్నయకు పూర్వుడని పండితు లుపపాదించినారు. శాసనాదిక ములర్థలనను, ఇతర విమర్శలవలనను అతడంత ప్రాచీనుడు కాజాలడనియు, నన్నయ కర్వాచీనుండను నభిప్రాయము పండితులలో పెక్కురకు నేడుకలదు. ఈ విషయము కేవల చరిత్రచేత గాని, వాఙ్మయముచేత గాని కుదురక ఉభయాధారపరీక్షలను చేత కుదురుచున్నది.

మఱి నన్నయభట్టు ఆదికవి యనుట కర్థమేమి? ఈ మహనీయుడు తన ప్రతిభచే తెనుగుకవిత కొక నూత్నశోభను కూర్చినాడు. తత్పూర్వ ముండిన వాఙ్మయము సహజమై యుండినయెడల కాలగతికి ఎదురీదియుండెడా? ఆంధ్ర ఛందమునకును, సంస్కృతమునకును అప్పటివఱకు ఏర్పడి యుండిన సంబంధమును కుదురుపఱచి కావ్య విద్యకు వైశిష్ట్యమును నన్నయ యొసగినాడు. అంతటి యుద్గ్రంథము అంతవఱకు ఆంధ్రమున లేనందువలను, పైగా అప్పకవి ప్రకారము, ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతంబులో 'నేది వచింపగా బడియె నెందును దానిన కాని సూత్రసంపాదన లేమిచే తెలుగుపలుకు మఱొక్కటిగూర్చి చెప్పగా రాదని బ్రాతువాటి కవిరాక్షసుడు' నియమము చేసి యుండినందువలనను, తర్వాత 'ఆ మూడు పర్వములలో సామాన్యుడు నడుపు తెలుగు లరసికొని కృతుల్' 'తిక్కసుధీమణి మొదలైన తొంటి తెలుగుకవీంద్రుల్' 'తాము రచించి' యుండుటచేతను, నన్నయ విపులశబ్దశాసనుడును, సకలభాషావాగనుశాసనుడును. పైనందున, పాణినీయవ్యాకరణమువలన పూర్వవ్యాకరణములు మూలబడినట్లే నన్నయకవిత ఇతరములను అణచివైచి ప్రకాశించినది. ఆయనమార్గమునే తిక్కనాదులు పైతము అనుకరించుటచే దానికి ప్రాశస్త్యము వచ్చినది.

నన్నయకు తర్వాత నాంధ్ర వాఙ్మయము నూతనోత్సాహముతో నడచినది. ధారతెలంగినిత్యపరితర్పితరాజరసజ్ఞులైన కవులు వెలసిరి. తిక్కన సోమయాజి తాతయైన భాస్కరుడు రామాయణమును ఆంధ్రీకరించెను. (ఇందు ఇతరు లీతనికి సాయపడిరి. ఈ గ్రంథకర్తృత్వమొక సమస్య.) తిక్కన సోమయాజి కాలమున కావ్యకన్య నవనవలాడ సాగినది. ఈ కాలపు చరిత్రము చక్కగ తెలియనందుననే తర్వాతివారు తిక్కనయు నన్నయయు సమకాలికు లనియు, నన్నయ గతించిన తర్వాత రాజనరేంద్రుడు భారతాంధ్రీకరణమునకు కమ్మ నొకదానిని నానారాజ సభాంతరముల కంపగా తిక్కన దానిపై 'తమ్ములపునోటితో' నుమిసెననియు నేవేవో కథలు చెప్పచుండిరి. చరిత్ర తెలియగానే ఇట్టివి అసంభవమనియు, ఈ ఇరువురకును దాదాపు రెండువందల సంవత్సరముల యంతరము కల దనియు ఎఱుకపడినది.

ఆధునిక వాఙ్మయ విమర్శచే తెలియవచ్చిన గొప్ప విషయ మేమనగా ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టీయము కాదని. అప్పకవీయమందలి కథ యంతయు పుక్కిటి పురాణ మనియు, సారంగధరుడు చారిత్రక పురుషుడు కాడనియు, చింతామణియందలి సూత్రములకును నన్నయ ప్రయోగములకును సంబంధము లేదనియు తేలినది.

ఈవిధముగా చరిత్రాంశములచేత ఆంధ్రవాఙ్మయమునందలి కవులను, వారి గ్రంథములను, రాజులను స్మరించి, కావ్యవ్యాకరణాలంకార గ్రంథముల పౌర్వాపర్యమును నిర్ణయించుటచేత భాషాపరిణామమును, పూర్వకవుల సాంప్రదాయములును మనకు చక్కగా తెలియగలవు.

## ౨. వాఙ్మయముచే చరిత్రరచన

చారిత్రక పీఠామస్యగత వాఙ్మయముచేత చరిత్రకు మఱియు హెచ్చయిన పుష్టి కలదు. చిత్రరచనకు తోరణీగీతలవంటివి వాఙ్మయమునకు కాలానుక్రమణిక. ఆయా కాలములలో నాయా కవులు తమ కావ్యములలో అవశ్యముగా చరిత్రాంశములను పెక్కింటిని ఉదాహరించి యున్నారు. ఇట్టి కావ్యాంతర్గత చారిత్రక విషయములను (అ) రాజుల సాక్షాత్తుచరిత్రమనియు, (ఆ) ఆయాకవుల పోషకులైన రాజులయు మంత్రులయు వంశానుక్రమణికాదులుగల పీఠికలు ఆశ్వాసాంత, షష్ఠ్యంతాది పద్యములనియు, (ఇ) కావ్యవశమున చేయు ఉపమానాది వర్ణన లనియు విభజించితిమి గదా. అందు :—

(అ) రాజుల సాక్షాత్తు చరిత్రము.

ఆంధ్రవాఙ్మయమున చరిత్ర కుపకరించు రాజచరిత్రములు కొలదియే గలవు. ప్రతాపచరిత్రమను నామాంతరముగల సిద్ధేశ్వరచరిత్ర మను గ్రంథము కాసె సర్వప్ప యను శైవకవిచే రచియింపబడినది. ఈ కవి కాలము తెలియదు గాని కొన్ని చారిత్రక విషయము లిందు గలవు. అక్కన బయ్యన లనువారు, మనుమసిద్ధి దాయాదులు అతనిని శాఅద్రోలి రాజ్యము నాక్రమింపగా తిక్కన కాకతీయగణపతిచక్రవర్తిని దర్శించి భారతాఖ్యానమును వినిపించి మర్యాద లంది అతని సాయముచే శత్రులను తఱిమి తన రాజునకు మరల రాజ్య మిప్పించిన కథ ఇందు గలదు. కొంత వ్యత్యాసము లున్నను చరిత్రయు కలదు. కాటమరాజు కథలో మనుమసిద్ధికాటమరాజుల యుద్ధములు వర్ణింపబడియున్నవి. మనుమసిద్ధిమంత్రియు, మహాసేనానియు, తిక్కనసోమయాజి పెదతండ్రికొమారుడు నైన ఖడ్గతిక్కనచరిత్రము ఇందు వర్ణింపబడియున్నది. ఈతని చరిత్రకు సంబంధించిన చాటువులు పెక్కులు దొరకినవి. ఇతరకవులును ఈ తిక్కన మంత్రిని పొగడియున్నారు. మంచన కేయూరబాహుచరిత్రమందు కొమ్మనామాత్యుని పరాక్రమములువర్ణించియున్నాడు. నాయకురాలి చరిత్రము ఆంధ్రదేశమందు సుప్రసిద్ధము. ఆ తర్వాత శ్రీ కృష్ణదేవరాయల చరిత్రము పద్యకావ్యముగా కుమారధూర్జటి చేతను, వచనముగా విశ్వనాథనాయని స్థానాధిపతిచేతను రచితమైయున్నది. తర్వాతి కాలమున వచనమునందుకూడ రాజుల చరిత్రములు, తంజావూరి యాంధ్రరాజుల చరిత్రములవంటివి రచియింపబడియున్నవి. మనవారే సంస్కృతమందును చారిత్రకపురుషుల కథలను వ్రాసిరి. అచ్యుతరాయాభ్యుదయము, వేమభూపాలచరిత్రము, రఘునాథాభ్యుదయము మొదలైనవి.

(ఆ) ఆంధ్రకావ్యములకు గ్రంథారంభమందలి పీఠిక లొక విశిష్టతను గూర్చినవి. నన్నయ తిక్కనల నుండియు నీ సంప్రదాయము అభివృద్ధియైనది. నన్నయ రాజరాజనరేంద్రుని స్తుతించెనేగాని యాతని చరిత్రను భారతమున పీఠికగా రచియింపలేదు. తిక్కన మనుమసిద్ధి చరిత్రమును కొంతకొంత వ్రాసెను. నన్నయ కాలమున పీఠికారచన ఇంకను ప్రారంభము కాలేదు. నిర్వచనోత్తరరామాయణమునందలి తిక్కనపీఠిక చక్కగా తయారైనది. ఈ భావమును కవులు బహుశః నాటి శాసనవాఙ్మయమునుండి గ్రహించియుందురు. నాటి శాసనాదికములలో కవులు రాజుల దాన విషయమును చెప్పుటకుముందు ఇష్టదేవతాభివందన మొనరించి రాజవంశావళిని వర్ణించి పాలకుని స్తుతించి అతని విజయములను లెక్కించి తర్వాత ప్రతిగ్రహీతను నిర్దేశించి తుదకు దానవిషయమును చెప్పుట ఆచారమైయుండెను. ఈ సంప్రదాయము నాటి కన్నడశాసనములలో సర్వాంగసుందరముగా కన్పడుచున్నది. తిక్కనకు నాలుగైదువందల సంవత్సరములకు ముందుండియు కన్నడకవులు తమ కావ్యపీఠికలలో రాజుల వంశావళులను వ్రాసినారు. ఆ వంశావళులనే శాసనములలో చెక్కించినారు. పొన్న, పంప, రన్న మహాకవుల కాలమున నీ పద్ధతి సంపూర్ణత నందెను. ఏ కారణముచేతనో ఆంధ్రకవులు పీఠికలను తిక్కనవఱకు తల పెట్టినవారు కారు. తిక్కనతర్వాత పీఠిక లభివృద్ధి నందినవి.

తిక్కన నిర్వచనోత్తరరామాయణమున మనుమసిద్ధివంశమును తన 'కృతికి నాదకు గా', 'గాథస్వీకృతి

దగ గీర్తనంబు సేయుము సెలవిమ్మా' అని ప్రారంభించి, మొదట విష్ణువును, తర్వాత క్రమముగా బ్రహ్మను, కశ్యపుని, సూర్యుని, మనువును, ఇక్ష్వాకువును, అతని కులమున రఘువును, అతని వంశమున రాముని, పిదప కరికాలచోళుని చెప్పి, పౌరాణికక్రమమును వదలి చరిత్రకు దిగినాడు. కరికాలచోళుడు చారిత్రకపురుషుడే. ఇందులకు బలమైన సాక్ష్యమే కలదు. ఈతడు రాజుల కేలూత లంది 'కాశీసింధుతోయంబుల'యందు మజ్జన మొనరించె ననియు, పల్లవోర్వీశుని ఫాలలోచనమును ఉల్లాసముతో ఉంగుటంబున హరించె ననియు, కావేరికి ఆనకట్ట కట్టె ననియు వర్ణించినాడు. ఈ విషయములన్నియు చాలవరకు చారిత్రకములే యని తమిళగ్రంథములచేతను, శాసనములచేతను ఋజువగుచున్నవి. కరికాలచోళుని తర్వాతి రాజులలో పెక్కురను తెలియనందుచేత గాబోలు వదలి, బిజ్జనను తిక్కన వర్ణించినాడు. ఈ బిజ్జనను గూర్చి ఎక్కువ పరిశోధన ఇంకను జరుగవలసియున్నను ఈతడు పశ్చిమచాళుక్య చక్రవర్తియగు మొదటిసోమేశ్వరుని కాలమునందుండినాడని చెప్పుట కాధారములు కనబడుచున్నవి. చోళశాసనములు ఈతడు తెలుంగువిచ్చయన్ అని స్పష్టముగా నుడువుచున్నవి. ఈతని మనుమడో మునిమనుమడో తెలియదుగాని, ఇతని వంశమున మనుమసిద్ధి జనించెను. మనుమసిద్ధి సుతుడు చోళతిక్కరాజు. ఇచ్చటినుండి వివరముగా ఈతనియొక్కయు, నీతని కుమారుడును, కృతినాయకుడును నైన మనుమసిద్ధిరాజుయొక్కయు ఘనకార్యములను ఉగ్గడించినాడు. ఈ పద్యములన్నియు చరిత్రకు అత్యంతోపయుక్తములు. ఈ వరుసను ఆంధ్రప్రబంధములలో చరిత్రకు ఉపయోగపడని పీఠికలే లేవు. తిక్కనతర్వాత ఎఱ్ఱాప్రగడ, శ్రీనాథుడు, అలసానిపెద్దన, ముక్కుతిమ్మన, ధూర్జటి, రామరాజభూషణుడు, తెనాలి రామలింగయ, చేమకూర వేంకటరాజు మొదలైన మహాకవీశ్వరులు ఎల్లరు తమ గ్రంథముల పీఠికలయందు తమ పోషకులైన ప్రభువులను విశేషముగా కొనియాడి యున్నారు. వారి వంశావళులను రచించియున్నారు. ఈ కవులు ఒక్కొక్క యాశ్వాసప్రారంభమందును, (తమ పోషకులను సంబోధించు సమయమున) ఆశ్వాసాంతమునను ఆట్లే వారిని స్తుతించియున్నారు. కావ్యప్రారంభమునకు ముందు కొన్ని కందపద్యములలో కవి పోషకుని స్తుతించుట సంప్రదాయమై యున్నది. ఈ షష్ఠ్యంతములయందల్ల చారిత్రక విషయములు మిళితములై యున్నవి. ఉదా: 'చెంచిమల చూరకారున కంచితకరుణా తరంగితాపాంగున కున్' ఇందలి మొదటిపంక్తి చారిత్రకము.

(ఇ) కావ్యవశమున చేయువర్ణనలు, ఉపమాదికములు, ఋతుయాత్రోత్సవాదుల వర్ణనలు, వేదాంతచర్చలు చరిత్రరచనకు ఉపయోగపడుచున్నవి. ఆంధ్రకవులు, అందును ముఖ్యముగా ప్రబంధకవులు సమకాలికవిషయములను చేర్చి కావ్యములు రచియించిరి. కథ పాత్రలైనను అప్రయత్నముగా సమకాలిక సాంఘికపరిస్థితులు వీనియందు కనబడుచున్నవి. చరిత్రకత్యంతోపయుక్తములగు ఆయాకాలపు జనజీవనము, సంఘపరిస్థితి, జనుల వేషభాషలు, సుఖదుఃఖములు, కృషివ్యాపారములు, వినోదాదికములు మొదలైన పెక్కు విషయములు వాఙ్మయమునుండియే గ్రహింపవలయును. కాని కావ్యములనుండి వీనిని లాగుట సులువైన పని గాదు. ఏలయన, చరిత్రకు పనికిరాని విషయములతో నివి మిళితములై యున్నవి. కావ్యములను జల్లెడపట్టి వానినుండి చరిత్రాంశములను వేఱుచేయుటకు తగిన జల్లెడయే విమర్శజ్ఞానము. అందులకు నేర్పును వలయును. ఉదాహరణములు :

శ్రీకృష్ణదేవరాయడు ఆముక్తమాల్యదలో కలుబరిగి సాగరపట్టణముల సమీపమున తనతోడి యుద్ధమందు మృతిజెందిన తురకలను ఇట్లు వర్ణించియున్నాడు. తురుష్కులు రాయల కత్తిదెబ్బలకు మృతిజెంది, స్వర్గమునకు బోయిరి. అచ్చట దేవవృక్షములయొక్క కల్లు త్రాగి ఒడలు తెలియక దేవేంద్రపట్టణమగు అమరావతిలో రచ్చచేయుచు, వీథులవెంట తిరుగుచు, సనకాదిమునీశ్వరుల గోపీచందనములను నాకి నాకి, హాహా హూహూవుల చేతి వీణలను లాగి వింటివలె వంచి తంత్రులను త్రెంపి పాడుచేయుచు, సప్తఋషులు ఇసుకలో


TELUGU ACADEMY



## ఉబ్బసము నివారించును

### శ్వాసహరినే వాడండి తప్పక

అయిదు నిముషాలలో - తక్శాంతి, ఒక రాత్రిలో - నివారణ అని చెప్పడం కేవలం మాయమాటలు.

ఉబ్బసము, ఊపిరితిత్తుల వ్యాధులకు సరియైన చికిత్సగా పురోహిత్ శ్వాస - హరినే డాక్టర్లు వాడెదరు. హాయిగా నిద్రపట్టును, సుఖంగా భోజనం చేయవచ్చు. చక్కగా జీర్ణం అవుతుంది. క్రమ క్రమంగా ఆరోగ్యం చేకూరుతుంది. ఊపిరితిత్తులు బలపడుతవి. ఉబ్బసం శాశ్వతంగ నివారణమగును.

మంచి కెమిస్టు లందరివద్ద 3. ఔ. 6. ఔ, 12. ఔ. ల సీసాలలో రు. 3/8, రు. 6/-. 10/- లకు దొరకును. లేదా దిగువవారికి వ్రాయుడు.

**Dr. PUROHIT PHARMACY,**
Kolhapur, S. M. C.

మద్రాసు స్టాకిస్టులు :
మెసర్సు దాదా అండ్ కో, కెమిస్టులు,
నైనియప్ప-నాయకర్ వీధి.

**ఉబ్బసాన్ని పోగొట్టేందుకు డాక్టర్ల మంచి మందు శ్వాసహరి**



**పురోహిత్ శ్వాసహారి**

DR. PUROHIT PHARMACY, KOLHAPUR



## కాశ్మీర్

అన్ని విధములగు దగ్గులు, ఉబ్బసము, ఆయాసము మొదలగు శ్లేష్మవ్యాధులకు అమోఘమైనది. సీసా రు.1-12-0. అన్ని మందుల షాపులలో అమ్మబడును.

**గిరిజా అండ్ కో,**
దానవాయిపేట, రాజమండ్రి.
మద్రాసుస్టాకిస్టులు: జె. శాలాభాయి & కో,
చైనాబజార్ రోడ్.

లోకప్రసిద్ధిపొందిన

## పి. వి. రాజన్ అండ్ కంపెనివారి




### శ్రేష్ఠమైన మదరాసు నశ్యం

### R. S. సుగంధ ముక్కుపొడి.

అన్నిటిలో సాటిలేనిది.
ధర వివరములకు వ్రాయుడు.
తయారుచేయువారు :—

**పి. వి. రాజన్ & కంపెని,**
అరక్కోణం, Arkonam, N. A. Dt.

లింగములు చేసి పూజచేయుచుండగా వానిని తమ ముచ్చెలకాళ్లతో రాచియు, రంభ మొదలగు నప్సర స్త్రీలు కనబడగా వారిని అవమానపరచియు అల్లరి చేయుచుండిరట. ఇదంతయు తురుష్కులు ఆ కాలమున ఈ లోకమునందే ప్రత్యక్షముగా చేయుచుండిన దురంతములే.

ఇట్టి రచనల ననుకరించియే గావలయు నవరము చిననారాయణ నాయకుడు కువలయాశ్వచరిత్రమున నిట్లు వర్ణించియున్నాడు:

"నలువు గస్తురి గీలుజామంబు దునిచి యే
    తెంచిన గాని పంధించమనుచు,
నిడుద ముత్తెపుటొంట్లు పదలించుకొని చెవు
    ల్వ్రావడై చినగాని చూడమనుచు,
గమనీయమణికిరీటము డించి పైజాణి
    పాగ చుట్టినగాని పలకమనుచు,
దంభోళి విడిచి క్రొందడుకు వింగిణీవిండ్లు
    చేకొన్నగాని హర్షించమనుచు,
జిష్ణుతో మాటలాడ హేజీబు ననుచు
రార, తిప్పనృపాల బాహాసినిహతు
లైన యల హిందు ఖానసేనాధిపతులు,
నిండి సురపట్టణము చెంత దండు విడిసి."

"తిప్పనరపాలకరవాలకీర్ణ గయన
ముష్టిహతి రంభ నెసని సమ్ముఖము జేయ
తనయు గని రాజరాజు సంతసము జెందు,
దురక ప్రద్దును బనికి వచ్చెర యటంచు."

తిప్పనరపాలుని కొమారుడు తిమ్మనిగూర్చి—

"చనవు తా నని వచ్చినను లేన కల మంజు
    ఘోష పొచేళ్ళద్ది గొట్టుపడిరె;
గొనగోట లెక్కలి జెనకి ఘృతాచికా
    దేవి దేశీయంపు దిట్టుపడిరె;
బుక్కిటి విడెం విూయబోయి తిలోత్తమా
    వనజలోచన ముచ్చెవాట్లు పడిరె;
కొలయుల్క జొబుకు జాపుల జాచి యూర్వశి
    బిబ్బోకవతి చావువేట్లుపడిరె;
తిమ్మనరపాలు చికిలి కోదుమ్మిదారి,
బలిమి దెగటారి సురపురప్రాంగణమున
వరలెడు కటారిరాహుత్త వరులచేత,
గీడు చేయదె మడియలతోడి చెలిమి."

ఈ వర్ణనలు చమత్కారమాత్రము లనియు, నిరుపయోగము లనియు చరిత్రకారుడు తలపరాదు. ఇవి స్వర్గమునందలి సంభవములును గావు. ఈ లోకముననే తురుష్కులు చేయుచుండిన పనియే వర్ణింపబడియున్నది. శ్రీనాథుడు కాశీఖండమున వింధ్యసానువుల నడుమ జిక్కిన సూర్యుని వర్ణించిన విధము:

"మార్తాండుడు కొండప్రక్కం జిక్కి కదలిమొగ యక్కలిం దగులువడిన జోగునంబోలె పెదురు వడవ మఱలం బిలుంలేక చీకాకుపడియున్నవాడు"-ఇట సముద్రమున తుపానులోని యలల నడుమం జిక్కిన పడవవలె సూర్యుడు వింధ్యపర్వతముయొక్క శిఖరములలో తగుల్కొని ఎటుపోవుటకును తెలియక యున్నాడనుటచేత కవి నాటి నౌకాయాత్రలను గూర్చిన యనుభవమును వర్ణించుట విశదము.

రామరాజభూషణుడును—

"నునుగ్రంపుటపంక్తి విప్పపారయ
    జ్జోకెక్కు మాధ్వీమహో
వనధిం బుప్పొకి దీవికి న్మగుకర
    వ్యాపార లేలేర ద
ద్ఘనకర్పూరపటంబులం గొని చే
    డ్కెంగోరకవ్యూహమో
హనముక్తావళి దాగ్చి నీ తరగుగా
    ద్విజాక్షి వీక్షించితే?"

అని వర్ణించినాడు. 'సన్నని కర్పూరపరటి విచ్చు పార యనెడు దోనెపైనెక్కి, మకరందరసమనెడు గొప్పసముద్రమందు పుష్పాడితిప్ప యనెడు ద్వీపమునకు తుమ్మెద లనెడు వేరగాండ్రు రాగా, వారి కర్పూరము లనెడి వస్త్రములను దీసికొని ఈ తరగరివాయువు వేడుకగా మొగల సమూహ మనెడు మనోహరములైన ముత్తియములను బదులిచ్చెను.'

ఈ వర్ణనలు ౧౫, ౧౬ శతాబ్దములలోని యాంధ్రవాణిజ్యవిషయముల సాక్షాత్కరించుచున్నవి.

నాడు మన వర్తకులు మహాసముద్రములను దాటి, తాము కొనిపోయిన వస్త్రాదికములకు బదులు రత్నములను తెచ్చుచుండిరని తెలియుచున్నది. ఈ ప్రయాణములు సామాన్యముగా నిరపాయములు గావనియు, తుపానులు మొదలైనవానిచే ఓడలు పగులుట మున్నగు బాధలుండెడివనియు తెల్లము. పైగా నీ జోంకశబ్దముచే విదేశవాణిజ్యమును మనవారు చాలతీవ్రముగ జరుపుచుండిరని తెలియుచున్నది. ఏలన, జావా, మలయా భాషలలో 'జాంగ్, అజాంగ్' అనగా పెద్దయోడ యని యర్థము. అదే ఆంగ్లమున 'జంక్' ఐనది. ఈశబ్దమును మనవారు వైదేశికులతోడి వ్యాపారమున గ్రహించిరి.

ముక్కుతిమ్మనయు—

"పారంగాక్షుల చూపు చొజ్జగతుల·
జగ్గొంపల నొక్కహారు
ర్యావర్తముల నుక్కనింగి దరి జే
రత్నాకరముప్పొంగు సం
సారాంభోనిధి సత్క్రియాతరణి ని
శ్శంకన్ననుత్తీర్ణుడై
చేరున్నజ్ఞరవాలికుండు మదిరా
క్షీ, యీ పురద్వీపమున్."

అని సముద్రమందలి చొజ్జలను, కొండలను, సుడులను వర్ణించినాడు.

కావ్యములయందలి యష్టాదశవర్ణనలలోను తర్వాతి ప్రబంధములయందలి ఇరువదిరెండు వర్ణనలయందును ఋతువర్ణనలును, సూర్యచంద్రుల వర్ణనలు అనతిక్రమణీయములైనవి. ఆముక్తమాల్యదలో (౨-౬౮)

"తారుణ్యాతిగ చూతసూక్ష్మఫలము
న్నైలాఘుమారస్వన
ద్ధారాధూపితపువ్వుదంబుహ్యాత మా
త్స్నాచ్ఛేదపాకోద్గతో
ద్గారంపుం గనరార్చు భోగులకు సం
ధ్యావేళలం గోళికాం
తారాభ్యంతరవాలుకాస్థిత హిమాం
తర్నారికేళాంబువుల్."

"ఆ వేసవియందు భోగులు మధ్యాహ్నమున దోరమామిడికాయల ముక్కలతో చుయ్యని శబ్దాయమానమైన నూనెపోత తాలింపు వైచి నీటికిడి యుసురగానే తీసిన చేపబ్రద్దల యుసురుతో భుజించిరి. సాయంకాలమున ఆ భోజనము జీర్ణమగునప్పుడు ఆ చేపబ్రద్ద కనరుత్రేన్పులు వచ్చుచుండినవి. అవి చలువకొల్పుటకై యిసుకలో పెట్టియుండి అప్పుడు పగిల్చిన టెంకాయలలోని చల్లని నీళ్లను త్రాగుటచేత శాంతించినవి." ఇందు స్వభావోక్తి. రాయలనాటి ద్విజేతరుల భోజనసౌష్ఠవము వర్ణింపబడినది. అందే—

"తోట బగలుండి, మల్లెలు దురిమి, కావు
లమర మాపైన నిక్షుయంత్రముల కొయ్య
జేరు ప్రజ వొల్చె భావివృష్టికిని గ్రుడ్డు
తో మధురిమేచ్ఛ జీరు చెఱ్ఱచీము లనగ." (౨-౬౦)

—"పగలంతయు చలువకై తోటలోనే కడపి మల్లెలు శిరంబులం దాల్చి కావిళ్ళులతో చెఱకుగానుగలకడకు వరుసగా చేరు జనులు, రాబోవు వానకు సూచకముగా గ్రుడ్డు మోయుచు మాధుర్యకాంక్షచేత ఆ గానుగలకడకుం జేరుచున్న యెఱ్ఱచీము లనునట్లు ఒప్పిరి." ఇందు జనజీవన ముత్ప్రేక్షింపబడినది.

వర్షాకాలమును రాయలే ఇట్లు వర్ణించియున్నాడు:

"రవి జాచి కుడుచువారలకును గృకలాస
ములకును దృష్టి మిన్నులనె నిలిచె;
సంధ్యార్ఘ్యదాయి ద్విజశ్రేణి కిలుసేరు
మొదవులకును భ్రాంతి మదిజనించె;
హాలకీవిసందోహములకు బలాకికా
విసరంబులకు మంచి పెదలు దొరకె;
నెలమి బొల్పగు యాజ్ఞికులకు సంతల కూట
ములకును మఱి బిచ్చ మొగ్గలోదవె;
నతిథిసంఘంబునకు నీనినట్టియెనుప
కదుపు లేగల గుమికి వాకట్టు లెసగె;
మట్టిమిద్దెలవారికి మరుపనులకు
నెలతబాసినవారికి నిదుర చెడియె."

(ఆముక్త ౪-౧౨౩)

"రయమున పృష్ఠికై యొదిగి
రవ్వలపై విధియింతు రుగ్రతన్
హయపతిపైన దంతిపతి
నాతనిపై నృపతిం గజాది ని
ర్ణయముల మెత్తురాడుదురు
భ్రమభ్యోక యింతయు విప్పవిచ్చ మె
గ్గయి మఱి పాఱిపోదురు స
మస్తదిశాగతులైన యన్యగుల్."
(ఆ. ౪-౧౩౧)

"గురుగుంజెం చలిదమ్మి లేదగిలి సా
కుం జింత్రిణీపల్లవో
త్కరముంగూడ బొరంటి నూనియలతో
గట్టావికట్టారు గో
గిరము తెక్కి, తిమిం బసు ల్పాలను వో
గ్రేవు లెత్తయి న్నాక, మే
కెరువుం గుంపటి మంచ మెక్కి ప్రభు
త్త్వైకాప్తి గన్లజ్జడిన్." (ఆ. ౪-౧౩౪)

వీనియందెల్ల జనుల నిత్యజీవనము—సమకాలికము వర్ణితము. ఎఱ్ఱన లక్ష్మీనృసింహపురాణమున నాట్యశాలను వర్ణించినాడు.

"సురుచిరతారకాకుసుమ
శోభినభోంగణభూమి గాలమున్
గరువపుసూత్రధారి జత
నంబున దిక్పతికోటిముందటన్
సరసముగా నటింపగ ని
శాపతి కల్పిన క్రొత్త తోపు చెం
దిర యన నొప్పు సాంధ్యనవ
దీధితి పశ్చిమదిక్తటంబునన్."

రామరాజభూషణుడు సముద్రమునుండి ముత్తెములను గ్రహించుటను వర్ణించినాడు.

"నటదీశహాస విస్ఫుటిత వేధోండక
ఖల లోచు పరణాంబుకణిక లనగ,
శైల్లబ్బునిర్లు పై స్వెల్లి సెల్ల పదార్థ
ములు ముగ్ధబోడను బుద్బుదములనగ,
రవికి మంజేహానిర్మథనసాధనములై
వచ్చిన ద్విజమంత్రవర్ణములన,
హరిపదంబును నీసు శిరమునైన నభంబు
న నభోగతులు నించు ననలనంగ,
చరమగిరి యను మరకాడు జలధిసరణి
దరణి డించిన నతడు తళ్ళిలిలమగ్న
విమలముక్తాఫలంబులు వెలికి జారిపె
ననగ నవతారకానికాయంబు లసరె."

ఇందు కవపటి వర్ణన – అస్తగిరియను జోడసరంగు సముద్రమున సూర్యునిదింపగా నతడు సముద్రమందు మునిగియున్న స్వచ్ఛమౌక్తికములను వెలికి తెచ్చెనా యనునట్లు క్రొత్త నక్షత్రములు ఆకాశమున ప్రకాశించినవి. ముత్తెములను గ్రహించు మార్గమును చెప్పనుద్దేశము కవికి లేదుగాని దానిని సాటిగా గ్రహించినాడు.

ముక్కుతిమ్మన కృషీవలుల మాఘవిశ్వాసమును ఇట్లు వర్ణించెను:

"పొందుగ బచ్చిమాద్రితట
భూస్థలి నంసమదంసమత్స్యలా
కందము వాపరాంతహాలి
కప్రవరుం డిడ సాంధ్యవారి ధృ
త్కుండలము ల్తమోదశయ
తంబులు నై గెలపండి ప్రాలె పూ
ర్ణేందుని చేర బ్రాచినది
హేతువు వెన్నెలకల్మి కల్మికిన్."

ఈ కవియే రాజుల యుద్ధప్రయాణముల నిట్లు వర్ణించెను:

"రాజు వీడెత్తి చనిన తారకభటాళి
యంబరాభోగనిజశిబిరాంగణమున
గీలుకొల్పిన పావకజ్వాల లనగ
బ్రాచి గనుపట్టె నవసాంధ్యరాగరుచులు."

రాజులు దండును ఒక విడిదలనుండి మఱియొక చోటికి కొనిపోగా కొందఱు భటులు వెనుక నిలిచి ఆ తాత్కాలికకట్టడములను శత్రువులకు ఉపయోగపడ నట్టి విధమున కాల్చి పాడుచేసిపోవుట యాచార మనుట ఇందు స్పష్టము.

యాత్రలు, ఉత్సవములు, సభలు, వేదాంతాది విషయచర్చలు వీని వర్ణనలు హెచ్చుగా చరిత్రకుపయోగపడగలవు. పదునారవ శతాబ్దమునందు రచితములైన మాంధాతృచరిత్రసాంబోపాఖ్యానములలో కృతయుగద్వాపరయుగములయం దుండినవారైన మాంధాతృసాంబులచేత కవులు పంద్రెండవ శతాబ్దమునందు రామానుజాచార్యులవారు ప్రతిపాదించిన విశిష్టాద్వైతమునుగూర్చి ప్రసంగింపించినారు. తరిగొప్పుల మల్లన చంద్రభానుచరిత్రమందు క్రీ. శ. పూర్వము లేని తిరుపతిదేవస్థానమునకు శ్రీకృష్ణసత్యభామల పుత్రుడైన చంద్రభానుడు యాత్ర సాగించినట్లు వర్ణించి ఆ యవకాశము బురస్కరించుకొని తిరుపతి క్షేత్రమును వర్ణించినాడు.

రాగా రాగా కవులు ప్రాచీననాయకులకు సమకాలికప్రభువుల చర్యలను జోడించుచువచ్చిరి. ఉత్తరనృసింహపురాణ మను గ్రంథమందు ప్రహ్లాదుడు తాను జయించిన రాజ్యములయందు తన యాశ్రితులకు, విజయనగరరాజులవలె, భూములు ఉంబళికలుగా నిచ్చెనట. చంద్రాంగదచరిత్రమందు, మన్మథుడు తీయమామిడిచెట్లను కట్టుబడులుగాను, పుష్పవాటికలను ఉమ్మళికలుగాను, దాళిమ చెట్లను పాళెములుగాను, పుప్పొడులను వీలుబడులుగాను, క్రమముగా మూలికలకై తీతగాండ్రను కోయిలబంట్లకును, పుష్పరసమును అనుభవించు తుమ్మెదల ప్రజలకును, ఫలవృక్షములను కాచు చిలుకపాళెగాండ్రకును, శీతలసుగంధముల పరిపాలకుడైన దక్షిణమారుతసామంతునికిని విరహిజనులమీద దండెత్తుటకు ఇచ్చెనట. మనోహరమైన సామ్యము, సమకాలికరాజుల వృత్తము.

## సూక్ష్మవిమర్శకదృష్టి : వాఙ్మయ పరిణామము

విజయనగరాంధ్రప్రబంధవాఙ్మయమందలి విశేష మేమనగా: పౌరాణికనాయికానాయకుల చరిత్రలను వర్ణించు సందర్భమున విజయనగరరాజుల చరిత్రములనే వారు చాలవఱకు వర్ణించిరి. తొంటికవులు ఇతిహాసరామాయణాదులను అనువదించిరి. శ్రీనాథాదులు పురాణములను, కావ్యములను ఆంధ్రీకరించిరి. కావ్యములలో పదునెనిమిది వర్ణనలును వచ్చెడివి. హర్షనైషధాదు లుదాహరణములు. ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరు డని ప్రసిద్ధి వహించినను ఆయన కాలమున కింకను అనువాదయుగమే. 'నృసింహరామచారిత్రము'లు పురాణములే. తానే ఆశ్వాసాంతగద్యమందు పురాణకథ యని పేర్కొనినాడు. ప్రబంధముల లక్షణములైన పదునెనిమిది వర్ణనలును ఇందు కలవు. అనగా పురాణప్రబంధముల భేద మేర్పడనికాలము. శ్రీనాథుడు పురాణముల నాంధ్రీకరించినను కావ్యముల నాంధ్రీకరించి, మార్గదర్శి యాయెను. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు శాకుంతల కథను కావ్య మొనర్చెను. తర్వాత ప్రబంధముల కొక క్రొత్త రూ పేర్పడినది. కేవలపురాణముల నాంధ్రీకరింపక, సంపూర్ణముగా ప్రాచీనకావ్యముల ననువదింపక పూర్వకథలను గ్రహించి, కొంత స్వతంత్రించి పదునెనిమిది వర్ణనలు వచ్చునట్లుగా చమత్కారముగా వ్రాయు పద్ధతి యేర్పడినది. ఇట్టి రచనలలో మనుచరిత్రమే మొదటిది. పారిజాతాపహరణము హరివంశాంధ్రీకరణమే యైనను ప్రబంధకవిత అందు పరప్రోచ్ఛ్రితిం బొందినది. మిశ్రకథలు క్రమముగా వెలసినవి. ఈ విషయమునే రామరాజభూషణుడు—

"కేవలకల్పనాకథలు
కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరి పుట్టు రత్నము ల
వారితసత్కవికల్పనావిధా
పావహపూర్వవృత్తములు
సానల దీరిన జాతిరత్నముల్
గావున నిట్టి మిశ్రకథ
గా నొనరింపుము నేర్పు పెంపునన్."

అని విశదీకరించెను. చరిత్రకారుడు వాఙ్మయపరిణామమును గుర్తించుటచేత నాతనికి సూక్ష్మవిమర్శకదృష్టి యలవడును. కవులు ఇతివృత్తములను మాత్రము ప్రాచీనపురాణములనుండి గ్రహించిరే గాని మిగిలిన పెంపకమంతయు తమతమ యూహలచే నింపిరని తెలియవలయును.

ఈ కార్యము పురాణాంధ్రీకరణకాలము నుండియు కొంత కానవచ్చుచున్నది. నాచనసోముడు ఉత్తరహరివంశమున నగరరక్షణముంగూర్చి ద్వితీయాశ్వాసమున నిట్లు వర్ణించినాడు:

"కోట సింగారించి, కొత్తళంబుల నెల్ల
  నట్టళ్లు పన్నించి, యాళువరికి
బరదిళ్లు వెట్టించి, పైగొమ్మ లెగయించి,
  గుండుగూలను వసికొయ్య గూర్చి,
యగడిత లోతు నీ రలవడ ద్రవ్వించి,
  వెలిచుట్టి రాములు వెలుగు వెట్టి,
దంచనంబులు దద్దసంబులు నెత్తించి,
  పలుగాడి తలుపులు బలుపుచేసి,
బాళెను లెవ్వట్టి త్రొంకులు ప్రొద్దపరులు
గత్తి గొంతెంబు లాడిసెల్లి గత్తళములు,
నారసములును విండులు నగరిలోన
ఇట్టి పెట్టును నడుమట్టి వట్టి-నావు. (౨-౮౨)

ఈ కోటకు నొక దిక్కున
వాకిలి వారించి యానవాలుగ జారల్
రాకల బోకల జక్రము
కేకొని రక్షకులతోడ జెప్పి చనదగున్. (౨-౮౩)

పురచుట్టు న్నికరుండు పారణుడు నీ
  భోజాంగకుల్ గూడి క
త్తెకగాయంబులు గంపముంగిళులు నం
  దిం గొమ్మకొమ్మ న్నిరం
తరముల్ సాదనదీన లెత్తి చను డు
  త్తాలన్వజాళీల నో
పురభేరీరవభిన్నవైరిహృదయా
  పూర్ణంబుగా రాత్రులన్. (౨-౮౪)

తరకోదండ కృపాణకంకటశిర
  స్త్రాణంబులం బూని సం
గరసన్నాహవిహారులై నగర ర
  క్షాదక్షతం జాపు శా
ర్వరి నిద్రం జెడ రాజ వాదనిగమ
  వ్యాఖ్యానము ల్మాని రా
త్యరిచేత న్నగరాటు లేక వరభా
  వజ్జాంచనై తెమ్మరా!" (౨-౮౫)

ఇవంతయు ద్వాపరయుగమందలి వర్ణనగాదు. కలియుగమున క్రీ. శ. పదమూడవ శతాబ్దమందలి విజయనగరాంధ్రరాజుల కాలముదే. ఇవి నాడు నిత్య వ్యవహారమునందుండిన పదములు. కవులలో, వర్ణనాంశములను కంటికి కట్టినట్లు రచించుట నాచన కాలమునకు అలవాటయినది. నన్నయలో నిది కానరాదు. తిక్కనలో కనబడియు కనబడక యున్నది. నాచన సమకాలికులకు ఈ వర్ణన నిత్యపరిచయవస్తువర్ణనగా నత్యంతము హృదయంగమముగా నుండియుండును.

నవరము చినవారాయణ నాయకుడు కువలయాశ్వ చరిత్రమున రాజులు యుద్ధసన్నద్ధులగు విధమును వర్ణించినాడు. కథ భారతాంతర్గత ఋతుధ్వజునిది. ఒకప్పుడు ఆ రాజుకొద్దికి గాలవుడను మునిరాజు గుఱ్ఱము నొకదానిం గొనివచ్చి పాతాళకేతువనియెడి రక్కసుండు తన కుపద్రవమొనరించుచున్నాడని తెలిపి, తా నారక్కసుని శపియింపనుండ తనకొక వచనంబు వినబడి యొకగుఱ్ఱమును ప్రసాదించిన దనియు, ఋతుధ్వజనరేంద్రున కిద్దాని నిచ్చిన నాతడా యసురుని శిక్షింపగలడనియు వచింపగా తాను తెచ్చితి ననియు పలికెను. అంతట నారాజు దండువెడలెను. ఈ వృత్తాంతము కవిసమకాలికోచితమైన విధమున వర్ణింపబడి యున్నది. నాడు కవికి సమకాలికులైన రాజులిట్లు చేయుచుండిరని విశదము.

"అని మహీజాని యూడిగపు
  టాప్తుల గ్గొని దండు చాలుగా
బనుపు డటంచు బల్కి ముని
  పాలకమౌళికి మ్రొక్కి గేలుమోడ్చి స
ద్వినయ వినమ్రుడై నిలిచె
  వెంబడిగా నరుదెంచుచున్నగా
జనుడని పీడుకొల్పి హరి
  సాహిణి నీవశమంచు బల్కుచున్.

గడెలు పదాలు చెల్లెనన
  గా విని కట్టికవారు త్రోలగ
న్పడ నవధారు దేవ జత
  సాయక గట్టియ డిగ్గ యంతటన్

వ్విడిదల కంపె మాళిసర
ణిన్ హరిగ ల్మి సుసంగ శెట్లు వెం
బడి కయిలాగొసంగ దెలి
పావలు మెట్టి యొయ్యార మేర్పడన్.
కోణేవాకిటవారినిల్పికులుకుం
గు త్తంపుజన్గుబ్బ లే
జాణ ల్కొండలు కుంచె గిండియడపా
ల్నాగింపవాణీరణ
ద్వీణాపాణులు కొంద రారతిగము
ల్దీపింపంగ గవాక్షాంతర
శ్రేణు ల్దాటి నృపాలు డంతిపురముం
జేరెం బ్రమోదంబునన్."

(కువలయాశ్వచరి. ౨-౪,౪౬)

ఈ మర్యాదనే కృష్ణరాయ విజయమందు కుమార ధూర్జటి—

"పురసంరక్షణనక్తులౌ జనులకున్
బుద్ధి స్థితుల్ దెల్పి భూ
సురసందర్శిత దివ్యలగ్న మహిమల్
పొంపొంద నందంబుతో
స్థిర కారోన్నతి జృంభమాణగరిమన్
దిగ్జైత్రయాత్రామతి
న్వైరవోప్పం బురివెంకల న్వెలిగుడా
ర్వేయంగబంచె న్వెసన్.

పంచి సమంచితస్థితి స
భాసదుల న్విలసత్కృప న్విలో
కించి ధరామరేంద్రులకు
గీర్తి చెలంగ సమస్తవస్తువుల్
మించిన వేడ్క దానము ల
మేయగతిన్ ఘటియించి విస్ఫుర
త్కాంచన భూషణావళిత
టిద్యుతిరంజితదివ్యమూర్తియై"

తర్వాత రాజు అంతిపురమున శయనించి, 'మార్తాండమండలంబు'దయింపగా,

"ఇటువలె వేగగ నరపతి
పుటభేదనమున బ్రయాణ భోనక భేరీ
పటహాధమామిక కాహళ
పటురవములు నిద్రలేపి పయనము దెలుపన్"

ప్రయాణమారెను అని, రాజు నిద్రలేచుట, కాల కృత్యములు దీర్చుకొనుట మొదలుగా నన్ని వివరముల ను దెల్పినాడు. కాని యంతిపురి కేగిన రాజు భార్య చేత వీరతాంబూలము నంది యుద్ధమున కేగనిదానికి కారణము ఆతని కింకను వివాహము కాకపోవుటయే. యుద్ధమున కేగు రాజును పట్టమహిషి తాంబూల మిచ్చి పంపవలయును. అదే శ్రీకృష్ణరాయ విజయమున వర్ణింపబడియున్నది.

"పరమతి షడ్గుణప్రకట
వైభవనిర్జితశారదాంబుదా
తిరుమలదేవి కప్పురపు
దీవన వీడె మొసంగి పంపగా
నరవరమౌళి దివ్యశకు
నమ్ములు గన్పడ భద్రదంతి పై
సరగున నెక్కె ఛత్రమును
చామరముల్ మెరయంగ నంతటన్."

రాజుల సైన్యములతో వారికి సరఫరాలు చూచుటకు వర్తకు లేగుచుండువారు.

"మునుపుగా నేగి యసీమ గొల్లెనలు నన్ని
త్రోవ నెక్కడెక్కడ సేమిగావలసిన
యట్టిభక్ష్య భోజ్యాదులయమ్మకమున
దనియ జేసిరి వణిజులు తద్బలముల."

(కళాపూ. ౭-౪౨)

"కలసినచోట్ల నెల్ల నభి
వాంఛితవస్తు చయంబు గల్గుటన్
లలనలు దారు పాంద్రవర
ణంబుల నొప్పెడు పల్లకీల బో
గలుగుట నర్థవంతులకు
గట్టిన నాన్నపు దండయాత్ర యిం
పలరగ జేసె. పట్టణము
వట్ల యనర్గళభోగహేతువై" (కళా. ౭-౪౩.)

సైన్యములు నడచుటకు అడవులను నఱుకు విధము కువలయాశ్వచరిత్రము తెలుపుచున్నది.

"అచ్చర చెలువలయ్యాల చేరులుసేల
నై చితిరని తోడివారి బదర,
జోటించుకయుం లేక కోటరంబులలోని
యిరవు పాములు పెఱబోతియజోరగ
నఖిలపతుల కులాయములు బో బిల్లల
గఱచి యవ్వలి కోవకడకు బఱవ,
మంచి చీకటులు కల్పించు నీడలుపోవ
బద్మాకరంబుల పాచి విఱుగ
జెట్టుగులులేని పెనుగాలు చిచ్చు వచ్చె
ననుచు జెంవెత లెంకకై యలమటింప,
బార్థివేంద్రుని భటులు ఢాబాలునడుప
నఱికిరయ్యద్రిపై విపినంబులెల్ల." (కుమా. ౩-౧౦)

రాజు పాళెము డిగగానే బంట్లు చేయుపనులు-

"బొంగులు నిల్పి యుబ్బుగపైడిప్రాత బొ
మ్మలగుడారంబు లమర్చువారు
గొయ్యలు నాటి యాకులతోడి రెమ్మలు
వాటంపు గుడిసెలు వైచువారు
బొక్కళ్లవలె గుంతములు చేర్చి యామీద
గడితంపుబచ్చడాల్గప్పువారు
బచ్చిక లెచ్చుక్కడుపాఱల కెక్కి పూ
బొదరింట్లమున్నగా గదియువారు
నచ్చముగ నీటి కంకుపలరయువారు
పురుగుబుట్టలు చెదర నబ్బుచును నొక్క
పరిగ నవ్వుచుజప్పట్లు చఱచువారు
నైరి తద్వేళ బాళెంబువారలెల్ల" (కుమా. ౨-౧౦౪.)

పాళెములోపల ఉద్యోగులు చేయు కార్య కలాపములు :

"వలసినరొంపకు గమ్మలుబ్రాయు వ్రాయసం
బులవారి గంటాల కిలకిలలును,
నొరదలంచిన కార్యపరణు లెంచు నమాత్య
కుంజరంబు లొనర్చు గుసగుసలును,
బొలదిండిరాయల యలవుల గనివచ్చి
నిలుచు వేగులవారి కలకలములు,
వరుస కింద ఱటించు వంతు లేర్పడియున్న
బలకరంబులవారి యలబలములు,
నెపుడు నెడలునొకోయంచు నెంచియాడ
జూచు సంగీతమేళంబు సొగసుకాండ్ర
ధిమ్మనెడి మద్దెలల మ్రోత గ్రమ్మకొనియె
రాజు వసరించు తెలిగుడారంబుమ్రోల."
(కుమా. ౨-౧౦౫.)

## భాషాంతర సంవాదము

ఈ విధముగా వరుసపెట్టి వ్రాయుచుపోని దేశచరిత్రకు వలసిన పెక్కు వివరములు మనకు లభింపగలవు. ఈ విషయములు ఎంతవఱకు సరిపోగలవను ప్రశ్నకు సమాధానముగా ఆ యా రాజుల కాలమున మన దేశమునకు వచ్చి పాక్షాత్తుగా చూచి తాము చూచిన దంతయు తమ దైనందిన వృత్తములుగా రచించిన న్యూనిజ్, బార్బోసా మున్నగు విదేశయాత్రికుల రచనలు గలవు. వీనిని పోల్చిచూచిన వాస్తవము తెలువడును. పైగా చరిత్రకారుడు బహు భాషలయందు పాండిత్యము వలవఱచుకొనుట శ్రేయము. ఆంధ్రవాఙ్మయమును చక్కగా వర్ధము చేసికొనవలయునన్న సంస్కృతజ్ఞాన మావశ్యకము. ఇది భాషా వాఙ్మయ పరిణామములను గ్రహించుట కత్యంతము సహాయకారి. చరిత్రకారునికి ఈ విషయములెట్లో అట్లే ఆంధ్ర పండితునికి చరిత్రజ్ఞాన మావశ్యకము. రాజులు, కుట్రలు, మంత్రాంగములు, యుద్ధములు మాత్రము తెలిసిన చాలదు. వీనికి తోడు సాంఘిక, ఆర్థిక, రాజకీయ, మత విషయాదులు సంపూర్ణముగా తెలియవలయును. కవులు సమకాలిక కల్లోలములచే తమ భావములను మార్చుకొనుచుండుటను గుర్తింపవలయును. కవులు కావించు కాల విపర్యాసములను గణుతింపవలయును. ఉదాహరణము : సింహాసనద్వాత్రింశత్సాలభంజికయను కావ్యమందలి కథలలో విక్రమార్క భోజులకును తర్వాతివారైన కాకతీయులను, ఓరుగంటిని, ఏకవీరాదేవిని ప్రస్తావించుట చూడవగును. అట్లే నన్నెచోడుడు రతిచే మన్మథునికి ఇటీవలివారైన శైవమహావ్రతుల చర్యను చెప్పించినాడు.

## ఉపసంహారము

కాగా చరిత్రకారులు భాషాపండితులుగాను, పండితులు చరిత్రవేత్తలుగాను కావలసియున్నది. అట్లే నేడు అనుచున్నారు. పూర్వకాలపు పండితుల విద్య

లలో భూగోళ చరిత్రములు చేరలేదు. నేడు భూగోళ చరిత్రజ్ఞానము సర్వసామాన్యములైనవి. ఇది తెలియని వాడు పండితుడు కానేరడు. చరిత్రతో సంబంధము లేని సాహిత్యము నిరుపయోగము. క్రమముగా చరిత్ర భాషాజ్ఞానములు సమ్మిళితములై తెనుగుపండితుడన చరిత్రకారుడు నైతమనియు, చరిత్రకారుడన విమర్శక జ్ఞానములతోడి యాంధ్రపండితు డనియు నేర్పడియున్నది. ఇట్లే భాషావిషయమందును. అకారాది నిఘంటునిర్మాణమును నూతనవిమర్శనా పద్ధతులను ఆధునిక యుగమున చిన్నయసూరిపర్యులలో ప్రారంభమైనవి. సూరిగారిపని చాల గొప్పదని 'కాలదిపాటి యాశయములతో', శ్రీసీతారామాచార్యులవారు శబ్దరత్నాకరమును నిర్మించిరి. ఇది ప్రామాణికమేయైనను మనకు నేటికి చాలకయున్నది. కాలము మారినది. క్రొత్త తాళపత్రములును బయలు వెడలినవి; నూతన ప్రయోగములును దొరకినవి. భాషాపరిశోధనలో పద్ధతులును మారినవి. తాళపత్రగ్రంథములయందును, ముద్రిత గ్రంథములయందును దొరలిన లేఖక ముద్రాపక ప్రమాదములను చాలవఱకు ఊహచేతను, గ్రంథాంతర సంవాదాదికములచేతను దిద్దుచు సాధుపాఠ నిర్ణయ మొనరించుచు వచ్చిరి. క్రీ.శ. ౧౮౯౧ సం.న సీతారామాచార్యులవారు గతించిరి. అప్పటికి మనకు ఆంగ్లవిద్యాసంపర్కముచే చరిత్రపరిశోధన చేయవలయునని తోచినది. శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిపంతులవంటివారు కవిజీవితాదులను, శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారి వంటివారు అముద్రితాంధ్రగ్రంథముద్రణమును, ప్రాచ్యపాశ్చాత్య మర్యాదల ననుకరించి గ్రంథ విమర్శలను చేయుచుండిరి. క్రమముగా చరిత్రపరిశోధన తలయెత్తినది. శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారును, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారును చరిత్రగ్రంథములు వ్రాయసాగిరి. క్రొత్తక్రొత్త శాసనములను, తాళపత్రగ్రంథములను ప్రకటించుచుండిరి. వీనిచే నూతన పదజాలమును దొరకుటయు, వానియర్థనిర్ణయమందు శాసనములు సంయుతము ప్రమాణములు కాజొచ్చినవి. మా మాతామహులు శ్రీ శేషగిరిశాస్త్రిగారు కాల్డ్వెల్ల్ పండితుని తర్వాత భాషాతత్త్వశాస్త్రమును గుఱించి పనిచేసి ద్రావిడభాషల పరస్పర సంబంధములను తెలుపు వ్యాకరణమును వ్రాసిరి. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు అపూర్వగ్రంథములను ప్రకటించి నన్నయకు పూర్వపు వాఙ్మయస్థితిని కనుగొన యత్నించిరి. ఈ విధముగా నూతన మార్గములు తోచిన వెనుక సీతారామాచార్యుల నిఘంటువు చాలదనియు, మరల నొక నిఘంటువు కావలయుననియు పండితులకు తోచినది. ఈ యాలోచన ఫలితమే సూర్యరాయము. కాని నన్నెచోడుని కుమారసంభవమునకును, నాచన సోముని యుత్తర హరివంశమునకును, ఇతర శైవగ్రంథములకును వ్యాఖ్యలు వెలువడలేదు. వానియందలి యపూర్వపదములకు అర్థనిర్ణయము కుదురలేదు. మనకు ప్రాణగొడ్డములుగానుండు నీయపూర్వపదములు కొన్ని ద్రావిడ కర్ణాటభాషలలో కనబడుచున్నవి. నిఘంటువుల కెక్కని పదములు ఆంధ్రమున నున్నట్లే ద్రావిడ కర్ణాటకములయందే గాక సంస్కృతమందును గలవు. వీనికెల్ల కారణము ఈ వాఙ్మయములను ఇంకను పఠించి పరిశోధకులు వ్రాయుచున్నారు. కాలదిపాటి ఆశయములతో పండితులు నిరంతరము కృషి చేయుచునేయున్నారు. నేను మనకు తెలిసిన క్రొత్తవిషయమేమనగా ఆంధ్ర శబ్దములకు కేవలము ఆంధ్రభాష మాత్రమేగాక సంస్కృత ప్రాకృత ద్రావిడ భాషల వాఙ్మయముల నెల్ల శాసనాది సంవాద పూర్వకముగా పఠించి తత్త్వము నరయవలయును. భాషాపండితులు చారిత్రక దృష్టి నలవరుచుకొనవలయును. ఫైలాలజీపండితులు కేవలము నామసామ్యమును మాత్రమేగాక ఆయాశబ్దముల చరిత్రములను కూడ నన్వేషింపవలయును. ఇట్లు చూడగా విశాల దృక్పథము కావలసినట్లు తోచుచున్నది. ఇది దేశమునకును, వాఙ్మయమునకును చాల యభిలషణీయమైనదిగా కన్పట్టుచున్నది.

# తెనుగుభాషలో శాస్త్రవాఙ్మయము

శ్రీ గొబ్బూరు వెంకటానందరాఘవరావు

మహాభారతమును—

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియు
పరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని........"

బహుతెరంగుల గొనియాడుచుందురు. ఇందు వేదాంతభాగము, నీతిభాగము, ధర్మశాస్త్రభాగము, కావ్యభాగము, లక్ష్యలక్షణభాగము మొదలగునవి పెట్టెలలో సరులవలెను, లోగిళ్లలో గదులవలెను, వివిధప్రదేశములందు వేర్వేరుగా రచింపబడలేదు. తేజోమయమై ధవళమై ప్రకాశించు సూర్యకాంతి యందు పీతారుణహరినీలమరకతశ్యామాదినానావర్ణ సమామ్నాయము (Spectrum) అణగియున్నట్లు ధర్మ నీతి వేదాంతవిజ్ఞానవ్యాకరణాది వివిధవిషయము లందంతర్భాగములై యంతటను వ్యాపించియున్నవి. నేత్రముల యెదుట పెట్టి వర్ణము గల యద్దము నుంచి చూచిన లోకమంతయు నావర్ణమయముగా గాన్పించుట సహజమేగదా ! నీలపుటద్దములో చూచిన లోకమంతయు నీలముగా గాన్పించును. ఎరుపుటద్దములో చూచిన లోకమంతయు నరుణిమ వహించినట్లే కన్పట్టును. పాఠకులు భారతము నే దృష్టితో పరికిలించిన నాదృష్టి గల విశేషములతోనే నిండినట్లు కన్పించి వింత గొల్పుచుండును. భారతము నే కాక తెనుగుసారస్వతమును శాస్త్రదృష్ట్యా పరిశీలించి అందలి విజ్ఞానరత్నములను కొన్నింటి నేరికొందము. అన్నింటి నేరికొనుట కొకని జీవితము చాలదు.

శ్రీ నాథకవిసార్వభౌముడు ఈ క్రింది పద్యములో ఈ భావమును చక్కగా విశదముచేసినాడు :

"విశ్వరూప ! భవద్భూరివిభవమహిమ
యెంత వర్ణింపజాలు మా యీ మనంబు
ప్రాతపైచీర చెఱగున బిగుచువాడు
హేమశైలంబు చిదిపిణా లెన్ని ముడుచు ?"
(శృంగారనైషధము ౮-౧౪౮)

కాబట్టి మన సారస్వతరత్నాకరమున నొక్క బుడక పెట్టి చేతి కందిన విజ్ఞానరత్నములను కొన్నింటి నేరుకొందము.

## కాలముయొక్క విశిష్టత

విశ్వరూపుడగు భగవంతుడు కాలస్వరూపుడు. విశ్వములో గాలి తగులనివి యనేకము లున్నవి. కాని కాలము తగులనివి లేవు. సృష్టిలో ద్రవ్యము (*matter*) దేశావృతము (*contained in space*). దేశము వినా కాలము, కాలమువినా దేశమును లేవు. అవి యవినాభావసంబంధము కలవి. కావున నిటీవలి వైజ్ఞానికులు (*Space - Time factor*) దేశకాలముల విశిష్టసంబంధమును గురించి ప్రశంసించుచు గ్రంథములు వ్రాయుచున్నారు. పాశ్చాత్యవైజ్ఞానికు లిటీవల గ్రహించిన యీ పరమసత్యమును మన పూర్వులు బహుకాలముక్రిందటనే గమనించి అత్యల్పకాలమును, అత్యల్పద్రవ్యమునుకూడ 'పరమాణు'వనియే వ్యవహరించిరి. రెండు పరమాణువుల కాలము ఒక అణువు. మూడు అణువుల కాలము ఒక త్రసరేణువు; మూడు త్రసరేణువులు ఒక త్రుటి కాలము; నూరు త్రుటులు ఒక వేధ; 3 వేధలు ౧ లవము; 3 లవములు ఒక నిమేషకాలము.

మన పూర్వుల కాలమానములు సరిగా తెలిసి కొన, నిమేషకాలమును ఇంగ్లీషు మినిట్ (*minute*)తో

చెవ్వరో ముడిపెట్టిరి. ఇది హిమాలయమంతటి గొప్ప తప్పు. మన నిమేషము ఇంగ్లీషుసెకెండులో ౧౬/౭౫ అంశము మాత్రమే యగును. పరమాణుకాలము ఇంగ్లీషుసెకెండునందలి డెబ్బదియయిదువేల అంశలలో నొకదానికంటె తక్కువ యగును. ౧/౭౫౦౦౦ Second.

## వె లు గు వే గ ము

సూర్యుడు సప్తాశ్వ డని మన వేదపురాణము లన్నియు ఘోషించుచున్నవి. సూర్యకాంతిలోని ముఖ్యమైన రంగు లేడింటిని మనవారు అశ్వసంజ్ఞతో తెలిపిరి. సూర్యకిరణములు సూటిగా సరళరేఖామార్గమున పోవుట లేదని పడమటివారి రిటీవల గ్రహించిరి. కాని మన పెద్దలు అనాడే "భుజగవమితా స్పష్టతురగాః" గుఱ్ఱములు మెలికలు తిరుగుచు పోవు, పాములచే సూర్యరథమునకు కట్టబడిన వని తెలిపిరి. అనగా సూర్యకిరణములు పాము మెలికలవంటి తరంగగమనముతో వెడలుచున్న వని నిగూఢముగా నిర్వచించిరి. ఈ ప్రకృతిసత్యమునే నేటి వైజ్ఞానికులు *wave motion of light* అని విశదము చేయుచున్నారు. ఇక యీ వెలుగుకిరణము లెంత వడిగా పోవుచున్నవను ప్రశ్నకు వేద మిట్లు ప్రత్యుత్తర మిచ్చుచున్నది: "యోజనానాం సహస్రే ద్వే ద్వేశతే ద్వేచ యోజనే ఏకేన నిమిషార్ధేన క్రమమాణ నమోఽస్తు తే". అనగా నిమిషార్ధములో రెండువేల రెండువందల రెండు యోజనములు వెలుగుకిరణములు గడచిపోవుచున్న వని యర్థము. ఈలెక్క స్కాందపురాణకాశీఖండములో సంస్కృతమూలమున లేకున్నను కాశీఖండము తెనుగురచనలో శ్రీనాథ కవిసార్వభౌముడు (౩-౧౬౬) స్పష్టముగా వక్కాణించియున్నాడు. సంస్కృతమూలగ్రంథములో లేని యీ మహత్తరవిజ్ఞానవిషయము తెనుగు కాశీఖండములో వివరించుట గొప్ప విశేషము. శ్రీనాథ కవిసార్వభౌముని యఖండవిజ్ఞాననిరతి నీ యంశము చక్కగా నిరూపించుచున్నది. నిమేషము ౧౬/౭౫ ఇంగ్లీషు సెకెండుకాలము కదా! నిమేషార్ధము ఇందులో సగము. ౮/౭౫ సెకెండు; ఇంతలో వెలుగు కిరణములు ౨,౨౦౨ యోజనముల దూరము గడచిపోవుచున్నవి. యోజన మనగా ఇంగ్లీషు మైళ్లు తొమ్మిదిపైని నూటఅరువదిగజముల దూరము. ఈ యంకెలను బట్టి గుణించగా ఇంగ్లీషున సెకెం డనబడు కాలములో వెలుగు ౧,౮౬,౦౦౦ మైళ్లు పోగలదని తేలినది. ఇప్పటి వైజ్ఞానికనిర్ణయప్రకారము వెలుతురు సెకెండుకాలములో ౧,౮౬,౩౨౪ మైళ్లు పోవుచున్నది. మనపూర్వు లెంతకాలము క్రిందటనో ఇంత సరిగా వెలుగుకిరణముల యూరువడి నిశ్చయింపగలుగుట ఆశ్చర్యకరము. నన్నయ రచించిన భారతములో కూడ నీ విషయము కల దని చూచి యపరిమితానందము నొందితిని. ఆంధ్రభారతమునందలి తపతీసంవరణోపాఖ్యానకథలో నీ లెక్క తీయబడినవి. సంస్కృతమూలములో నీ ప్రశంస కలదేమోనని దివాకర్ల వెంకటావధానిగారును, నేనును సంస్కృతమూలము శ్రద్ధగా చదివి చూచితిమి. ఆ కథలో సంస్కృతమూలములో సూర్యకిరణగమనవిశేషప్రసక్తి లేదు. తెనుగుభారతములో ఒక్కొక్క అచ్చుపుస్తకములో ఒక్కొక్కమాదిరిగా సూర్యరథగమనవేగము వ్రాయబడినది. నలువదియేండ్లక్రిందట శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి చేతను, రాజా శ్రీ విక్రమదేవవర్మగారి చేతను పరిష్కరింపబడి విశాఖపట్టణమున విన్నకోట వారిచే ముద్రితమైన ఆదిపంచకసంపుటములో ఆది. ౬-౮౮ రచనలో "ఇట్లొక్క నిమిషార్ధంబున రెండువేల యోజనంబులు వడచు నాదిత్యరథంబుతో నక్రమంబున సరిగి" అని పాఠాంతర మున్నట్లు ౧౬౮ వ పుట యడుగున *Foot-Note* చూచి చాల సంతోషించితిని. శ్రీనాథుడే కాదు, విజ్ఞాననిరతుడు నన్నయ్య కూడ "సంహితాభ్యాసుడును, బ్రహ్మాండాదినానాపురాణవిజ్ఞాననిరతుడు" నగుటచేత సంస్కృతమూలమునందు లేని సూర్యరథగమనవేగ మనగా, సూర్యకిరణముల గమనవేగమును ఖండించి వ్రాసెను. మరొకరు పరిష్కరించిన ఆంధ్రభారతములో నిమేషమాత్రంబున మున్నూటఅరువదినాలుగుయోజనము లని ముద్రింపబడినది. అది లేఖకుని తప్పో, ముద్రాపకుల తప్పో. నిమేషద్వాదశాంశమున నని యున్నచో సరిపోవును. ఏమనగా నిమేషద్వాదశాంశమున మున్నూట

అరువదినాలు గన్న సంఖ్యను ౬ చే గుణించగా వచ్చు సంఖ్య ఇంచుమించుగా నిమేషార్ధగతిసంఖ్యతో సరి పోవును. ౩౬౮ × ౬ = ౨౨౦౮ యోజనము లగును. ఈ యంక రెండు వేలకు పైనను, రెండు వేల రెండువందల రెంటికి లోపునను ఉన్నది. ఇట్టి స్వల్పభేదాలవలన నాటివారు పెక్కువిషయముల పరిశోధించి యథార్థము తెల్పి రని యూహించుట కుపపత్తులు కలుగుచున్నవి.

## తరంగగమనము (Wave-motion)

ఈనాటి పాశ్చాత్యవిజ్ఞానసౌధమంతయు దేశకాలముల యవినాభావసంబంధముపైని తరంగగమనరీతి నాధారముగా చేసికొని నిర్మింపబడినది. వెలుగొక్కటే కాదు; శబ్దము, విద్యుత్కాంతశక్తులు, వేడిమి మొదలగున వన్నియు క్రియానిర్వహణమున కాధారమైన *Energy* (సామర్థ్యము)యొక్క వివిధపరిణామములు. ఒకడు పదిరూపాయల నోటిచ్చి చిల్లర మార్చునపుడు రెండైదురూపాయల నోట్లుగాని, ఐదు రెండురూపాయల నోట్లుగాని, పది రూపాయినోట్లుగాని ఇచ్చెదరు. లేదా అదే విలువ గల అర్ధరూపాయలు, పావలాలు, మొదలగు నాణెము లేవి కావలసిన నవియే యిచ్చెదరు. అదే విధముగా ఎనర్జి నెందులోనికి గావలసిన నందులోనికి మార్చుకొనవచ్చును. విద్యుచ్ఛక్తి ఇండ్లు తుడుచును; వేడినీళ్లు కాచియిచ్చును; వంట చేయును; బట్టలుతికి ఇస్త్రీచేయును; విసరుకఱ్ఱలతో విసరును; గంటలు కొట్టును; దీపములు వెలిగించును; తెరమీద బొమ్మల నెక్కించి తెయితక్క లాడించుచు పాటలు పాడించును; కబుర్లు చెప్పించును; బండ్లు నడిపించును; యంత్రములు నడుపును; గిల్టు వేయును; అచ్చులు గ్రుద్దును; రేడియోవార్తలు వినిపించి, ఉపన్యాసము లిప్పించి పాటలు పాడించును. ఇంతకును మూలము తరంగగమనము. విద్యుత్తుయొక్క కెరటపు నిడివిని బట్టి రేడియో పెట్టెలు సర్దుచుందురు. ఈ తరంగగమనమునుగూర్చిన తియ్యని పద్యము శ్రీనాథవిరచితమైనదానిని చదివి మాతము:

"ఆత్మమండల మవధిగా ననుచరించి
యవనినాథుండు జామాత ననిపి మరలె
నాప్రతీరంబు గంధవాహంబు ననిచి
మరలివచ్చుతటాకంపు తరగవోలె."

(శృం. నై. ౭-౬)

నలదమయంతుల వివాహానంతరము, భీమరాజు కూతురు దమయంతిని అల్లుడు నలమహారాజును తన దేశపు సరిహద్దులవఱకు దిగబెట్టి వెనుకకు మళ్లినాడట. ఎట్లనగా నీటి కొలనిలో ఒక తరంగము ఎదుట నున్న గాలిని ముందుకు నడిపుచు ఒడ్డు చేరి, అక్కడ గాలిని విడిచిపెట్టి వెనుకకు మళ్లిన, ఆ తరంగము—నీటికెరటము వలెనే తిరిగివచ్చినా డని భావము. విశ్వ మిట్టి కెరటములతో నిండియున్నది.

## విద్యుచ్ఛక్తి

ఈ శక్తికి ఇంగ్లీషులో ఎలెక్ట్రిసిటీ యని పేరు. ఈ పేరు వచ్చుటకు కారణ మున్నది. స్వర్ణచ్ఛాయతో పచ్చగా మెఱయు నొకానొక పీతమణి గలదు. దానిని మథించినప్పుడు వింతశక్తి యొకటి పుట్టి తృణాదుల నాకర్షించును. ఆ పీతమణికి గ్రీకుభాషలో ఎలెక్ట్రాన్ అని పే రున్నది. దానికి గల తృణాకర్షణశక్తిని బట్టి ఆ భాషలో నా శక్తిని ఎలెక్ట్రిసిటీ అనిరి. గ్రీకుభాషా శబ్దములు ఇంగ్లీషులో వేలకొలది చొచ్చినవి. అట్లు చొచ్చిన గ్రీకుమాటలలో ఈ ఎలెక్ట్రిసిటీ యొకటి.

అంతకుముందు మన దేశములో రత్నపరీక్షకులు ఇంద్రనీలమణి మొదలగు రత్నములు కొన్ని తృణగ్రాహు లని ఎరిగియుండిరి. శ్రీకృష్ణదేవరాయలవారు ఆముక్తమాల్యదలో నీ యంశమును గైకొని శరత్కాలమును, గ్రామాదులను వర్ణించియున్నారు.

"తనరె బలిభుక్తతులు నిం
డిన గ్రామశ్రీల కటితీ నీలము లగుటం
గనియె దృణగ్రాహిత నని
గొను కసవులు శైత్యతరుల గూండ్లకు భ్రమలన్"

(ఆముక్తమాల్యద, ౪-౧౩౭)

కాకుల గుంపులు గ్రామసమీపమున నున్న ఉద్యానమందలి చెట్లమీద గూండ్లు కట్టుకొనవలయునన్న యిచ్ఛచేత గఱచికొనిపోవుచున్న గడ్డిపరకలు చూడగా దండిరైన గ్రామలక్ష్ములు కంఠమందు

ధరించిన హారములందలి నీలమణులు తృణములను గ్రహించుచున్నవో యన్నట్లు ఒప్పెను.

మఱియు నాముక్తమాల్యదయందే (౪-౧౬౪) గీతపద్యమును చూడుడు :

"నింగి యత్తఱి దన్మహానీలమైన
గరిమకుం దగగా దృణగ్రాహి యయ్యె
ననగ పరిణతకలమాదియనపరాశి
తతులు గిరు లన నభ్రంకషత జెలంగె"

కర్షకులు పండించిన వరిచేలను నూర్చి గడ్డి మేటులు నైవగా అవి కొండలవలె నుండెను. వినీలాకాశ మనెడి ఇంద్రనీలమణి తృణగ్రాహియై యీ కసవుల నాకర్షించుచున్నట్లు శోభెను.

తృణము నాకర్షింపజాలనిది జాతిరత్నము కాజాలదు. మేలుజాతిరత్నమునకు లక్షణము తృణగ్రాహిత్వమే. తృణమువంటి యల్పుడైన తన్నాకర్షించి తన సన్నిధానమున నిలుపుకొనుటచే రాయలవారికి ప్రభురత్నలక్షణము సార్థక మగునని కవికుమార ధూర్జటి కృష్ణరాయవిజయకావ్యములో సాభిప్రాయముగా నీ క్రింది పద్యమును రచించినాడు:

కృష్ణరాయవిజయము—
"లలి దృణగ్రాహియైన నీలమునకరయ
విలువ యధికంబు, తృణమని విడచినంత
జాతినీలంబు గాదు........." (౨-౯౧)

కనుక తనను విడచిపెట్టక, చేరదీసి, పోషించుచుండుమని కవి విన్నపము చేసెను.

## విద్యుద్రక్షణ (Insulation)

ఒకవస్తువున నున్న విద్యుత్తు పైకి పోకుండ అందే నిలుపవలె నన్న కొన్నిరక్షణసాధనముల నుపయోగింపవలెను. అందుకు పాడి పట్టుగుడ్డకాని, పాడిపట్టుదారముగాని మిక్కిలి యనుకూలము గావున, ననంతకాలస్వరూపుడై కాలాతీతుడైన అనంతపద్మనాభస్వామిని పూజించి భాద్రపదశుక్ల చతుర్దశినాడు ఏడు దారముల పాడిపట్టుదారము గల తోరమును ధరింపు డని అనంతవ్రతము తెలుపుచున్నది. ఈవ్రతములో *Modern Physics* విశేషము లెన్నో ప్రదర్శింపబడుచున్నవి. విశ్వములో గల సమస్తభువనములకు గోపు డని శ్రుతులు ఘోషించుచున్న విష్ణుభగవానుడు కాలసర్పమగు ననంతునిపై శయనించుట యనగా కాలాతీతు డత డొక్కడే అని స్పష్టము. క్షీరసాగరతరంగములపై శేషాహిమీద నుండుట యనగా విశ్వమంతయు బహువిధతరంగకల్లోలమనుట సూచించుచున్నది. ప్రతివ్యక్తి పాడి పట్టుతోరము ధరించి శరీరవిద్యుత్తును పైకి వెడలిపోకుండ సంరక్షించుకొనుటచే (*Insulate*) శారీరకముగాను, మానసికముగాను పెక్కు ప్రయోజనము లున్నవి.

## విద్యుత్ప్రవాహము (Current Electricity)

అమధ్య మెసొపొటేమియా దేశములో పురాతన వస్తుసంచయమునకై పరిశోధకులు నేల త్రవ్వుచుండగా ఒక వింత విద్యుద్ఘటము దొరికినది. మట్టికాల్చిన కుండ పిడతలో అడుగులేని యొక రాగిపంచపాత్ర. అడుగున చేరిన తారు. పైనకూడ తారుపూత. దీనినుండి జనించు విద్యుత్ప్రవాహము మహారాజాంతఃపురములలో దీపములకును, కొన్ని వస్తువులకు బంగారుపూత (*Guilding*) చేయుటకును అతిరహస్యముగా వాడుచుండిరి. అట్టి విద్యుద్ఘటములు నిషధరాజగు నలచక్రవర్తియంతఃపురమున నుండెను. నలుడు దమయంతితో ప్రథమసమాగమము గావించిన నాటి రాత్రి వినోదమునకు విద్యుద్దీపములు వెలిగించి యార్పి వెలిగించుచుండెను. హర్షుడు సంస్కృతనైషధము(౧౮-౨౪)లో నీ యంశమును సంగ్రహముగా తెలిపియున్నాడు:

"స్వాప్నితోద్గమితమాత్రలుప్తయా
దీపికాచపలయా తిరోహితే
నిర్విశంకరతజన్మతన్మఖా
కూతదర్శనసుఖా న్యభుంక్త సః"

ఈ విద్యుద్దీపవినోదములను శ్రీనాథుడు తన యాత్రికరాజాస్థానములలో జూచి శృంగారనైషధములో (౪-౧౬౯) నిట్లు రమ్యముగా వర్ణించి యున్నాడు :

"ఒక దీప మార్పిన నన్ని దీపంబులు
నప్పుడె తమకు దా మాఱుటయును
దాలవృంతానిలచేలాంచలాదిక
వ్యాపారముల దీప మాఱమియును
ఆఱిన దీపంబు లప్రయత్నంబున
మఱి చూడజూడంగ నుండుటయును
మండి యాఱియు నాఱి మండిన దీపంబు
వెలుగుఁజీకటి యుగా గావించుటయును
గలుగునట్లుగ వరశక్తికలన రాజు
శిల్పముల నవ్వుటాలను జేయుచుండె."

...ఈ పద్యార్థము ఈనాటి సినిమాహాలులలో ప్రతిదినము పరిస్ఫుట మగుచునేయుండును.

## కాంతశక్తి (Magnetism)

సృష్టిలో స్వతస్సిద్ధముగా కొన్ని శిలలకును, మరి కొన్ని వస్తువులకును ఇనుపవస్తువుల నాకర్షించుకొను శక్తి కలదు. ఈ రాళ్లు ఇనుముతో తయారుచేయబడిన సూదుల నాకర్షించి లాగుకొను శక్తి గల వగుటచేత తెనుగువారు వాటిని "సూది+అంటురాళ్లు" అనుచుందురు. ఇనుపవస్తువుల నాకర్షించుకొను శక్తి గల వస్తువులను అయస్కాంతము లందురు. కొన్ని సముద్రములలో నయస్కాంతపర్వతము లున్నవి. ఇనుపమేకులు, సెమ్ములు పెట్టి కఱ్ఱలను జోడించి, బిగించి నౌకలు నిర్మించినచో, నట్టినౌకలు అయస్కాంతపర్వతములను సమీపించినప్పుడు బలవత్తరమైన కాంతాకర్షణకు లోబడి, ఇనుపమేకులు, సెమ్ములు పట్లు సడలి "రంయి"మని సుడిగుండమున బడినట్లత్యుత వేగముతో నా పర్వతశిలలం జేరి యంటుకొనిపోవును. నౌక చెక్కలు ముక్కలునై పడవలోని వారు జలవన్మరణము నొందుదురు. అట్టి ప్రమాదము రాకుండ నౌకలకు ఇనుపమేకులు వేయరాదని ప్రాచీనకవులును, శిల్పులును స్పష్టముగా నెఱుగజేసి యున్నారు.

"న సింధుగద్యార్పితలోహబంధం
తల్లోహకాంతైః క్రియతే హి లోహం
విపద్యతే తేన జలేషు నౌకా
గుణేన బంధం నిజగాద భోజః"

మహాసముద్రములపై యానము చేయబోవు నౌకలలో నినుపబంధనములు చేయరాదు. మరి యే యితరబంధనమైనా వాడవలెనుగాని, ఇనుపమేకులు, సెమ్ములు మాత్రము వాడవలదు—వల దని భోజు డను శిల్పి శాసించి వ్రాసినాడు.

తెనుగుసారస్వతములో దండిదశకుమారచరిత్రలో నయస్కాంతశక్తి యుటంకింపబడినది. ఆంధ్రభాగవతము, దశమస్కంధము పూర్వభాగములో (౧౫౨౦) నక్రూరుడు ధృతరాష్ట్రునకు హిత ముపదేశించినపుడు ధృతరాష్ట్రుడు తన మన స్సతిచపల మనియు, స్థైర్య మేమియు లే దనియు ప్రత్యుత్తర మిచ్చుపట్టున, విద్యుత్కాంతశక్తులనుగూర్చిన యుల్లేఖ మున్నది.

"నీమాట మంచిది, నిశ్చయమగు నైన
నస్థిరంబైన నా యంతరంగ
మందు నిల్వదు సుదామాచలస్ఫటికశి
లాతలోద్యత్తటిల్లతికభంగి."

సుదామాచల మను కొండ అయస్కాంతశిలామయ మని వ్యాఖ్యానము కలదు. మెఱుపే చంచలము. కాంతశిలమీద మెఱుపు మఱియు చపలము. స్థైర్య మేమియు లే దనుటకీ యుపమానము గూర్పబడినది.

ఆకాశమునందు మెఱుపుల విద్యుత్తు, భూమిమీద యంత్రాదిసాధనములచేత నుత్పత్తిచేసిన విద్యుత్తు ఒక్కటే కాని వేరుకావని బెంజమిన్ ఫ్రాంక్లిన్ చెప్పవఱకు పడమటివా రెఱుగరు. కాని ఉపనిషత్కాలమునాడే మనవా రెఱుగుదురు.

## ఏయే పదార్థము లెట్లు చేరి నీరు ఏర్పడినది? (Composition of Water)

తైత్తిరీయోపనిషత్తులో నీటి రచన ఇట్లు వివరింపబడినది: "అగ్నిః పూర్వరూపం, ఆదిత్య ఉత్తర రూపమ్, వైద్యుత స్సంధానం, ఆప స్సంధిః". నేడు హైడ్రోజన్ అని పిలువబడు వాయువు మండునపుడా జ్వాల మూడువేలడిగ్రీల వేడి గలిగి యుండునని తెలుపుచున్నారు. ఆ జ్వాల 'అగ్ని'యనియో, దాని

పూర్వరూపము *Unburnt, free hydrogen gas.* దీనినే మనవారు అగ్ని పూర్వరూప మనిరి. మనము ప్రతి నాలుగు సెకెండ్ల కాలములో బొగ్గుపులుసు గాలి విడుచుచున్నాము. ఆ విషగాలిని వృక్షజీవులు సూర్యరశ్మి సమక్షమున విభజించి బొగ్గుధాతువును తీసుకొని తమ శరీరనిర్మాణము గావించుకొనుచు ఒక వాయువును వెలువరుచుచున్నవి. దానిని పడమటివారు *Oxygen* అనుచున్నారు. సూర్యరశ్మిప్రసరణఫలితముగా విడివడు నీ వాయువును మన పూర్వులు 'ఆదిత్య ఉత్తర రూప'మనిరి. ఈ రెండు వాయువులకు 'వైద్యుత స్పంధానమ్' అనగా విద్యుత్సమక్షమున సమావేశమయినపుడు 'అప స్పంధిః' అనగా నీరు ఏర్పడుచున్నది. నీటియొక్క రచన ఇట్లు స్పష్టముగా తెలుపుచు, విద్యుచ్ఛక్తిసంధానమువలన నీ వాయువులు రెండింటి సమ్మేళనముచే జలమేర్పడుచున్న దనుటచే విద్యుద్విజ్ఞానము వారికి కలదనక తప్పదు.

## అన్న మాదిత్యమయము

## (Photo synthesis. Sun, the source of all energy)

ఇపుడు హైస్కూళ్లలో చదువు బాలబాలికలకు సూర్యరశ్మిమూలముగా వృక్షజీవు లెట్లు పచ్చని పసరు (*Chlorophyll*) గల యాకుల సత్పృత్తిచేసికొని పిదప పువ్వులు పూసి, కాయలు కాచి పండ్లు పంటలు ఎట్లు పండించి యిచ్చుచున్నవో శాస్త్రపాఠములలో చేర్చుకొనుచున్నారు. సూర్యరశ్మితో వాతావరణ వాయువులు కూడి పనిచేసి పచ్చని పసరు గల ఆకుల నుత్పత్తిచేసి పిమ్మట పంటలు పండ్లు పండించును అను విషయము వేదఋషులు వైజ్ఞానికదృష్టితో ఎరిగినదే కాని క్రొత్తది కాదు.

"అర్క మభితో విభ్రశే బృహద్ధస్థా భువనే ష్వంతః...పవమానో హరిత ఆవివేశ"

(ఋ. ౮ : ౯౦-౧౪)

ధర్మరాజు తమ్ములతో నరణ్యవాసము చేయునప్పుడు తనతో నరణ్యమునకు వచ్చినవారికి భోజన సదుపాయ మెట్లు చేయగల నని శోకించి మూర్ఛపోగా శౌనకుడు దుఃఖోపశమనము చేసి యిట్లుపదేశించెను:

"కమలబాంధవుం డుత్తరాయణగతుండై యూర్ధ్వ రసంబు పరిగ్రహించి దక్షిణాయనగతిం బర్జన్యభూతుండై రోహపథులం బడసి రాత్రులందు చంద్రకిరణామృతంబువం జేసి వానిం దడుపుచు వర్ధించి యం దన్నంబు పుట్టించుటం జేసి యన్నం బాదిత్య మని యెఱింగి సూర్యు నారాధింపుము." (అరణ్య ౧-౩౯)

## వర్షాగమవిశేషములు, శీతోష్ణపరిస్థితులు మొదలగునవి

## (South - west and North - east Monsoons : Metereology)

జ్యేష్ఠానక్షత్రయుక్తమైన పున్నమ గల జ్యేష్ఠ మాసమునందు సూర్యాస్తమయము కాగానే తూర్పున నింద్రదైవత్యమైన జ్యేష్ఠ యుదయించగా, ఆ నక్షత్రమునకు ప్రతిస్పర్ధియైన (*Diametrically opposite*) మృగశిర యస్తమించును. వృత్రుడు మాయామృగశిరస్కుడు. అంతవఱకు వఱపుచే ప్రజలం బీడించిన యా రక్కసుని జంపి ఇంద్రుడు వర్షప్రదానముచే లోకములం దనుపు ననుటకు శాస్త్రరీత్యా మృగశిరాజ్యేష్ఠలు ఎదురుచుక్కలగుటే కారణము. ఈ వర్ష మేఘగమన విశేషములను మేఘసందేశకావ్యమున కాళిదాసు వర్ణించియున్నాడు. ఆ కావ్యమున కాంధ్రీకరణము లెన్నియో బయలుదేరినవి. ఉత్తరకాలో యీ వర్షమేఘము లుత్తరమార్గగమనము చాలించి, రొద్దుచేరిన తటాకపు తరంగములవలెనే మరలి, ఈశాన్యమునుండి నైరుతిదిశకు బోవుచు నమితముగా వర్షించును. దీనినే శాస్త్రజ్ఞులు *North - east Monsoon* అనుచుందురు. దీని గమనవిశేషములను శ్రీనాథుడు శివరాత్రిమాహాత్మ్యమున నెంతో చక్కగా వర్ణించినాడు (౪-౨౪, ౨౫):

"ఘనదకుద్ధాంతకాంతాపయోధరభార
సంవ్యానపల్లవస్రంసనములు
కైలాసగిరికూటకల్పద్రుమాటవీ
కుసుమగుచ్ఛరజోవగుంఠనములు

చంద్రభాగాసరిత్సలిలవీచీకుటా
క్రేంకోలికాకేళిరింఖణములు
రాధాపురీహర్మ్యరత్నహేమ గవాక్ష
సంవేశవక్రీకృతాపౌష్ఠరములు
వలనుగా జంపకారణ్యవాటి దరిసి
కాశి దొరసి కళింగాంధ్రదేశసరణి
దక్షిణము సాగను సపాదలక్ష శైల
కటకబంధుడు దిగ్గిశాగంధవహుడు."

"చలి ప్రవేశించు నాగులచవితినాడు
మెఱయు వేసవి రథసప్తమీదినమున
వచ్చు సీతు ప్రవేశించు హెచ్చు పెరిగి
మార్గశిరపౌషమాసాల మధ్యవేళ."

"ఇనుడు కోదండరాశిమీఁ దెక్కు వేళ
నిత్యకోదండపల్లి యెక్కెడు మగండు
సనదవేదండసమమహాసత్త్వుఁడయ్యు
జనుడు కోదండమును బోలె తనువు వంచు."

## సంతానోత్పత్తి - ప్రజావృద్ధిశాస్త్రము
## (Eugenics)

జ్యేష్ఠమాసము గడచినతరువాత వచ్చునది ఆషాఢమాసము. ఆ మాసమునందు సూర్యాస్తమానము కాగానే తూర్పున నాషాఢానక్షత్రము ఉదయమగును. మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢపాదము—ఇది ధనుస్సురాశి. ఈ నక్షత్రముల యాకారము అలుగుతో నున్న వింటిరూపమును సూచించును. ఈ రాశిని ధన్వి యనియు, మన్మథుఁ డనియు వేదపురాణవాఙ్మయము తెలుపుచున్నది. ఇంద్రుడు వృత్రాసురుని సంహరించి, వర్షప్రదానముచే లోకమును తనిపినపిదప, స్త్రీపురుషుల కన్యోన్యసమాగమకాంక్ష యుదయించును. ఆషాఢా నక్షత్రము ఉదయించునపుడే యిట్టి కాంక్ష లుదయించుటకు కారణముగా ధన్వియే యిట్టి తలంపుల బుట్టించు నని యీ చుక్కలకు మన్మథునితో సంబంధము కలిపి ముడిపెట్టిరి. అంతవఱకు నెనిమిది నెలల కాలము ఏకాంతవాసము సలుపుచు భార్యకు దూరమై యుండిన యక్షుడు ఆషాఢప్రథమదివసమున మేఘమును చూడగానే భార్యను గూర్చి చింతించి, మేఘము ద్వారా నామెకు కబురంపుటే మేఘసందేశకావ్యము. మంచివర్షము కురిసిననాటి హోరు మను కప్పలరొద స్త్రీపురుషమండూకవరణసంభ్రమ ఫలిత మని జీవశాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. కప్ప మొదలు కమలగర్భుని వఱకును ప్రేమకాంక్ష లుద్వేగ లూరించు కాల మది. "ఆబ్రహ్మకటాంత మిదం నిబద్ధమ్, స్త్రీపుంప్రయోగేన జగత్సమస్తమ్" అను ప్రకృతిసత్య మీ దినములలో చక్కగా బుజువగుచున్నది. స్త్రీపురుషు లన్యోన్యప్రేమవశు లయినందుకు ఫలితము సత్సంతానము కావలయును. మానవజాతి యభివృద్ధి నొందుటకు సత్సంతతి యావశ్యకము. ఒక మిథునమునకు జనించు శిశువుయొక్క మనశ్శరీరలక్షణము లన్నియు గర్భధారణసమయమునందు వాని జననీజనకుల మనశ్శరీరస్థితులనుబట్టి నిర్ణయింపబడును. విశిష్టలక్షణములు గల పురుషశిశువుగాని, స్త్రీశిశువుగాని జన్మింపవలె నన్నచో జననీజనకులు కొన్ని నియమములను జాగ్రతగా ననుసరింపవలెను. లేకున్న ప్రమాదించును. ఇందుకు భారతకథలో ధృతరాష్ట్ర పాండురాజుల జననము దృష్టమైన యుదాహరణము (ఆది. ౪-౨౫౦, ౨౫౪). "ధనశేక్షణయగు నంబిక సుతజన్మము కాంక్షించి విమలశయనతలంబున నుండ వ్యాసు డవసరజ్ఞుడై యేతెంచె. ఆ తపస్వి కపిలగడ్డంబును, కపిలజడలను, కపిలకన్నులను, దవిలయున్న నల్లనైన దీర్ఘదేహమును జూచి భయమున నామె గన్నులు గవ మొగిచి తెలియకయుండె. కృష్ణద్వైపాయనుండును దానికిం బుత్రదానంబు జేసి యీయంబిక యందు బలపరాక్రమసంపన్నుడైన కొడుకు పుట్టువాడు. మాతృదోషంబున నంధుండగు నని... ఎప్పటియట్ల నమ్మునివరుండు నంబాలికకడకుం జనిన నదియును నమ్మునివికృతవేషంబునకు నెఱచి వెల్లనై యున్న నక్కోమలికిం బుత్రదానంబుసేసి యీ యంబాలిక యందు మహాబలపరాక్రమశాలి గుణవంతుడు వంశకరుడు నైన సుపుత్రుండు పుట్టు; వాడును మాతృదోషంబున పాండుదేహుం డగునని ముని యరిగిన."

వంశమునకును, జాతికిని భూషణము లనదగు సత్పుత్ర పుత్రికా సంతానలాభము బడయుటకు ఈ

శాస్త్రజ్ఞానముతో విశేషప్రయత్న మవసరము. ఈ శాస్త్రము నీసడింపరాదు. ఏజాతియొక్క ఔన్నత్య మైనను సత్సంతానలాభముపై నాధారపడియుండును.

ఒక్క మానవుల మాటయే కాదు. పశు పక్షి వృక్షతృణధాన్యాదుల మేటియభివృద్ధికి విజ్ఞానసిద్ధమైన బీజలాభమును,సుక్షేత్రముల నిక్షేపించుటయు నవసరము. ఈశాస్త్రము పడమటిదేశములలో చక్కగా వృద్ధి పొందినది. ఈ జీవశాస్త్రసంబంధమైన రచన మొకటి నన్నయ రచించిన భారతభాగమునుండి యీక్రింద వ్రాయుచున్నాను: (ఆది ౩-౨౨౦) "మఱియు గర్భ యోనియందు ఋతుపుష్పరససంయుక్తంబగుచు రేతంబు గాడ్పుచేతం బ్రేరితంబయి గలసిన నందు బంచతన్మాత్రలు పొడమి, క్రమంబున నవయవంబు లేర్పడి, లబ్ధజీవులై యుద్భవిల్లి శ్రోత్రంబుల శబ్దంబును, నేత్రంబుల రూపంబును, ఘ్రాణంబున గంధంబును, జిహ్వను రసంబును, దృక్కున స్పర్శంబును, మనంబున సర్వంబును నెఱుంగుచుండును"...

## ఆయుర్వృద్ధికరమైన ఆరోగ్యమార్గము (Hygjene)

"ఆలస్యం బొకయింత లేదు శుచి యా
హారంబు నిత్యక్రియా
జాలం బేమఱ మర్చనీయు లతిథుల్
సత్యంబ పల్కంబడున్
మేలై శాంతియు బ్రహ్మచర్యమును నై
మిత్త్రం దాల్తు మట్లౌట నే
కాలంబున్ బటురోగ మృత్యు
భయశంకం బొంద మే మెన్నడున్."

(అరణ్య ౪-౧౯౩)

ఇది ఎఱ్ఱాప్రెగ్గడ రచించినభారతభాగములోనిది. తార్క్ష్యుడను ఋషి యాశ్రమములో నిత్యము ననుసరింపబడిన కార్యవిధాన మిందు వర్ణింపబడినది. ఈ శేషదినములలో నతిథిపూజ సంగతి యెట్లున్నను మిగిలిన కార్యక్రమ మిందు తెలిపినట్లు ప్రతిగృహము నందును ప్రతివారిచే నవలంబింపబడినయెడల రోగశంక లేక ఎల్లవారు నారోగ్యవంతులును, దీర్ఘాయువు లగుదురని ఘంటాపథముగా చెప్పగలను.

## జ్యోతిశ్శాస్త్రము (Astronomy)

శాస్త్రము లన్నిటిలో నిది ప్రథమము; అనంతము. వేదపురాణవాఙ్మయమునందలి దేవతలందరు నక్షత్రాధిదేవతలు; నక్షత్రరూపులు. ధ్రువచరిత్ర, గజేంద్రమోక్షము, వసుచరిత్ర లోనగు పురాణకథ లన్నియు జ్యోతిర్లోకమున నక్షత్రాక్షరములతో విరాజిల్లుచున్నవి. మహాభారతకథ సంపూర్ణవివరములలో ఖగోళమున చిత్రింపబడియున్నది. ఔశీనరుడగు శిబిచక్రవర్తికథ తులారాశికథ. విశాఖ ఇంద్రాగ్నిదైవత్యము; తులారాశిలోనిది. తులపైనున్న కన్య తులజ. తులజాపురమున ప్రతిష్ఠింపబడి శివాజీకి ఖడ్గమిచ్చిన భవాని తులజయే. భవాని సింహముపై నుండును. కనుక నామెకు సింహమే వాహనము. సింహమే ధ్వజము. దసరాఉత్సవములలో దుర్గానామముతో నీమెనే పూజింతుము. ఈమె దుర్గ; భవాని; భద్రకాళి. అంతేకాదు.-క్రైస్తవమతస్థాపకుడగు ఏసుక్రీస్తుతల్లి మేరీకన్య (*Virgin Mary*) కూడ ఈమెయే. ఈసంగతి ఇటాలి పరిశోధకులు తెలుపుట ఆశ్చర్యము కాదు. ఐదువందల యేండ్లక్రిందట మహా శ్రీనాథకవిసార్వభౌముడు శివరాత్రిమాహాత్మ్యము (౧౩-౯౫)లో నిట్లు వ్రాయుట విశేషములలో కెల్ల గొప్పవిశేష మనిపించినది—

"ప్రతిథ సతతంబు గొల్తు రాభద్రకాళి
జగతి నేబదియారు దేశములవారు
దశదినంబులు సింహకేతనము నిల్పి
హూణభూమికి దైవ మీ యుత్పలాక్షి."

క్రైస్తవుల మేరీకన్య (*Virgin Mary*) ఈ కన్యారాశియే. భారతీయుల భద్రకాళి యీ కన్యారాశియే. మహాభారతమునందలి ద్రౌపదికూడ ఈ కన్యారాశియే.

ద్రౌపది అగ్నికుండసముద్భవ; అయోనిజ. ఇంద్రాగ్నిదైవత్యమై గుంద్రని యాకారము గల విశాఖ అగ్నిగుండము. అదైది కన్యారూపము. కనుక

కన్య అగ్నికుండసముద్భవ, అయోనిజ యనుట సమంజసము. ఆకాశమున తిరుగు మత్స్యయంత్రమును కొట్టిన వీరుని పెండ్లాడుటకు నిర్ణయము. ఉత్తరఫల్గుని యజ్ఞసేనకు నక్షత్రము. తూర్పున నుత్తరఫల్గుని ఉదయము కాగానే పడమట పెట్టరయెదుట మీనరాశి యస్తమించును. వెంటనే రంగమున కన్యారాశి పొడమును. ద్రౌపదిస్వయంవరము ఫాల్గునమాసమున నష్టమీరోహిణి నాడు; ఒక వధానంతరము కొన్నిరోజులకు పాంచాల దేశమునుండి వచ్చిన బ్రాహ్మణుడు నాటికి ౭౫ దినమున స్వయంవరము జరుగునని తెలిపెను. ఇది నన్నయరచితమైన తెనుగు భారతమందు గలదు. సంస్కృతమూలమున నేను చూచినంతవఱకు లేదు. జ్యోతిర్విద్యయం దుద్దండ పండితుండగు నన్నయభట్టు సంస్కృతమూలమున లేని ఖగోళవిజ్ఞానమును బ్రకాశింపజేసె, ౭౫ వనా డను దినసంఖ్యను, అష్టమి, రోహిణి యను తిథినక్షత్ర వివరములను తెనుగుభారతమున చేర్చినాడు. ప్రతి సంవత్సరమును ఫాల్గునశుక్లాష్టమీ రోహిణీనాడు సూర్యాస్తమానసమయానంతరము మత్స్యయంత్రభేదనములో ద్రౌపదిస్వయంవరనాటకము నక్షత్రపాత్రలతో ఖగోళమున ప్రదర్శితము. ఇట్టి యద్భుతవివరములం జేర్చి తెనుగున భారతకథ పెంచి యాంధ్రీకరించుట సంహితాభ్యాసుడును, బ్రహ్మాండాదినానాపురాణ విజ్ఞాననిరతుడును నగు నన్నపార్యునకే చెల్లినది.

మీనరాశిలో రెండుచేప లున్నవి. చేపలమధ్య మెలికలు గల గొలుసురూపము మెఱయుచు ఖగోళమున దిక్కుగా కనబడును. ఈ గొలుసురూపమునే వేదము వరుణపాశ మని వర్ణించుచున్నది. సంస్కృతమున నైషధము వ్రాసిన శ్రీహర్షుడు నలదమయంతుల వివాహానంతరము వారి ననుచునపుడు దమయంతి తండ్రి తన రాజ్యావధివఱకు వెంటవచ్చి నలుని కౌగలించుకొని వీడ్కొల్పినపుడు వరుణరాజు సంతోషించి తలయూపగా నతని చేతిపాశముకూడ నూగెనని వర్ణించి యున్నాడు.

శ్రీనాథుడు తెనుగుశృంగారనైషధమున నీ వర్ణన రమ్యముగా మార్చి మేలు మేలని మెచ్చునట్లే క్రిందివిధమున మెఱుగుపెట్టినాడు: మన దేశములో స్త్రీలు బంగారుగొలుసులతో బంగారుచేపరూపము గల "చేపబావిలీలు", "మత్స్యపుబావిలీలు" అనబడు స్వర్ణభూషణములను కర్ణభూషణములుగా ధరించుట ఆచారమై యున్నది. ఈయంశము మనమున నిడికొని యీ పద్య మన్వయించుకోవలసి యున్నది.

"అధికమారమగుట నాకాశలక్ష్మికి
కర్ణపాశమగుచు గరము వొలిచె
దివ్యభవ్యకాంతి దేదీప్యమానమై
పాశపాణిపాణిపాశవల్లి" (శృం. నై. ౭-33)

మీనరాశిలోని చేపల మధ్య వరుణపాశము మెలికలుతిరిగి, ఆకాశలక్ష్మి యను స్త్రీ చెవుల నలంకరించు చేపబావిలీలవలె ప్రకాశించినదట. ఖగోళమున నీదృశ్యమును బాగుగా గమనించి స్త్రీసౌందర్యాలంకారవిషయములను నేర్పుగా వర్ణింపగల శ్రీనాథకవిసార్వభౌమునికే ఈపద్యము రచింపజెల్లినది. ఇక్కడ నొక్కసంగతి మనవిచేయక తీరదు. కుక్క అనగా శునకము అని యీతీరున నిఘంటుపదముల కర్థములు చెప్పుకొనుచుపోయి కావ్యముల చదువువారి కీసొగసులు బోధపడవు. విజ్ఞానవివేకముతో వీనిని సమన్వయించుకొనవలెను. అందుకు విశేషప్రయత్న మవసరము. నన్నయరచనలలో మరికొన్ని జ్యోతిశ్శాస్త్రరత్నములను పరిశీలింతము.

విష్ణుపాదాంగుష్ఠనిష్ఠ్యూతయైన దివిజగంగాప్రవాహమువలె భారతకథాప్రవాహము కృష్ణద్వైపాయనమునివలన జన్మమునబడసి ముల్లోకముల దనిపిన దనుటలో ఆకాశమున *Milky Way* వర్ణింపబడినది.

సంవత్సరాత్మకమైన కాలచక్రమునకు 3౬0 కీలులు గలవని వేదములో దీర్ఘతముడు వర్ణించెను. దినమున కొక 'డిగ్రీ' చొప్పున నిండు 3౬0 డిగ్రీలు కలవు. చక్రార్ధమున ౧౮౦; తురీయమున ౯౦ డిగ్రీలు కలవు. ౯౦ డిగ్రీలు గల సరికోణమును *right angle* అందురు. ఈ పునాదిపైనే ప్రాకృతిచీగణితసౌధము నిర్మింపబడినది. అహోరాత్ర, పక్ష, మాస, ఋతు, రాశిసంజ్ఞకమైన

కాలచక్రమును ఉదంకుడు దర్శించినట్లు భారతమున గలదు. (ఆది. ౧-౧౧౯)

"సితకృష్ణతంతురాజితతంత్రి మది యహో
రాత్రముల్ ద్వాదశారములు గలుగు
చక్రంబు మాసాత్మ సంవత్సరంబు గు
మారు లయ్యార్వురు మరియు ఋతువులు..."

ఇందు ద్వాదశారచక్రము మాససంజ్ఞకము, రాశి సంజ్ఞకమును నగుచున్నది. కన్యరాశి ద్రౌపది యని వ్రాసితిమి. కన్య ద్రౌపది యంటిమి. ఆమె పంచ పాండవులకు పత్ని యగుటకు హేతు విది: కన్య చుట్టును ౧. మఘ, ౨. ఉత్తర, ౩. స్వాతి, ౪. ౫. అశ్వతరమండలమునం దున్న పెఱపెడి చుక్కల జత. ఇందు మఘ పితృదేవతాకము. పితరుల రాజు యముడు; యమునంశమున ధర్మరాజు జనించెను. ఉత్తర ఫల్గుని యర్జునుడు. వాయుదైవత్యమైన స్వాతి భీముడు. అశ్వతరమండలమున జంటచుక్కలు (*Alpha and Beta centaurus*) అశ్వినులు. వారి యంశమున నకులసహదేవులు. తేజోవంతములైన యీయైదు నక్షత్రములమధ్య 'పంచపర్వతముల నడుమ నదియుం బోలె' కన్యరాశి ద్రౌపది యుండి యీ యైదుగు రకు ధర్మపత్ని యైనది. పంచేంద్రియములు విషయ రతిం బరిగ్రహించునట్లు, పంచపాండవు లామెను పరిగ్రహించి రని భారతము తెలుపుచున్నది.

పావులూరి మల్లన గణితమువంటి గ్రంథము లరుదుగా నున్నవి. పశుశాస్త్రము, అశ్వశాస్త్రము, రత్నపరీక్ష మొదలగు శాస్త్రగ్రంథములు కొలదిగా గలవు. బ్రిటిష్‌ప్రభుత్వమునందు పాశ్చాత్యవిద్యల జేర్చిన పట్టభద్రులు తెనుగున ప్రత్యేకముగా శాస్త్ర గ్రంథములు వ్రాయ నారంభించిరి. కీ. శే. ఆచంట సాంఖ్యాయనశర్మగారి 'రహస్యదర్పణము' క్రిమికీటక జంతు జీవనముల వివరించు శాస్త్రగ్రంథము. రెంటాల వెంకటసుబ్బారావుగారి 'మర్మశాస్త్రము' చక్కని శాస్త్రీయగ్రంథము. పిమ్మట విజ్ఞానచంద్రికామండలిని స్థాపించి కీ. శే. లక్ష్మణరావుగారు జీవశాస్త్రాది గ్రంథములను వ్రాయించి ప్రకటించిరి. కీ. శే. పానుగంటి రామారాయణింగారు, ఆంధ్రవిశ్వవిద్యాలయము వారు, మద్రాసువిశ్వవిద్యాలయంవారు బహుమాన స్పర్ధ పెంచి వైజ్ఞానికగ్రంథములు వ్రాయించుచున్నారు. అవి *Dry Bones of Science*. ఎముకలు దుమ్ములవలె ఆకర్షణీయముగా లేవు. రసవద్రచనలు గావు. ఇంగ్లీషుభాషలో ***Darwin, Huxley Tyudall, Spencer, Lodge, Jeans*** మొదలగు వైజ్ఞానికోత్తముల గ్రంథములు రసవంతములై భాషాసారస్వతమున కలంకారప్రాయములై యొప్పుచున్నవి. రసవత్తరములైన వైజ్ఞానికగ్రంథములు చదువుకొను భాగ్య మాంధ్రలోకమున కెప్పుడు గలుగునో? ఏమనగా మనవారికి విజ్ఞానమునం దాదరము తక్కువ. ఆ పేరి మాసపత్రిక కొన్నాళ్లునడిపి బ్రహ్మశ్రీ కాశీపట్నపు కొండయ్యగారు తగు ప్రోత్సాహము లేక తుదకు పత్రికాప్రకటన మానుకొనిరి. విజ్ఞానవిషయములను ప్రత్యేకము ప్రచురించి వ్యాపింపజేయుటకు వార పత్రికలు, మాసపత్రికల యవసర మెంతైన కలదు. ఇప్పటికే మన మన్ని విషయములందును చాల వెనుక బడియున్నాము. ఇంకను వెనుకబడిన మన కధో గతియే ప్రాప్తమగును.



# హైందవకళ - అందలి పరిభాష సంప్రదాయాలు

శ్రీ ఆమంచర్ల గోపాలరావు

అనుక్షణం మనం ప్రకృతిని గమనించుటచేసి, వస్తుసంతతుల ననుకరించు ఊహాలు మనలో నుదయించి, వాటికి సంబంధించిన భావనలు మనలో ఏర్పడుతా యనీ, ఈ భావనలకూ, తత్సంబంధమయిన వస్తుసంతతులకూ గల సంబంధముల ననుసరించి, సంజ్ఞావిధానమయిన ఒక నిశ్చితపరిభాష ఏర్పడుతుం దనీ, ఈ పరిభాషే ఒక పద్ధతిన కళలో వివిధరూపములను, తత్సంకలనాదులను అర్థంచేసుకోవడానికి ఒక నిర్దేశిత నిఘంటు వవుతుం దనీ, ఈ పరిభాషమూలంగానే రూపకల్పనల కందని అనేకఉత్తమభావనలను కళలో అతిస్పష్టంగా, సరసంగా ప్రదర్శింప వీలవుతుం దనీ తొలుదొల్తనే అన్నాను. సూక్ష్మదృష్టిన ప్రకృతిని వీక్షించి, తదంతర్భావములను, మహాశక్తులను గుర్తించి, రసవంతంగా ప్రదర్శించడమే పరమావధిగా గొన్న మన హైందఃకళయందు ఈ పరిభాష అత్యవసరమైన ఒక ముఖ్యాంగముగా పరిణమించింది. రూపభేదమునకే గాక, చిత్రమునకు లయ నిచ్చు అంతశ్శక్తులను, అంతర్భావములను కళాకర్త ఉద్దేశించినరీతి వ్యక్తపరచుటకు ఈ పరిభాష పూర్తిగా తోడ్పడింది.

మానవు డీనాటివరకూ ఎరుగగలిగిన సర్వభావభావనలను, అంతర్భావములను, మహాశక్తులను సారూప్యంగా, రసవంతంగా ప్రదర్శించిన హిందూకళయందు ఈ పరిభాష అతివిశాలమై, స్పష్టమై నిర్వచనీయమయిన ఒక నిశ్చితగతి నందికొని, ఒక పరిపూర్ణ భాషారూపం వహించింది. సంపూర్ణ సంస్కృతి నంది నిశ్చితమయిన ఈ పరిభాష సర్వస్వం ఒక్కనాటిలో తయారవలేదు. అనేక ఉత్తమకళాకర్తలు, మతకర్తలు, కవులు, భాష్యకారుల ప్రబలకృషి ఈ మహాశిల్పభాష.

క్రీస్తుశకం ఆరు ఏడు శతాబ్దములకు ఈ శిల్పభాష ఒక సంపూర్ణత నందికొని, పరిపక్వమై, ఒక ప్రత్యేకత వహించిందని చెప్పవచ్చు. ఏలనన, ఆనాటికి మన శిల్పమున కొక గభీరత, క్రమం, నిశ్చితగతీ ఏర్పడడమేగాక, ఈ శిల్పభాషను పరిపూర్ణంగా నిర్వచిస్తూ అనేకఉద్గ్రంథాలు రచనల నందికొన్నవి. ఈ మహాగ్రంథాలు మన పురాతన వైదికసంప్రదాయమునకు చెందినవేగాక, బౌద్ధ, జైన, మరి అనేక ఇతర సంప్రదాయములకుకూడ చెందిన వయి యున్నవి. అవన్నీ మన కందక కొన్నిమాత్రమే నిలచినందుకు మన దురదృష్టమే కారణం అని చెప్పవలసియున్నది.

శిల్పగతి ఒక క్రమం అందుకొన్నందువల్లనూ, ఈ శిల్పభాషావాచకము లనేకము లుత్పన్నములైనందువల్లనూ ఈ శిల్పభాషాభివృద్ధి ఆనాటితో ఆగిందనడానికి వీలులేదు. నేటివరకూ అనేకమహాపురుషులు, కళాకోవిదులు, మతకర్తలు, భాష్యకారులు నూతనాంశముల నెన్నింటినో వ్యక్తపరుస్తూ, అనేకనవ్యచిహ్నకల్పనాకారకులై, ఈ దివ్యభాషాభివృద్ధి

---

* హైందవకళావిశేషములనుగురించి 'దర్శని' అను శీర్షికతో ఈవ్యాసకర్తవే ఇదివరలో కొన్ని వ్యాసములను భారతిలో ప్రకటించి యున్నాము. ఆవరుసలోనే మరి కొన్ని వ్యాసములను ఇది మొదలుగా ప్రకటింపదలచినాము. —సం. భారతి.

కారణభూతులయిన మన్నారనుటలో ఏ సందేహం కాని, అతిశయోక్తి గాని లేదు. అంచేత నిర్ణయపరిమితి లేని ఈ మహాశిల్పభాష అన్ని ఉత్తమభాషలవలెనే అపారమై ఏకగతి నిర్వచనకు వీలులేని మహాసాగరరూపం వహించింది. అయినప్పటికీ, ఆనాటికి అనగా క్రీస్తుశకం ఏనవశతాబ్దానికి ఈ శిల్పభాష కొక స్థిరం, ఆకారం, పరిపూర్ణత ఏర్పడి, ఒక ప్రత్యేక విశిష్టత కలిగిందనే చెప్పవచ్చు.

కాని, కాలమందు ఆది అంతు లేని ఈ అపార శిల్పభాషావాహిని అంకురం ఏనాడో మనం ఊహించలేము. ఏలనన, నిజంగా మానవునితోనే జన్మించినది కళ: జన్మాదిగా కళాకల్పనలందు భావనిర్దేశములకై సంజ్ఞలకొరకు, చిహ్నములకొరకూ మానవకృషి స్పష్టంగానె ఉంది.

మన దేశమందు నాగరకత పునాదులు మొహెంజోదారో, హరప్పలందు వెలువడిన పురాతన నగరముల నాటినుంచి లెక్కపెట్టవచ్చునని అనేక పండితుల అభిప్రాయం. ఆనగరములు బహుశా అయిదువేల సంవత్సరముల నాటివని మహాపండితుల నిర్వచన. ఆనాటికే మన దేశమందు శిల్పకళాకౌశలము ఒక ఉచ్చస్థాయి నందుకొన్నట్లూ, కళాకల్పనలందు సంజ్ఞాచిహ్నముల వాడుక పరిపాటియైనట్లూ, అక్కడ వెలువడిన శిల్పచిత్రములు స్పష్టంగా తెలుపుచున్నవి.

నగరములందు ఆనాడు వసతిగృహములు ఇటుకలతో నిర్మించారు; చేతిపనులందు ఉన్నత కౌశలము వ్యక్తపరచు సువర్ణాలంకారములూ, నాణెములూ ఇందు వెలువడినవి. ఇంతేగాక నేటివరకు చెక్కుచెదరకుండా నిలువగలిగిన అత్యుత్తమ శిల్పచాతుర్యమును చాటు మూర్తులు, ముద్రలు ఇందు దొరికినవి. వీటినిగురించి ఈ నగరచరిత్రను వెలికితీసిన పండిత మార్షల్ గారి వాక్యములు కొంత గమనింపవలెను: "వీటిలో ముఖ్యమయిన శిల్పములందలి శిల్పవికాస పరిధి విశాలమైనది; రూపకనిర్దేశమందలి కౌశలము, భావోద్రేకములను స్పష్టపరచు రేఖాగతి, శిల్పమందలి లావణ్యము, ఆనాటి ఇరాక్, ఈజిప్టు, మెసొపొటేమియా శిల్పములందెందునూ కానరాదు." ఇచట కానవచ్చిన శిల్పములందు దేవీమూర్తులెన్నో కలవు. వృషభము, గజము, ఖడ్గమృగము మొదలయినవి ఈవాటికినీ, మనం ఎరిగిన జంతురూపశిల్పము లెన్నో ఇచట కానవచ్చినవి. ఇంతేగాక అనేక పడగల నాగసర్పములు, మానవశిరస్సుపై నాట్య మొనరించుచున్నట్లు చిత్రించిన శిల్పము లెన్నో ఇచట దొరకినవి.

ఇక్కడ దొరకిన శిల్పశ్రేణియందు ఒక్కచిత్రముమాత్రము పండితులందు కలవరమునకు కొంత కారణభూత మయింది. ఈ చిత్రమందు కేంద్రస్థానం వహించిన మూర్తి కూర్మాసనము దుపవిష్టుడైన ఒక యోగి. అతనికి శిరస్సులు మూడు. శిరోర్ధ్వమందు ఇరుపార్శ్వముల రెండు కొమ్ములు. ఆ యతిని పరివేష్టించిన మృగములు ఏనుగు, ఖడ్గమృగం, నీటిగుర్రం, వ్యాఘ్రం. ఇంతేగాక వినయవిధేయతలను ప్రకటిస్తూ కొందరు మానవులు ఆయనచుట్టూ నిలచి ఉన్నారు. ఆనాటితర్వాత కొన్నివందల సంవత్సరములు గడచిన పిమ్మట నిర్వచించిన పశుపతిరూపమును ఈ చిత్రం చాలవరకూ పోలివుందని ఆ పండితమార్షల్ గారే అన్నారు. ఈ చిత్రకారణంగానే మహావక్తలు కొందరు వేదరచనలు మొహెంజోదారో హరప్పల నాటికి పూర్వమే అయి ఉండవలెనను అభిప్రాయాన్ని సూచించారు. కాని పాశ్చాత్యవక్తలు ఏకారణంచేతనయితేనేమి, ఆ వాదాన్ని యింతవరకూ ఒప్పుకొనలేదు.

ఏది ఎట్లున్నప్పటికీ, ఆనాటి నాగరూపములు దేవీరూపములు, వృక్షదేవతల రూపములు, ఆ పశుపతి రూపము కళలో ఒక సంజ్ఞావిధానము ఇమిడిఉన్నట్లు సూచిస్తాయి. కాని ఆనాటి సంజ్ఞల గూఢార్థం ఇప్పటి మహాపండితులకు ఇంతవరకూ అర్థం కాని కారణంవల్ల వాటిని గురించిన చర్చ అసంభవం.

ఇంతేగాక ఈమధ్యనే నర్మదాతీరమందు శిథిలమయిన మరో నగరం కానుపించింది. ఈ నగరం బహుశా ఏబదివేల ఏండ్లక్రితం పరశురాముడు జయించిన కార్తవీర్యార్జునుని మాహిష్మతీనగరానికి తీసుకవెళుతుందని పండితాభిప్రాయం. ఇక్కడకూడ శిల్పం, చిత్రలేఖనం ఉన్నట్లు బాగా తెలియవస్తుంది. మొహెం

తోదారో, హారప్పల నాగరకత కేమీ తీసిపోని నాగరకత ఇచట వెలిసిం దని ఆర్కియాలజిస్టుల సూచన.

అందుచేత ఈ శిల్పభాషావగాహనమునకు ఆది నుంచి నేటిదాకా వెలసిన యావచ్ఛిల్పశ్రేణిని పరిశీలించుట దుర్లభం. చరిత్రాత్మకంగా మనం ఎరిగినంత వరకూ అవగాహనం చేసుకోగలిగిన శిల్పశ్రేణిని మాత్రమే అవలోకిస్తూ, తచ్ఛిల్పానుసారితంగా వెలువడిన కొన్ని మహాగ్రంథములను కొంతవరకు మాత్రమే పరిశీలింపగలుగుతాం.

కళ ఆధ్యాత్మికజీవితవిధానంవలె మహదాంతర్య స్వభావానుభావం అని మరచిపోగూడదు. అంచేత మతమందలి ఆధ్యాత్మికదృష్టి లాగే కళ మానవుని అంతరాత్మగత ద్వైతస్వభావాన్ని అనుసరించి ఏర్పడి, తదంతరాత్మ ఉద్దేశ్యమందే అంకుర మందుకొంటుం దని ముందు వ్యాసంలోనే అన్నాను. ఈ కారణంగానే కళా, మతమూ పరిసమానంగా ఒకదాని ప్రక్క నింకొకటి నడుస్తూ, కాలగతి ననుసరించి, ఒకదాని వృద్ధికి రెండవది కారణభూతం అవుతుం దనీకూడ అన్నాను. ఆపైన ఆధ్యాత్మికదృష్టివలెనే కళకూడ మహదాంతర్యస్వభావానుభావమైనందువల్ల కళలో సంప్రదాయశ్రేణీ, పరిభాషా ఏర్పడుటకు మతం చాల వరకు తోడ్పడిం దనికూడ అన్నాను.

అందుచేత ఈ మహాశిల్పభాషావగాహనకు శిల్పనిర్వచనే మూలంగా ఎన్నుకొన్న గ్రంథాలనే గాక, ఇతరమతగ్రంథములనుకూడ చాలవరకు పరిశీలించవలసి ఉంటుంది. కాని మతకర్తలు, భాష్యకారులు అనేకు లుత్పన్నమైన మన దివ్యభూమియందు ఈ గ్రంథములు అనేకములుగా వెలిసినవి. అంచేత కొన్ని ముఖ్యగ్రంథములందలి ప్రధానాంశములనుమాత్రమే మనం కొంతవరకూ గమనింపగలం.

మన దేశమందు నాగరకతాజీవితవిధానాంకురం ఏనాటిదైనను, వేదరచన నాలుగువేలసంవత్సరముల నాటిదే నని పాశ్చాత్యవక్తలు ఘంటాపథంగా వాకొనినప్పటికీ, ఆ వేదములే ఆదిరచన లని మనం స్వీకరించి, ఈ పరిభాషావిచారం సాగించవలెను. ఏలనన, మన దేశమం దుత్పన్నమయిన సర్వకళలకూ, మతాలకూ పునాదు లిందే కానవస్తాయి.

వేదరచయితలయిన మహాఋషులను అనంతమై గంభీరమైన ప్రకృతియందలి అపారమహాశక్తులు ముగ్ధులజేసి తన్మయులను చేసె ననుటకు ఏమాత్రమూ సందేహం లేదు. నిజకళాభావననే, మహానిమగ్నతతో యీ దివ్య శక్తులను వారు భావించి, భావనచేసి, రూపకల్పనల నొనర్చి వేదములందు భావించారు. నిశ్చయంగా వేద రచయితలైన యీ మహాఋషులను ఆదికళాకర్తలనే యనవలెను. ఏలనన, వేదములందు ఒక నిశ్చితమైన మును వా రారాధించుచున్నట్లు కాన్పించ దని మహా పండితులు అభిప్రాయాన్ని సూచించారు. అందుచేత ఆ మహాశక్తుల రూపవర్ణనలు, భక్తిజనితములైన వట్టి పొగడ్త వర్ణనలుగాక, నిజకళాపద్ధతిన భావనచేసిన దివ్య రూపములేనని రూఢిగా చెప్పవలెను. కాబట్టి ప్రథమావ ప్రకృతిఅంతర్యమును శోధించి, అంతశ్శక్తుల రూప భావములను వర్ణించిన వేదములు, నిజకళాపునాదు లనుటకు ఏసందేహమూ లేదు.

అనేకమతవాహినులు, వివిధకళావాహినులు అంకురమందిన ఈ వేదములగూర్చిన సంపూర్ణచర్చ నిజముగా అసాధ్యం. అంచేత మహాపండితులు వేదములందు హైందవకళాంకురములుగా సూచించిన కొన్ని అంశములనుమాత్రం ఈవ్యాసమునం దవలోకించవగును.

పృథ్వీన సకలచైతన్యములకూ, సృష్టిస్థితిలయములకూ కారణభూతంగా సూర్యశక్తిని ఋషులు భావించినట్లు స్పష్టంగా తెలియనౌతుంది. తేజోమయమైన తత్సూర్యశక్తిని వేదాలందు పలువిధాలుగా వర్ణించారు. ఉదయభానుడు మిత్రుడు; సహస్రహస్తములతో సువర్ణఛాయల తేజరిల్లు సాయంసంధ్యాభానుడు సవిత; ఇంతేగాక విష్ణువు వర్ణిస్తూ సూర్యలక్షణములనే చాలవరకు అతనికి పేర్కొన్నారు.

ఈ భావన ననుకరిస్తూ ఉత్పన్నమయిన అనేక ఇతరభావనలు వేదములందే రూపొందినవి. ఉషస్సు, అగ్ని, ఇంద్రుడు, వరుణుడు, రుద్రుడు మొదలయిన అనేకనామాలతో ఈ భావశాస్వరూపాలు వెలుగొంది

నవి. ఈ రూపాలను దేవతాస్వరూపము లనటంలో ఏ పొరపాటుకాని తప్పుకాని లేదని నే నింతకుపూర్వమే అభిప్రాయాన్ని సూచించాను.

బహుశా, క్రీస్తుకు అయిదునందల సంవత్సరములకు పూర్వం యాస్కుడను ఒక మహాపండితుడు నిరుక్తం అనే గ్రంథంలో వేదములందు వర్ణించిన దేవతాస్వరూపములనుగూర్చి చాలవరకు చర్చించాడు. ఆయనగారి చర్చ తప్పక గమనింపతగినది. "ఇక దేవతాకారచింతన : ఇవి మానవాకృతులను పోలునని ఒక అభిప్రాయం: ఏలననగా లక్షణాలను కొన్నింటిని అలా వర్ణించారుగనుక. ఇంతేగాక, కొన్ని సామాన్య వస్తువులు మానవులకూ, దేవతారూపములకూ సమానంగానే సంబంధించినవై యున్నవి. ఆపైన మానవచేష్టాస్వభావములు కొన్నిటిని ఆ దేవతారూపములు కలిగియున్నవి. ఈ రూపాలు అపురుషవిధాలని మరో అభిప్రాయం: అనగా మానవాకృతులను ఏమాత్రం పోలియుండవని. ఎందుకనగా, రోజూ మనం వీక్షించే దేవతల రూపాలు మానవాకృతుల నేమాత్రం పోలి ఉండవు: ఉదాహరణ-అగ్ని, వాయువు, ఆదిత్యుడు, పృథ్వి, చంద్రుడు ఇత్యాదులు. దేవతల రూపలక్షణాలు మానవస్వరూపలక్షణాలను ఏల పోలియుండవలెనని ప్రశ్నిస్తే, పాచికలు మొదలు నూలికలవరకూ అన్ని వస్తువులకూ ఈలక్షణములనే ఇచ్చి వర్ణించారుగదా అని సమాధానమిస్తారు. దేవతలకు మానవాంగకల్పన లేల అని తర్కించినపుడు సర్వఅచేతనములకూ అలాగే అంగకల్పనల నిచ్చారుగదా అని జవాబిస్తారు. అందుచేత నరరూపం దేవతలకు ఉండవచ్చు; లేకపోవచ్చు. రూపం లేని దేవతలు కర్మస్వరూపం, అనగా యజ్ఞమందలి కర్మరూపము నందుకొంటారు."

పై యాస్కుని చర్చవలన ఒక్కవిషయంమాత్రం స్పష్టంగా తెలియనౌతుంది. అదేదన, వేదరచయితలయిన మహాఋషులు ప్రకృతిని, సర్వవస్తుసముదాయములను నిజకళాపద్ధతినే సూక్ష్మదృష్టిన వీక్షించి భావస్వభావములను గుర్తించి, భావనచేసి రూపకల్పనల నిచ్చారు. ఈరీతినే గగనపథమందు సంచరించు సూర్యునియం దొక భావం, అద్భుతమైన రెక్కలుకలిగిన ఒక గొప్ప పక్షిరాజమయింది. గరుడభావన కాది ఇక్కడే కానవస్తుంది. అలాగే సూర్యునియందలి మరో భావం ఉత్తరుసైంధవరూపం వహించింది. ఈ భావము ననుసరించే ఋగ్వేదమం దొకచోట ఉషాదేవత ఒక శ్వేతహయాన్ని నడిపించుకపోతున్నట్లు వర్ణించారు.

ఈ రీతినే అద్భుతకళాకల్పనల నొనర్చిన యీ మహాకర్తలు అగ్నియందలి భావాలను అనేకరకాలుగా వివిధజంతురూపముల భావన చేశారు. వృషభం, ఆవుదూడ, గుర్రం, గద్ద, హంస మొదలయిన వెన్నో వాటివాటి భావముల ననుసరించి అగ్నియందలి ఒక్కొక్క భావాన్ని వ్యక్తపరుస్తాయి. ఋగ్వేదమందలి ముఖ్యమయిన మరో దేవతాస్వరూపం "అజఏకపాద"—అనగా ఒంటికాలి మేక. ఈ రూపం మెరుపునందలి మహాశక్తి వర్ణనేమోయని పండితుల యభిప్రాయం. ప్రపంచవాతావరణాన్ని నిర్ణయిస్తూ, సాగరగర్భమందు "అహిర్బుధ్న్య" మను ఒక దేవత మహాసర్పరూపమున నివసించునని యన్నారు. నిశ్చయంగా మహాసాగరచలనములు ప్రపంచవాతావరణాన్ని కొంతవరకూ నిర్ణయిస్తూనే ఉంటవి. అందుచేత ఆ మహాశక్తిని జలనిధిగర్భమందలి ఒక అనంతస్వరూపంగా ఆనాడే భావనచేయడం నిజకళా ఉత్తీర్ణతే అని తప్పక చెప్పవలసియున్నది.

వేదములందు వర్ణన నంది తదుపరి అనేక కళాపీఠములకు, మతవాహినులకు ఆదిరైన దివ్యరూపం రుద్రునిది. బహుశా పండిత మార్షలుగారు సూచించిన రీతి ఈ రుద్రరూపం వేదరచనలకు శతాబ్దముల పూర్వమే జనించియుండవచ్చు. ఏది ఎట్లున్నప్పటికీ, వేదానంతరం ప్రచండరూపముల నందుకొన్న నిజదివ్యభావచ్ఛాయలు వేదములందు స్పష్టముగా కానవస్తవి. రుద్రుడిని వేదములందు కొన్నిచోట్ల వృషభానికి పోల్చారు. అగ్నికికూడ వృషభరూపం కల్పించినట్లు ఇంతకుముందే అన్నాను. పెనుతుపానుల ప్రళయరీతి విశ్వసంక్షోభిత మొనర్చినపుడు వేదకర్తలు రుద్రరూపం తిలకించారు. మరుత్తులు, అనగా ఆ పెనుతుపానుయందలి ప్రళయపవనాలు రౌద్రేయులై, రుద్రశివుని పరివేష్టించియుండు నాతని

బృందంగా భావనచేశారు. గగనభాండాన్ని పెగల్చుకొని, విశ్వాన్నంతా చీలుస్తూ ఫెళ్లున పృథ్వీమీదకు వ్రాలు పిడుగులు రుద్రశివుని శరములైనవి. విశ్వమందలి మహాప్రళయశక్తిస్వరూపమయిన యీ రుద్రశివుడే పశుపతి యని యీ వేదములందే వర్ణించారు. దీనికి కారణం ఒకటే. లయే సృష్టి కాది యని యీ మహాకళాకర్తలు స్పష్టంగా గుర్తించారు.

ఋగ్వేదమందే ముప్పదిమూడవ మండలంలో రెండో సూక్తమందు రుద్రరూపచిత్రము నొకదాన్ని కూడ వర్ణించారు. మూడవ శ్లోకంలో అతడు వజ్రబాహు: అనగా పిడుగుల్లాంటి చేతులు కలవాడు. మృదువైన ఉదరం: ఖంగుమను కంఠం: చక్కని నాసిక: చామనచాయ: నిశ్చయంగా చిత్రించిన విషయం. వీలవన అత్యుత్తమకళారచనలైన శిల్పములందు ధ్వని తప్పక విదితమవుతుంది. నిజంగా నృత్యభంగిమలు నిర్దేశించు ఉత్తమశిల్పాలను తిలకించినపుడు ఆ భంగిమ ననుసరించు పూర్వాపరభంగిమ లెన్నో మనదృష్టిని స్పష్టపడుటయేగాక, యీ నాట్యసంగీతనాదకింకిణులన్న మన చెవులయందు మారుమ్రోగుతవి; తప్పదు. శిల్పమందు తీర్ణత తెల్పుటకిది యొక ముఖ్యాంశము. అందుచేతనే మహాకళాకోవిదులైన వేదకర్తలు చిత్రమును వర్ణిస్తూ, యీ రూపము ననుసరించు కంఠధ్వని స్పష్టంగా వర్ణింపగలిగారు. మన దివ్యభూమియందు వేదకాలమునాటికే శిల్పకౌశలమువారు మరిఉత్తమమైన దనుటకు ఈ ఒక్క తార్కాణమే చాలు.

వెంటనే ఎనిమిదవ శ్లోకమందు శ్వేతవర్ణం, చామనచాయ రెండూ కలిసే యీ రుద్రశివుని వర్ణం అని పేర్కొన్నారు. ఆపైన పదోశ్లోకంలో విల్లంబులమ్మూ, విశ్వరూపం కలిగిన ఒక అద్భుతనిష్కమాలనూ ధరించినట్లుగా వర్ణించారు. "అర్హన్బిభర్షి సాయకాని" "ధన్వార్హన్నిష్కం యజతం విశ్వరూపం; అని వేదవాక్యం. నిజంగా కొంతకాల మయేసరికి, చండప్రచండరూపముల నీ నిష్కమాల వహించి, రుద్రశివుని గూర్చిన పెక్కు దివ్యజ్వాలామయభావనలకు ఆలవాలమయిన మాట వాస్తవం.

ఈ రుద్రరూపవర్ణనలందు బోలెన్స్కీ అను మహాపండితుడు "పురరూపః" అనే పదాన్ని వెలిదీశాడు. రుద్రశివునికి అనంతరూపాలని, ఈ రూపములన్నీ కళాకోవిదుని భావనల ననుసరించేవనీ ఈ పదము ననుసరించిన పండితవ్యాఖ్యానం. నిజంగా తరువాతియుగమందు కళాకోవిదు లయితే నేమి, మతకర్త లయితే నేమి, మహాకవు లయితే నేమి, భావనచేసి కల్పించిన రుద్రరూపముల కంతు లేదు. ఈ రూపములను కొంతవరకూ ముమ్ముందు చర్చించవగును.

ఇలాగే ఋగ్వేదమందు వరుణుణ్ని కవచధారిగా వర్ణించడమేగాక, గూఢచారులు అతన్ని పరివేష్టించి పరివారమైనట్లుకూడ చెప్పారు. ఎవరూ ఎరుగలేని వరుణుడు సర్వవాక్యముల నిధియైన సాగరస్వరూపం అనే భావం ఈ భావనయందు స్పష్టంగా గోచరిస్తుంది. మరోచోట దివ్యాభరణాలంకృతులైన మరుత్తు లతని పరివారంగా వర్ణించారు.

ఋగ్వేదమందలి యజ్ఞక్రతువు రూపభావన కొంతవర కీనాడు చిత్రంగా తోచవచ్చు. రెండు తలలు నాలుగు కొమ్ములు కలిగి రంకె వేస్తూ త్రివిధాలుగా బంధించిన వృషభరాజ మది. మహావక్త యజ్ఞుడీ భావనను విశదీకరించినరీతి మరీ చిత్రం. నాలుగు కొమ్ములు నాలుగు వేదాలు: రెండు తలలు రెండిష్టీలు; ప్రాయనీయ, ఉదయనీయ: బంధత్రయం, మంత్రాలు, కల్పసూత్రాలు, బ్రాహ్మణాలు: రంకె వేదఘోష. నిజముగా ఋగ్వేదమునాటికి ఇతరవేదత్రయం లేదని ఘంటాపథంగా నిర్వచించిన పాశ్చాత్యపండితనిర్వచనాముఖాన, ఈ వాక్యం నిజంగా ఆశ్చర్యకరం. ఋగ్వేదమందలి వృషభరాజంకొమ్ములు నాలుగు వేదాలను సూచించాయి. అంచేత ఈ యజ్ఞవాదం పాశ్చాత్యపండితవాదం ఇంకా గట్టిగా పరిశీలింప దగును. ఈ పరీక్ష మహాపండితులకు వదలి మనం ఇప్పుడు కళాతత్వవిచారమందే నిమగ్నులౌట ఉత్తమం. మరొకచోట ఋగ్వేదమందు మేఘాలను గోవులకు పోల్చారు.

ఇలాగే వేదసాగరమును శోధించినకొలదీ, ఉత్తరోత్తర మహద్రూపములు వహించిన నిజకళాబీజభావనలు అణిముత్యాలరీతి అనేకములుగా కానవగును. నిజముగా ఈ ఉద్గ్రంథశోధన క్షీరసాగరమథన మనే చెప్పాలి.

దము వేల తర్వాత రచనలయిన ఉపనిషత్తు లందు కూడ ఉత్తరోత్తర కళామతివాహినులకు అంకురము లయిన భావభావనలు, కల్పనలూ అనేకము లున్నవి. కాని కొంతకాలం గడచిన తర్వాత వెల్లివిరిసిపారిన మహాకళావాహినికి నిజసంప్రదాయసూలములయిన స్పష్టభావనలు అనేకములు పురాణములందునూ, తంత్రములందునూ, స్తోత్రములందునూ కానవస్తాయి. ఋగ్వేదమందలి రుద్రశివుని చిత్రవర్ణనలవలెనే, ఉత్తమకళాకోవిదులు రచించిన కొన్ని చిత్రములే ఈ భావనలకు మూలం అయివుండవచ్చు. లేక మహాకవులే ఆదిన ఈ భావనలను వ్యక్తము చేసిన దాదిగ, మహాశిల్పులు శిల్పశ్రేణియందీ భావనలను అభివ్యక్తపరచియుండవచ్చు. ఏది ఎట్లయినప్పటికీ, ఈ భావనల ననుసరించి మహాశిల్పములూ, మహాశిల్పముల ననుకరిస్తూ మరికొన్ని ఉన్నతభావనలూ, ఇలాగా శిల్పమతవిజ్ఞానశ్రేణులు ఒకటి నంటి మరొకటి మనదేశమందు విరివిగా పెరిగి మహాసాగరరూపములు వహించిన వనుటలో ఏ అతిశయోక్తి లేదు.

రానురాను ఈ భావనలు, నిశ్చితరూపములూ, అర్థముల నందికొని సంప్రదాయశ్రేణులు నిర్మితము లయినవి. చాలవరకూ మన దివ్యశిల్ప భావకు మూలం ఈ సంప్రదాయములేనని రూఢిగా చెప్పవలసివుంటుంది. ఈ సంప్రదాయగతికి అంకురములయిన కొన్ని ఆది భావనలను గమనించినగాని యీ భాషాస్వరూపమును గ్రహించుట కష్టం.

మన ఋషులు విశ్వమంతటినీ ఏకంగా బ్రహ్మాండ మన్నారు. విశ్వం అండాకారం. సృష్టి, స్థితి, లయ మహాశక్తుల కండమైనది విశ్వం. తద్విశ్వస్వరూపమే బ్రహ్మస్వరూపం. అందుచేతనే బ్రహ్మాండం విశ్వం. స్థూలదృష్టికి నిశ్చలితమయిన అండగర్భం ప్రచండ చలనాయతనమై సృష్టికారక మయినది. అందుచేత గుణప్రభావముల ననుసరించికూడ విశ్వ మండమే. కాబట్టి విశ్వమునే బ్రహ్మగా ఎరిగి, సూక్ష్మదృష్టిన వీక్షించి, అండాకారం బ్రహ్మకు కల్పించిన కళాకోవిదులను మహాఋషు లనుటలో ఏ అతిశయోక్తి లేదు. ఈ భావనాపర్యవసానం, చెట్టుమొదట అండాకారపాషాణములనుంచి బ్రహ్మయందలి సృష్టిశక్తిని పూజచేయడం అనాదిగా మనం ఎరుగుదుము. ఈ విషయాన్ని పాశ్చాత్యమహాచక్తలలో నొకరయిన హావెలుగారు కూడ గమనించారు.

౹ ఆదిశేషు డనంతుడు. అనగా నాగసర్పం అనంత భావాన్ని వ్యక్తపరుస్తుంది. నిజంగా ఏ సర్పమందునూ కానరాని నిజలావలావణ్యమేగాక, నాగసర్పగతి యందేమి, చుట్టుకొని నిద్రితమైవప్పుడేమి, ఒకవిధంగా ఆదీ అంతూ తెలియని పొరుదల కానవస్తుంది. దీన్ని మన పూర్వీకులు గుర్తించి, కళలలోనూ, మతాచారములందునూ ఈ భావా న్ననుసరించిన అనంతభావనను పూర్తిగా వినియోగించారు. ఇంతేగాక పత్రమున కొకతూరి కుసుము విడిచి, నవ్యరూపము నందుకొనడం; పవనమే ఆహారంగా వినియోగించి మహాయోగులరీతి అనేకదినముల పర్యంతం సంపూర్ణశక్తితో జీవించడం, మరి ఏ ఇతరజంతుజాలములందునూ కానరాని ప్రత్యేక ధీశక్తిని ప్రకటించడం కారణం కాబోలు, నాగసర్పం జ్ఞానమునకుకూడ హైందవకళయందు సాంకేతికమై, మతమందును కళయందును ఒక ప్రబలస్థానం వహించింది. ఇంతేగాక ప్రచండవిషధారియై మృత్యుముఖియైన ఈ నాగు శంకరాభరణమైనప్పుడు ప్రళయమును సూచిస్తుంది.

హైందవకళయందు అతిగా వినియోగమంది ప్రబల ప్రాముఖ్యము వహించినది కమలం. ఆదినుంచి, లతలందు, స్తంభములందూ, ఇతర చిత్రకళాశిల్పములందూ, వాస్తుశిల్పమందూ ఈ కమలాన్ని వివిధవిధాలుగాను, విరివిగాను ఉపయోగించారు. వికసించినరీతి, ముకుళితరీతి, తలక్రిందులుగా, నిడుపుగా అనేకభంగిమలం దీ కమలం మన శిల్పమందు కానవస్తుంది. ఇంతేగాక కమలగర్భం, రేకులు, కాడ, భాగములు, అనేకరకాలుగా మన శిల్పమందు వినియోగము నందికొన్నవి. కమలభావాన్ని మహానిర్వాణ తంత్రమందు ఈ దిగువరీతిన వర్ణించారు. వేరు బ్రహ్మ: ఇది మూలం; ఎరుగ శక్యంగానిది: కాడ మాయ; పుష్పం విశ్వం; ఫలం మోక్షం. పుష్పంనుంచి ఫలరూపకంగా వెలికిరావడం సర్వక్లేశములు బాసి, విమలుడై ముక్తి నందడం అన్నమాట.

మన కళయందీ కమలవినియోగం సంపూర్ణంగా చర్చించుటకు ఒక గ్రంథం చాలకపోవచ్చు. అనేక దేవతలు, శక్తులు, కమలాసనులు. తమ హస్తములం దనేక దేవతలు కమలాన్ని ధరిస్తారు. సూర్యున కింపైనది కమలం; సూర్యభావమయిన తేజస్సును సూచిస్తుంది. కమలాసనులైన దేవతలు విశ్వ మధిష్ఠించి విశ్వాతీతు లయిఉంటారు. బ్రహ్మాండం కమలం. జంబూద్వీపం కమలమై మేరుపర్వతం కమలకేంద్రాన నిలిచింది.

మనం ఇప్పు డెరిగినంతవరకూ ఆదిన ఈ కమల రూపం అశోకవర్ధనుడు సారనాథునద్ద స్థాపించిన కంచమందు వెలసింది. చూచినంతనే ఈ కమల స్వరూపం మనకు గోచరించకపోవచ్చు. ఏలనన కళాకోవిదుడు తన అంతర్భావపరిణతి ననుసరించి రూపకల్పన లొనరిస్తా డను అంశమును మరచిపోకూడదు. అందుచేత మనం నిత్య మెరిగిన వస్తురూపంకూడ ఈ త్తమశిల్పంలో, ఒక్కొక్కప్పు డా భావన ననుసరించి, సూక్ష్మపరిశీలనచేగాని గుర్తించజాలని ఒక నవ్యరూపము నందికొనవచ్చు. ఈ స్తంభశిరస్సున నిర్మించిన కమలం, స్తంభలయానుకరణంగా కల్పితమయి, కమలములందు సాధారణంగా మనం ఎరుగని ఒక దివ్యరూపము నందికొన్నది. క్రిందకు వ్రాలుచున్న రేకులు గలిగిన ఈ కమలంపైన నాలుగు దిక్కుల నాలుగు సింహాలను ఆ శిల్పి చక్కగా, అతి సరసంగా నిర్మించాడు.

ఈ స్తంభభావన చక్కగా అవగాహనం చేసికొనుటకు పురాణవాఙ్మయమే మన కాధారం. సర్వ ప్రపంచమునకు పద్మం: హిమాలయములందలి మానససరోవరం కేంద్రం. విచ్చిన పద్మం రేకులు భూమియందలి ఖండాలు. ఈ భావన అతిసుందరమైన దనుట వాస్తవం.

ఈ సింహభావనకూడ చిత్రమయినదే. తొలుదొల్త ఏనుగు, వృషభం, గుర్రం, సింహరూపములు నాలుగుదిక్కుల నిర్మించెడివా రని పండితాభిప్రాయం. ఈ నాలుగు రూపములు మానససరోవరమునం దుద్భవించు నాలుగు మహానదులను సూచిస్తా యని పండితు లన్నారు. చైనా, టిబేటులందుకూడ ఇదే అర్థము నుద్దేశిస్తూ పురాతనచిత్రా లెన్నో ఉండెడివని చెవెలుగా రన్నారు. కాని టిబెటులోమాత్రం ఏనుగు స్థానే ఏనుగును చిత్రించేవారట.

కాని అశోకునికాలమునాటికి వెగత జంతు రూపములను మరచి నాలుగుసింహాలనే నిర్మించడం పరిపాటి అయింది. ఈ నాలుగుసింహాలు పై జెప్పినరీతి మానససరోవరమునం దుద్భవించు వాహినులు గావచ్చు. లేదా ప్రపంచముపైన పీఠ మధిష్ఠించిన శాక్యసింహుడే నాలుగు దిక్కులా సమానంగా చూస్తున్నట్లు భావించవచ్చు. సాంచీస్తూపమందు ఈ స్తంభమునే ఒకచోట చిత్రించి, సింహములపైన శిల్పి ధర్మచక్రంకూడ నిర్మించాడు.

స్తంభశిరోభాగాన విశ్వపద్మమును నిలబెట్టిన భావం మరికొంత చర్చార్హమైనది. ఈ కళాభావ నాంకురం వేదజములైన తంత్రములందే నని మహాపండితులు శ్యామశాస్త్రిగారు నిరూపించారు. తంత్ర శాస్త్రములందు సృష్టి, స్థితి, లయ శక్తిస్వరూపములను త్రివిధాలుగా ఋషులు వర్ణించారు. సృష్టి శక్తి స్వరూపం త్రికోణాకారం ▽. స్థితిశక్తిస్వరూపం కంబాకారం I. లయశక్తిస్వరూపం వర్తులాకారం ○. అందుచేత విశ్వస్థితికారక శక్తిస్వరూపం కంబాకారం. (సశేషము)

---



# భారతి రజతోత్సవము

జనవరి ౨౮ వ తేదీ శనివారము సాయంత్రపు శుభఘడియలలో మైలాపూరులోని 'శ్రీ బాగ్' భవనమునందు ప్రత్యేకముగా నిర్మింపబడిన పందిరిలో భారతి రజతోత్సవము సుప్రసిద్ధపండితకవులైన శ్రీ శతావధాని వేలూరు శివరామశాస్త్రిగారి అధ్యక్షతను యథావిధిగా, సలక్షణముగా జరిగినది. ఉండూరువారు, పొరుగూళ్ళవారు నైన పెద్దలు చాలమంది ఈ సభలో పాల్గొని ఆ సమావేశమునకు నిండుదనమును, నిగ్గును కలిగించిరి.

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు సహజ శ్రావ్యమైన కంఠముతో కమ్మని భారతీ ప్రార్థన పద్యములను చదివిరి.

తదుపరి, సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు భారతిని స్థాపించుటలో కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి ఆశయాదర్శములను, వానిని నిర్వహించుటలో వారనుసరించిన సంప్రదాయములను ఉట్టంకించి, అచ్చముగా ఆ వరవడినే ఈ యిరువదియైదేండ్లుగా భారతి భాషాసేవ చేయుటకు ఎట్లెట్లు పూనుకొన్నది, రచయితలందరును ఎట్లెట్లు తమకు ఆదరసహకారములు చూపినది, దేశములోని విద్యావిజ్ఞానప్రమాణములను భారతి ఎప్పటికప్పుడు ఎట్లెట్లు ప్రతిబింబించి ప్రస్ఫుటీకరించుచు వచ్చినది—ఇత్యాదిగా భారతి సాధించిన కార్యకలాపములను సింహావలోకనము చేసి ప్రస్తరించిరి. పూర్వపు రచయితలకు, ఇప్పటి రచయితలకు అందరికిని హార్దమైన అభినందనలను తెలిపిరి. పిలిచినదే తడవుగా, ఎంతో ఆత్మీయతతో, ఆప్యాయముగా ఈ సమావేశమునకు వచ్చి, భారతిపట్ల తమకు గల అవ్యాజాభిమానము ప్రదర్శించిన పెద్దలందరికిని స్వాగతము చెప్పిరి. వారి స్వాగతోపన్యాసములోని కొన్ని భాగములను దిగువ ఉద్ధరించుచున్నాము :

## స్వాగతోపన్యాసము

"పత్రికాకార్యనిర్వహణతో పరిచయమున్నవారికి, ఒక పత్రిక—అందులో సాహిత్య, చరిత్ర, కళ, శాస్త్రవిషయాలకే ప్రాధాన్యమిచ్చే భారతివంటి పత్రిక నిర్విఘ్నంగా పాతికేళ్లు సాగుట విశేషమైన విషయం అనుటలో అతిశయోక్తి లేదేమో! పత్రికాస్థాపన నిర్వహణ నేడు అతిసులభంగా కనపడవచ్చు. కాని భారతిని ఆరంభించేనాటికి అది సాహసకార్యమే. కాబట్టి భారతి జీవయాత్రలో ఒక ఘట్టము చేరినదనే నేటి సంతోషం. ఆ సంతోషాన్ని పురస్కరించుకొని, పెద్దల ఆశీర్వచనాలను పొందడానికిగాను, సంప్రదాయాన్ననుసరించి "రజతోత్సవ" సభను ఏర్పాటుచేయడమైంది. అంతే కాని స్వకీయ ప్రతిష్ఠాప్రదర్శనానికి కాదని మనవి. ఆంధ్రవికాసానికి సర్వతోముఖంగా దోహదమిచ్చి అమరత్వాన్ని పొందిన భారతిసంస్థాపకుడు, శ్రీ విశ్వదాత, కళాప్రపూర్ణ నాగేశ్వరరావు పంతులుగారిని ఈ శుభసమయమున స్మరించి అంజలు లర్పించుచున్నాము. ఆ మహామహుని చేతి చలువ, సంకల్పబలమే కాని, మా నిర్వాక మేమాత్రము కాదు.

ఈ ౨౫ సం.లు భారతి భాష, వాఙ్మయము, కళ మొదలైన విషయము లన్నిటినీ సాదరభావంతో చర్చించుటకు అవకాశం కల్పించింది. తెలుగుల చిత్రకళావైభవాన్ని చిత్రించి చూపించింది. శాసనములు, కైఫీయతులు మొదలైన పూర్వ ఆంధ్రచరిత్ర సాధనములకు, పరిశోధనలకు అమితోత్సాహము నిచ్చినది. వివిధ సాహిత్యరీతులను ఒకే మనస్సుతో అందుకొన్నది. ఒకవిధంగా భారతిలోని వ్యాసాలు ప్రమాణప్రసిద్ధిని పొందిన వనటం అతిశయోక్తి కాదనవచ్చు.

## సాహిత్యవర్గము లన్నిటిని సమన్వయించు లే ప్ర ధా నా శ యం

భారతి ఆరంభించేనాటికి తెలుగు సాహిత్యరీతులలో విప్లవ మారంభమైనది. సాహితీసమితి ఆరం



భారతి రజతోత్సవసభామండపమున భారతిసంపాదకులు శివలెంక శంభుప్రసాద్ గారు
శుభసందేశములు చదువుతున్న దృశ్యం

భించిన ఉద్యమం ప్రజ్వలితమవుతోంది. "పూర్వాపర సంస్కారములను సమన్వయము చేయు" ఆశయాన్ని అనుసరించి, ఇటు సాహిత్యవిప్లవకారులకు, అటు పూర్వసాహిత్యాభిమానులకు సమానస్థాన మిచ్చింది. నాటినుండీ నేటివరకూ వచ్చిన వివిధ తెలుగుసాహిత్య వెలుగులతో భారతి ప్రకాశించినది. సాహితీసమితి ప్రారంభించిన ఉద్యమంతో సాహిత్యవిప్లవ మాగలేదు. సాహిత్యం వాస్తవికజగత్తును అంటిపెట్టుకొని ఉండా లన్న ఉద్యమం బయలుదేరింది. "వాస్తవిక కవిత", "అతివాస్తవికకవిత", "అభ్యుదయకవిత" ఈ నూతనఉద్యమా న్ననుసరించే బయలుదేరినవి. ఇవన్నీ సాహిత్యపరిణామక్రమంలో ఉద్భవించినవే. ఈ భిన్నస్వరూపాలన్నియు ఎప్పటికప్పుడు భారతిలో వెలసినవి. సాహిత్యవర్గము లన్నిటినీ సమన్వయించుటే భారతిప్రధానాశయం. భవిష్యత్తునందు కూడ ఇదే రీతిని నడచి సకలసాహితీపరుల మన్నన లను పొందగలదని ఆశిస్తున్నాము.

భారతియాత్రావిజయమునకు తోడ్పడిన సాహిత్యోపాసకులకు, చిత్రకారులకు వందనములు. వారందరి సహకారఅభిమానములతో ఇకముందుకూడ ఇతోధికముగ, తెలుగు సాహిత్యభవిష్యదుజ్జ్వలస్వరూపాన్ని ప్రతిఫలించుకుంటూ భారతి ప్రతిభాయుతంగా తన యాత్రను సాగించుకోగల దని ఆశిస్తున్నాము."

తరువాత, సభాధ్యక్షులైన శ్రీ శివరామశాస్త్రి గారు సభాస్తారులను నిస్తబ్ధులను చేయగల తమ సహజ గంభీరకంఠముతో గభీరార్థప్రతిపాదనలతో చక్కని ఉపన్యాసము చేసిరి. అందులో వారు తెలుగుపత్రికల ప్రథమస్వరూపమునద్దనుండి ఉపక్రమించి ఇప్పటి పత్రికలవరకు ప్రవర్తిల్లుచు వచ్చిన పరిణామదశల నన్నిటిని వివరించిరి. ఆ యా పత్రికల బాగోగులను, మంచి చెడ్డలను నిరూపించి, పత్రికల బాధ్యతలను సూచించి కర్తవ్యాకర్తవ్యాలను ఉపదేశించిరి. భారతి యింతవరకు చేసిన సేవను కొనియాడిరి. 'భా ర తి'ని స్థాపించుటరూపముగా శ్రీ నాగేశ్వరరావుగారు భారతికి తెలుగునాట సువర్ణపీఠము స్థాపించి రనియు, ఆయనకు ఆంధ్రదేశము సువర్ణవిగ్రహము స్థాపించవలెననియు ఉపదేశించి, కవులు సువర్ణములతో ఈ ప్రతిష్ఠను దైనందినముగా చేయుచునే యున్నారని చమత్కరించిరి. వారి ఉపన్యాసములో కొన్ని భాగము లను ఈ దిగువ ఉల్లేఖించినాము.

## అధ్యక్షోపన్యాసము

"అముద్రిత గ్రంథ చింతామణితో ఆంధ్ర సాహిత్య పత్రిక లారంభ మైనవని అనుకుంటాను. ఆ సంచికలు తిరగవేస్తే అముద్రిత గ్రంథాలతోపాటు ఆనాటి సాహిత్యమహారథుల ప్రబంధరచనలూ, సాహిత్యచర్చలూ కనబడతవి. ఆ మహారథులు మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు, మచ్చ వెంకటకవి గారు, వేదం వెంకటరాయశాస్త్రిగారు, శతఘంటం వెంకటరంగశాస్త్రిగారు, నాగపూడి కుప్పుస్వామయ్య గారు, దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు, కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు, వావిలికొలను సుబ్బారావు పంతులుగారు మొదలయినవారు. వారు నాటి సాహిత్య విమర్శన యావత్తూ పదాలచుట్టూ రసనాటంకార పూర్వకంగా వ్యాకరణంచే శరసంధానం చేసి బహు దూరంనుంచి ఒకరిమీద మరియొకరు ధూళిక్రీడ చేసి కోవడముగా ఇప్పటివారికి కనిపిస్తుంది. అయితే ఈ పత్రికలలో కనబడే శబ్దవిచారం వాని పాండిత్యం అపారం అని అనడానికి స్ఫోరకం. నేటికాలంవారు శబ్దసాధుత్వాన్ని బహిష్కరించి అర్థావిష్కరణానికి ఎట్లా తల్లాకపుపట్టు పడుతున్నారో నాటికాలంవారు అర్థాన్ని అభాండ్రాయిగా ఉంచి శబ్దంకోసమే పెనగు లాడుతూ వుండేవారు. అప్పుడు ప్రబంధనాయికా నాయకులు ఓయలపాటలవలన ఫుప్ఫుసంలో (Lung) కలిగే ఊర్పు నిట్టూర్పులలో మాత్రమే వైచిత్రి కన బడుతుంది.

వాడుకభాషలో అంకెవేసిన శ్రీ గురుజాడ అప్పారావుగారి కన్యాశుల్కంలోని సీసపద్యం ఒకటి సదరు అముద్రిత గ్రంథచింతామణిలో చూచి నే నాశ్చర్యపోయి ౧౯౧౩ లోనో, ౧౪ లోనో ప్రెసిడెన్సీకాలేజిలో జరిగిన ఒక సభలో దానిని గురించి అప్పారావుగారి నడిగాను. 'మొద ట



భారతి రజతోత్సవ సమావేశములో పాల్గొన్న కొందరు కః పండిత ప్రముఖులు

ముందువరుస (ఎడమనుంచి కుడికి) బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, కోలవెన్ను రామకోటీశ్వరరావు, డా. చేలటూరి వెంకటరమణయ్య, స్వామి శివశంకరశాస్త్రి, సభాధ్యక్షులు శతావధాని వేలూరి శివరామశాస్త్రి, భారతిసంపాదకులు శివలెంక శంభుప్రసాద్, స్థానికశాఖామాత్యులు కల్లూరి చంద్రమౌళి, దోర్బల కోథనాద్రిశాస్త్రి, డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి. రెండోవరుస : బులుసు వెంకటేశ్వర్లు, డా. సీతాపతి, నిడుదవోలు వెంకటరావు, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, పిలకా గణపతిశాస్త్రులు, గరిమెళ్ల సత్యనారాయణ, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, కోల సుందరరామశర్మ. మూడో వరుస : జనమంచి రామకృష్ణ, కోరాడ రామకృష్ణయ్య, నోరి నరసింహశాస్త్రి, చ. పిచ్చయ్య, అకొండి పరబ్రహ్మశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీరంగం శ్రీనివాసరావు, వేదం వెంకటరాయశాస్త్రి, న్యాపతి రాఘవరావుగార్లు.

ప్రబంధభాషలోనే కన్యాశుల్కం వ్రాసి, అది రుచించకపోవటంచేత గ్రామ్యంలో తిరుగ వ్రాశానని వా రప్పుడు చెప్పారు. శ్రీ రెంటాల వెంకట సుబ్బారావుగారు కన్యాశుల్కానికి పోటీగా వరశుల్కం వ్రాశారుగాని దానికి పాఠకశుల్కం దొరకలేదు. అప్పుడే శ్రీ సోమంచి భీమశంకరంగారు రఘువంశం కొన్ని సర్గలు (వాడుక భాషలో) పద్యాలలో వ్రాశారు. అ వేమయినవో తెలియదు.

తరువాత వచ్చిన సాహిత్య పత్రికలకు అముద్రితగ్రంథచింతామణియే ఒరవడిగా ఉంటుంది. కల్పలత మొదలయిన పత్రికలలో ప్రాచీన ప్రబంధములూ, నవీన ప్రబంధములూ, కొందరు పండితుల ద్వంద్వయుద్ధాలూ, సంకుల సమరాలూ మాత్రమే ప్రధానంగా కంటబడతవి. శ్రీ వీరేశలింగం పంతులవారి వివేకవర్ధనిలో మాత్రం మాతృసాహిత్యపురుషుని సహస్రముఖాలు స్పష్టాస్పష్టంగా గోచరిస్తవి. ఈ రీతిని క్రమవికాసం పొందుతూ వచ్చిన సాహిత్యపత్రికలన్నీ ఆయా సంపాదకుల ఏకైకాభిప్రాయమునే ప్రచారం చేస్తూ రావడంవలననో, ఆంధ్రమహాజనులకు ఆ సాహిత్యంలో రసగ్రహణశక్తి లేకపోవడంవలననో, మరి రచయితల లోపంవలననో మెలమెల్లగా అస్తమిస్తూ వచ్చినవి.

## వార్తా - సాహిత్య పత్రికలు:

నేను కొంచెం కళ్లు తెరిచేసరికి సాహిత్య పత్రికలయినా వార్తాపత్రికలయినా బందరులో కృష్ణ ఒకటి. చెన్నపట్నంలో శశిలేఖ ఒకటి. శశిలేఖ దినపత్రిక. శ్రీగట్టుపల్లి శేషాచార్యులు గారు కాబోలు దీనిని ప్రచురించేవారు. ఈరెండు పత్రికలున్నూ రాజకీయాలు ప్రధానంగా సామయికకవుల పద్యాలనూ, పండితుల విమర్శనములనూ ప్రకటిస్తూ ఉండేవి. కొలది రోజులలోనే శశిలేఖ లేఖ లేకుండా పోయింది.

కాంగ్రెస్ వాణి గాలివలె మూల మూలలకు పాకుతున్న రోజు లవి. జన సామాన్యంలో కాకున్నా నాయకులలో చైతన్యాగ్ని భగ్గు మని మండజొచ్చిన రోజు లవి. సాహిత్యంలోనికి కూడా రాజకీయాలు అమ్ములవలె దూసుకొనివచ్చిన రోజు లవి. అప్పుడు దేశాభిమానం మాత్రకట్టుగా పద్యాలలో మింగడాని కనువు పడ్డది—

"పాయిజామా మాని పంచెనుకట్టువా
డుండునా దొరలలో నొక్కడయిన"

ఈ మొదలగు పద్యాలు ఆనాటివే.

## సంస్కృత పత్రికలు:

ఈ సమయంలోనే మహోపాధ్యాయ అప్పాశర్మ విద్యావాచస్పతులు చంద్రిక అనే మాసపత్రికనూ, సూనృతవాదిని అనే రాజకీయ వారపత్రికనూ ప్రకటిస్తూ ఉండేవారు. చంద్రికకు అప్పటికి సుమారు ఇరవై యేండ్లు ఉండవచ్చును. ఈ చంద్రిక ఫిజిక్సును సూత్రాలలో వ్రాయ మొదలుపెట్టింది. సూనృతవాదిని శిశువు. ఈశిశువు రాజకీయాలలో తిలక్ కన్న ఏడాకు లెక్కువ చదువుకొన్నది. ఆపత్రికలోనుంచి ప్రతి వారమూ శ్లోకరూపంతో కొన్ని తుపాకి గుండ్లు మోగుతూ ఉండేవి. ఈ రెండు పత్రికలూ తమకు చాలా 'బలాధానం' చేసినవని శ్రీనాగేశ్వరరావు పంతులుగారు చెప్పారు. ఇంకా కొన్ని సంస్కృత సాహిత్య మాసపత్రికలు ఈయేడు కాంగ్రెస్ జరిగిన జయపురం మొదలగు ప్రదేశాలనుంచీ, కాశీనుంచీ, నవద్వీపంనుంచీ, కలకత్తానుంచీ, కొన్ని సంస్కృత వారపత్రికలు మంజుభాషిణి మొదలయినవి కంచినుంచీ, పట్టాంబినుంచీ వస్తూ ఉండేవి. ఇప్పు డొక్కసారి యీసంస్కృత పత్రికల కేసి సింహావలోకనం చేస్తే కృశించిపోతున్న యీ సంస్కృతానికి ఇంత సింహశౌర్యం ఎక్కడ ఉన్నదా అని తోచక మానదు. అట్టి సంస్కృతాన్ని రాష్ట్రభాషగా తీసుకోక హిందూస్తానీనో, హిందీనో తీసుకోడం ఏమి రాజకీయపరిజ్ఞానమో తెలియదు.

## ఆంధ్ర పత్రిక:

ఆంధ్రపత్రిక బొంబాయినుండి చెన్నపట్నానికి మారి దినపత్రికగా వికసించింది. చర్చిలో ప్రతి ఆదివారమూ జరిగే సాముదాయికోపాసనవలె ఈ ఆంధ్రపత్రికలో ప్రతి ఆదివారమూ సాహిత్యోపాసన జరుగుతూ ఉండేది. ఇలు ఇరకటం, ఆలి మరకట

అన్నట్లు ఇది బాగానే ఇరకటంగా ఉండేది. ఆ కాలంలో కూడా వార్తాపత్రిక అన్నా, సాహిత్య పత్రిక అన్నా ఒకటే. ఆంధ్రుల కప్పుడు ముఖ్యంగా ఆంధ్రపత్రికా, కృష్ణాపత్రికా ఈ రెండూ రెండు కళ్లు. మరచాను,—సావిత్రి, హిందూసుందరి, సువర్ణ లేఖ మొదలయిన మాసపత్రికలు కూడా చాలా సాహిత్య ప్రచారం చేస్తూ వచ్చినవి.

రాజకీయాలతో సాహిత్యం కలగాపులగం అవుతున్న ఆ రోజులలో వంగభాషలో కలలు కనే శ్రీరామశాస్త్రిగారు శారదను సాహిత్యపత్రికగా అవతరింపజేశారు. అప్పుడు బందరు నేషనల్ కాలేజీలో శిల్పాచార్యులు ప్రమోదకుమారచట్టోపాధ్యాయులు తమ శారదతో ఆ శారదను రంజింపజేశారు. 'ప్రథమకబళే మక్షికాపాతః' అన్నటులు పోస్టల్ డిపార్టుమెంటువారి దృష్టిదోషం దానికి తగలడమూ, దానికి వారు ఆంక్ష వేయడమూ, తరువాత ఉపసంహరించుకోవడమూ జరిగింది. ఏమయితే నేం? సంపాదకుల లోటు లేకపోయినా, రచయితల లోటు లేకపోయినా, ఎత్తుకు తగినంతధనం లేకపోవడంవలన, చందాదారులు తగినంత మంది లేకపోవడం వలన సాహిత్య జగత్తులో మళ్లా కృష్ణపక్షం వచ్చింది.

## భారతి :

ఆ కృష్ణపక్షం ఎన్నాళ్లో ఉండలేదు. కొద్ది రోజులలోనే సాహిత్య ప్రపంచానికి శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి ప్రయత్నంతో సాహిత్యప్రపంచంలో మరల భారతీముఖంగా చంద్రోదయమయింది. అప్పుడు తెలుగుప్రజ లందరూ 'నవో నవో భవతి' అని తలా ఒక నూలుపోగు వేసి చంద్రదర్శనం చేసికోవడం మొదలు పెట్టారు.

శ్రీ నాగేశ్వరరావుగారి కిరణాలు మూలమూలలకు ప్రసరించినవి. తెలుగు రచయిత లందరూ క్రమక్రమంగా ఆ చల్లని కిరణాలలో ప్రకాశించారు. ఆ చంద్రోదయానికి ప్రజాసముద్రం పొంగింది. రచయితలూ పాఠకులూ వాటినుండి భారతిని ఆరాత్రిక మెత్తడం మొదలు పెట్టారు. దానితో తెలుగుసాహిత్యం తెలుగు వీరింది. పిదప ఈ భారతిలో ప్రాచీన సాహిత్యమూ, నవీన సాహిత్యమూ కలిసి గంగా యమునలవలె ప్రవహిస్తూ అటు పెద్దలకూ, ఇటు పిన్నలకూ ఆనందం కలిగించినది.

## నవీన సాహిత్యమూ, ప్రాచీన సాహిత్యమూ:

నిక్కానికి నవీనసాహిత్య మంటూ, ప్రాచీన సాహిత్య మంటూ రెండు సాహిత్యాలు లేవు. ఇవి విభక్తులకు సోదరులవంటివి కావు. కవలలు కూడా కావు. ఇవి ఒకటంటే ఒకటే. ప్రాచీనతా నవీనతలు కాలం వల్ల కలుగుతవి. సజీవమైన సమాజంలో నిరుటి సాహిత్యం ఈ యేటికి పాతచింతపండు. మన దేశములోనే, మన భాషలోనే అభ్యుదయపత్రికను చూడండి. ఈ పాతికఏండ్లలో ఒక యేటికీ మరొక యేటికీ భారతినే చూడండి! ఎంత తేడా ఉందో!

సాంఘికాచారాలూ, పరిసరాలూ, రాజ్యపరివర్తనమూ, ఆయాయీ విప్లవాలూ, భావనా ఈ మొదలయినవాని ప్రాబల్యం సాహిత్యాన్ని పరిణమింప జేస్తూనే ఉంటుంది. జగత్తూ ప్రతిదినమూ కాలముచే పక్వ మవుతూ పరిణామం చెందుతూనే వుంది. దానితోపాటు సాహిత్యం పరిణామం చెందకపోతే కవుల చైతన్యమూ, రచయితల చైతన్యమూ నిద్రాణమై ఉన్నదన్న మాట. దానిని సంపాదకులు మేలుకోల్పాలి. భారతికూడా తెలుగువారి ప్రతిభ ననుసరించి పరిణమిస్తూ పాతికలో పడ్డది.

## రచయితలే భారతి :

ఈ భారతి దేవాలయంలో భారతి కాదు. భారతి అంటూ విడిగా ఇది యొక విగ్రహం కాదు. తెలుగుదేశంలో ఉండే రచయితలే భారతి. భారతి అంటే రచయితలు, వారు మథించిన వాగమృతమే భారతి. భారతికి ఉత్సవము జరుగుచున్న దనగా రచయితలకు జరుగుచున్న దన్నమాట.

తెలుగుదేశంలో పత్రికాపాఠకులే కొద్దిమంది; సాహిత్యపత్రికా పాఠకులు మరీ కొద్దిమంది; రచయితలు లక్ష కొక రుంటారో ఉండరో? ఇదంతా కూపమండూక వ్యవహారం. పత్రికాధిపతులు యీ కూపంలోనే బంగారం తవ్వి ఎగబొయ్యాలి.

శ్రీ నాగేశ్వరరావుగారు - భారతి :

ఆంధ్రదేశంలో తలచూపిన ఉద్యమ సహస్రానికి తమ బాహుసహస్రంతో శ్రీ నాగేశ్వరరావుగారు ఎట్టి గట్టి పునాదులు వేశారో సాహిత్యానికికూడా అట్టి గట్టి పునాదులు వేశారు. బంగారంతో రచయితలకు లక్ష్మీప్రసాదం వారితోనే ప్రారంభం అని నేను చెపితే మీా రెవరూ వివదింప రని అనుకుంటాను. సాహిత్యానికి ఇట్టి బంగారు పునాది వేసిన శ్రీ నాగేశ్వరరావుగారికి ఆంధ్రదేశంలో సువర్ణప్రతిమ ప్రతిష్ఠించడం సముచితం. కవులూ రచయితలూ శ్రీ నాగేశ్వరరావుగారి సువర్ణప్రతిమ ప్రతిష్ఠించలేకపోయినా సువర్ణ-ప్రతిమ దైవందినమూ ప్రతిష్ఠ చేస్తూనే వుంటారు. శ్రీ నాగేశ్వరరావుగారు వేసిన ఈ బంగారుపునాదిమీాద శ్రీ శంభుప్రసాదుగారు రజతోత్సవమూ, సువర్ణోత్సవమూ చేసి భారతివిషయంలో ఆంధ్రదేశాన్ని కాశ్మీరాన్ని చేస్తారని మన మందరమూ కోరుకుందాం."

అటుపిమ్మట పెద్దల ఉపన్యాసములు జరిగినవి. శ్రీ యుతులు విశ్వనాథ సత్యనారాయణ, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, స్వామీ శివశంకరశాస్త్రి, పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, వేపా రామేశం, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, కోలవెన్ను రామకోటీశ్వరరావు, ఖాసా సుబ్బారావు, నాగపూడి చంద్రశేఖరయ్య గార్లు భారతి చేసిన ఉత్కృష్టసేవను విభిన్నదృక్పథములతో పరిశీలించి పరిచయముచేయుచు ఉపన్యసించిరి.

ఉపన్యాసము లైన పిమ్మట భారతిని ఆశీర్వదించుచు శ్రీ నోరి నరసింహశాస్త్రి, బులుసు వెంకటేశ్వర్లు గార్లు కవితాగానము చేసిరి.

అది అయినపిమ్మట శ్రీ రాజగోపాలాచారి, రాజేంద్రప్రసాదు, రాష్ట్రపతి పట్టాభిసీతారామయ్య, అబుల్ కలాం ఆజాద్, రాధాకృష్ణన్ మొదలైన మహామహులనుండి వచ్చిన సందేశములు చదువబడెను.

చివరకు అధ్యక్షుని ఉపసంహార వచనములతోను, సంపాదకుల వందనసమర్పణతోను సమావేశము సమాప్తము గావింపబడెను. నిజముగా ఇది ఒక ఉత్సవముగానే హాయిగా గడచిన దని సభ్యులందరు హర్షించిరి. సభ్యులందరికిని భారతి రజతోత్సవ సంచికలు పంచిపెట్టబడెను.

సభారంభమున ఈ దిగువ పేర్కొబడిన మా సంకల్పము ప్రకటింపబడెను.

## ఉత్కృష్టరచనకు బహూకరణ

"ఈ సంవత్సరాంతంనుంచీ భారతిపక్షమున ఒక నూతన సంప్రదాయాన్ని ప్రారంభించ సంకల్పించాము. ఏ సంవత్సరాని కా సంవత్సరం భారతిలో ప్రచురణ అయిన రచనల్లో ఉత్కృష్టమైనదాన్ని పురస్కరించుకొని రచయితను రు. ౧,౧౧౬ తో సన్మానించ దలచినాము. ౧౯౪౯ సం. భారతి సంపుటాలనుంచి ఎన్నుకోవడం ప్రారంభమవుతుంది. ౧౯౫౦ సం.లో ప్రథమ బహూకరణము. బహూకరణము భారతిస్థాపకులైన నాగేశ్వరస్మృతి పేరట జరుగుతుంది. ప్రస్తుతము సంకల్పంమాత్రం తెలియజేశాము. దానిని నిర్ణయించే విధానం పెద్దలతో సంప్రదించి త్వరలో ప్రకటించుతాము."

దీనిని గురించి దరిమిలాను పెద్దలు కొందరితో సంప్రతించుట జరిగినది. వారందరుకూడ నిర్ణయాధికారులను నియమించు ఉద్దేశమునకు ఏకగ్రీవముగ విముఖత చూపిరి. వ్యాసములను సేకరించి ప్రకటించిన సంపాదకునకే ఆ నిర్ణయాధికారత ముండుట సమంజస మనిరి. ప్రచురింపబడిన వ్యాసములనుండియే ఉత్తమరచన ఎన్నిక జరుగవలసియున్నందున వారి సూచన సహేతుకముగ నున్నది. కాబట్టి ప్రత్యేకసంఘమును నియమించ దలచలేదు. ఏ రచనకు బహూకరణ నివ్వదగునో మేమే నిర్ణయింతుము. అయితే, ఏ విధమైన రచనకు బహూకరణ ఇచ్చుట జరుగును? అను ప్రశ్న రాగలదు. ఒక్క సాహిత్యసంబంధమైన రచనలను మాత్రమే కాక తెలుగువాఙ్మయాభివృద్ధికి తోడ్పడు రచనల నన్నిటిని ఈ విషయములో మేము దృష్టియం దుంచుకొందుము. చరిత్ర, శాస్త్రము, కథ, నాటకము, నాటిక, నవల, కవిత్వము, చిత్రరచన మొదలయినవన్నియు దృష్టియం దుంచుకోబడును. ఈ సంవత్సరము ఏ విషయమును గూర్చిన రచనకు బహూకరణ నివ్వదలచినది ముందుగా నిర్ణయించి ఇప్పుడే చెప్పుటకంటె సంవత్సరము ముగిసిన అనంతరమే విషయమును, రచనను నిర్ణయించుట ఉచిత మని భావించి ఆ పద్ధతిని అనుసరింపదలచితిమి.

# కలగూరగంప

## నిప్పు - నీళ్లు

'పంచభూతాత్మక మైన యీవిశ్వంలో ' నిప్పు - నీళ్లు' ప్రయోజనం తెలీనివాళ్లంటూ వుండరు.

'నిప్పు'లు కడిగే ఆచారం పూర్వం. 'నిప్పు' వంటివాళ్లు శీలంలో. 'అగ్ని' సాక్షిగా కట్టుకొన్న యిల్లాల్ని సుఖపెడ్తూ 'అగ్ని' పరీక్షల్లోనూ నెగ్గుకొచ్చేవాళ్లు. పచ్చి మంచి 'నీళ్లై'నా పుచ్చుకోరతిథి సపంక్తిలో లేందే. నివురు గప్పిన 'నిప్పు' లానున్నా రొక్కరిద్దరక్కడక్కడా నూటికీ కోటికీను. 'నిప్పు'కు చెద లంటుతుందా ఎక్కడైనా ?

'నిప్పు'కూడా పుట్ట దీకాలంలో. 'నిప్పు'లో ఉప్పు ఒక్కర్ని చూస్తే యింకోరికి. 'నిప్పు'లు కురిపిస్తా రతిథిని చూస్తే. 'నిప్పు'లు గ్రక్కే రోజులలో వచ్చా డసైనా లేకుండా 'నీళ్లి'చ్చిన పాపానా పోరు. నువ్వు 'నీళ్లు' వదిలేశా రీకాలంలో ఆచారా లన్నింటికీ. కాలం బొత్తిగా 'మండి'పోతోంది. కోడలు గృహప్రవేశం, అత్తగారు 'అగ్ని'ప్రవేశంలాంటి విందుకే.

'అగ్ని' భట్టారకుడు సర్వభక్షకుడుమాత్రం మునుపు. ఇప్పుడు కులం గోత్రంకూడా వదిలేశాడు. 'అగ్ని' హోత్రం హోమార్థం ఉండేది మునుపు బ్రాహ్మణిండ్లల్లో. ఇప్పు డింటింటా నోటనోటా 'అగ్ని'కార్యం. 'అగ్ని' ప్రవేశం చేసి సీతమ్మవారు పాతివ్రత్యం నిరూపించుకుంది. భూదేవతలు 'అగ్ని' దేవుడిద్వారా స్వర్గదేవతలకు తమ గోడు వినిపించేవారు. 'అగ్ని' సాక్ష్యాలు పనికి రావడం లే దిప్పుడు. 'నిప్పు'సోకితే బంగారు మిలమిలా మెరిసే దిప్పుడిత్తడై కూర్చుంటుంది. 'అగ్ని'దేవుడి పలుకుబడి 'మంటల్లో' కలిసింది.

'నిప్పు' దేవుడికీ శాస్తి కావల్సిందే. భగీరథప్రయత్నం చేసి తలప్రాణం తోక్కొచ్చినా మగవాళ్లకాయన పుట్టిమునిగి కొంప కూలినట్లులకడూ పలకడూ. అదే ఆడవాళ్లు చేయిచేసుకోనీ మరి. నాగస్వరం విన్న నాగుబాములా ఇంతెత్తు లేస్తాడు. అది వాళ్ల చేతి మాహాత్మ్యమో, ఆయనపక్షపాతబుద్ధో మరి. ఆయ న్నని లాభం లేదు. దేవతాకార్యంకోసం పాపం పార్వతీదేవిదగ్గిర శాపం పొందాడు. ఇనుమును బట్టి 'అగ్ని'కి సమ్మెటపెట్టు లంటారే, యిందుకే. అప్పట్నుంచీ ఆ అమ్మవారి సంతతైన స్త్రీజాతంటేనే హడలాయనకు. వంగి వంగి దండాలు పెడ్తాడు. దేవుడికూడా దెబ్బే గురువు గదండీ. ఈ అలుసు చూసుకున్నారు వాళ్లు. బాగా చన విచ్చి నెత్తికెక్కించుకోబట్టి వాళ్లు మరీ బరి తెగించి పోయ్యారు. 'అగ్గి'కి పోయినమ్మ ఆరునెల్ల వేకటితో వస్తే, 'నిప్పు'కు పోయినమ్మ నీళ్లాడే వస్తుం దిందుకే.

అగ్నిదేవు డవతారం చాలించేప్పు డొక్క కళ శేషించింది. ఆ కళే యిప్పటి 'అగ్గి' రాముళ్లు. 'నిప్పు'లు పోసుకుంటారు కళ్లల్లో వాళ్లితర్ల కలిమిని చూసి. 'నిప్పు' ఫుట్టిస్తా రిద్దరి మధ్యన ఎంతటి మిత్రులకైనా. 'నిప్పు' లో పోర్లాడిన ట్లుంటుంది వాళ్ళ కిద్దఱు సఖ్యంగా వుంటే. 'అగ్ని' దేవుడీ కళకూడా ఉపసంహరించుకొని వుంటే యెంత బావుణ్ణు. 'అగ్ని' శేషం ఉండకూడ దంటా రిందుకే.

'నిప్పు-నీళ్ళు' ఇంతకూ స్థూలదృష్టిలో బద్ధవైరంగా కనిపిస్తున్నా, సూక్ష్మంగా పరిశీలిస్తే రెంటికీ దోస్తీ జాస్తి. రెంటికీ శుద్ధిగుణం వుంది. 'నిప్పు' లు గ్రక్కుతున్నా, ఆగ్నేయాస్త్రం, వారుణాస్త్రం పోకంగానే 'నీళ్ళు' గారుతుంది. 'నిప్పు-నీళ్ళ' తోనే సృష్టి స్థితి లయాలు. 'నీళ్లా' డ్తే సృష్టి. పొయ్యిలో 'నిప్పు' రాజేస్తే స్థితి. 'నిప్పు' ల్లో బడ్తే సరేసరి లయం. 'నిప్పు' నీటిచూలి గదా!

జి. సి. వి. రమణారావు.



# విమర్శనము



## అజాతశత్రువు

రచయిత: శ్రీ చంద్రశేఖర కణ్వశ్రీ. ప్రాప్తిస్థానము: వి. వి. నాయుడు అండ్ సన్స్, నెల్లూరు. మూల్యము రూ. ౦-౧౨-౦.

బింబిసారమహారాజును అతని పుత్రుడు అజాతశత్రువు బంధించి సింహాసనమును ఆక్రమించుకొనుట, ఆ తర్వాత అజాతశత్రువుయొక్క మేనమామ యుద్ధములో అజాతశత్రువును ఓడించి బుద్ధిగరపుట ఈ నాటకపు కథావస్తువు. చరిత్రాత్మక కావ్యములను రచించుట చాలా కష్టము. ఇట్టి కావ్యవస్తువుకు సంబంధించిన చారిత్రకసంఘటన, ఆ సంఘటనలో పాల్గొనిన పాత్రలు, ఆ పాత్రల స్వభావము రచయితదృష్టిని తప్పిపోరాదు. ఈ "అజాతశత్రు" లో రచయిత మహోదాత్తపాత్రలను ప్రవేశపెట్టిరి. కాని పాత్రపోషణలో రచయిత చరిత్రనే దృష్టిలో పెట్టుకొనినట్లు కనుపడదు. "అధర్మాన్ని నిరాయుధంగా యెదుర్కొని ప్రాణాలను బలిదానం చేయడం బుద్ధభగవానుల పవిత్ర సందేశం" అని రచయిత జీవకునిచేత పలికించిరి. ఈ బుద్ధసందేశము, కథలో ఎట్టి సమస్యపట్లనైనను వర్తింపవచ్చును. కాని జీవకుని హత్యనుంచి తప్పించి "నువ్వు తక్షణం బయల్దేరిపోయి కోసలరాజుపోషణలో కొంతకాల ముండు. మహారాణి దీనికి ప్రతిఫలం త్వరలోనే అనుభవిస్తుంది. వెళ్లు. ఆలస్యం అపాయకరం" అని బుద్ధుడు జీవకునికి సలహా ఇచ్చినట్లు చిత్రింపబడినది. పైగా బుద్ధుడు పద్మావతితో జరిపిన లౌకికసంభాషణ మినహా, రక్తపాతము నరికట్టుటకు బుద్ధుడు చేసిన ప్రయత్న మేద్దియును గ్రంథములో కానరాదు. చివరకు, జరిగిన రక్తపాతమును గుణపాఠముగా స్వీకరించి జాగ్రత్తగా జీవింపుమని బుద్ధుడు బోధ చేసినట్లు చిత్రింపబడినది. బుద్ధుడు శుష్కవేదాంతమును బోధించు వ్యక్తి కాదు. నాటకములో బుద్ధుని ప్రాబల్యమే కానరాదు. పైగా బుద్ధుడు రక్తపాతము నరికట్టుటకు గట్టిగా ప్రయత్నము చేసినట్లే చిత్రింపబడలేదు.

అది అట్లుంచి, జీవకుడు మగధసామ్రాజ్యమునకు పట్టిన దురవస్థను తలచుకొనుచు ఒక ఆరామములోని సమాధిపై పడిపోయెనని నాటకములో నున్నది. ఈ సందర్భములో ప్రవేశపెట్టబడిన సీసపద్యమును జీవకుడే పాడునో, లేక ఆ పద్యము నేపథ్యమున పాడబడునో తెలియదు కాని, అట్టి విపత్సమయసహజమగు భావాతిరేకమును సూచించుట కుచితమైన పద్యము కాదది. దివ్యమాయాప్రభావుడైన దేవదేవుని సంకల్పములలో, మానవునికి కష్టము కల్గించునవి, "అమలకెంపాజ్యోతి నార్పుట, తలలెత్తు కెరటాలను కూల్చుట, సముద్రపు కడుపులో క్షారము ఉండుట, సౌఖ్యలక్ష్మీవీథుల చంచలత్వము ఉండుట" మొదలయినవా? ఈ గ్రంథమును చదివినవారికి రచయితకు సామర్థ్యము కలదని తప్పక తోచును. కాని "అజాతశత్రు" లో ఆ సామర్థ్యము దోవతప్పినది.

## ప్రతిమాదేవి

రచయిత్రులు: అయితం ఇందిరా భారతీదేవులు. ప్రాప్తిస్థానము: వి. వి. నాయుడు అండ్ సన్స్. నెల్లూరు. మూల్యము రూ. ౧-౪-౦.

ఇది ఒక చరిత్రాత్మకనవల. గుజరాతును పాలించిన అహమ్మదుషా స్త్రీలోలత్వమును, అతని భార్య ప్రతిమాదేవి శీలమును గూర్చి రచయిత్రులు నవల నల్లిరి. రచనావిధానములో క్రొత్త ఏమియును లేదు. కాని నవీన నవలారచన పోకడలను రచయిత్రులు ఆకళింపుచేసుకొనుట భవిష్యత్తులో వీరికి అత్యవసర రచనా సామగ్రి కాగలదు.

## చరిత్ర రచన

చారిత్రక వ్యాసముల సంపుటి. రచయిత: డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు. ప్రకాశకులు: వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్, ౪, మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీధి, మద్రాసు. వెల ౨ రు.

సుప్రసిద్ధచరిత్రకారులైన శ్రీ వెంకటరమణయ్యగారు అప్పుడప్పుడు వ్రాసిన అసంఖ్యాకమైన చారిత్రక వ్యాసములనుండి ఆంధ్రదేశమునకును, దక్షిణభారతమునకును సంబంధించినవానిని ప్రత్యేకముగా ఏరి, చరిత్రరచనావిధానమును విద్యార్థులకును, జిజ్ఞాసువులకును శాస్త్రీయమార్గమున బోధించు గ్రంథములు లేని లోటును తీర్చుటకై చారిత్రక కాలానుక్రమముగా కూర్చి ప్రకటించిన సంపుటమిది. ఇందలి వ్యాసములన్నియు ఇతఃపూర్వము భారతిలో ప్రకటితమైనవే. ఇవి చారిత్రక సామగ్రిని, చరిత్రరచనావిధానములను, చరిత్రను పునర్నిర్మించవలసిన విధములను విశదీకరించునవై యున్నవి.

---

## రాష్ట్రపతి డాక్టరు పట్టాభి

బుఱ్ఱకథ. రచయిత: ప్రయాగ నరసింహశాస్త్రి గారు, బి. ఏ., ౪, మునియప్పశెట్టివీధి, కోమలేశ్వరం పేట, మద్రాసు ౨. వెల ౪ అ.

నేటి ఆంధ్రమహాపురుషులలో అగ్రగణ్యులైన రాష్ట్రపతి డాక్టరు పట్టాభిగారు ఆంధ్రుల ఔన్నత్యానికి ఒనర్చిన సర్వతోముఖమైన కృషి, వారి జీవిత విశేషాలు ఇందులో రసవంతముగా కూర్చబడినవి. బుర్రకథలకు ఉండవలసిన హుంటాహుంటినడక, జిగిబిగిగల మాటలు, మన్యమన్య రసాంత హాస్యము, అన్నిటిని మించి మంచి ఆవేశము పెర బుర్రకథలలో బాగుగా కనబడుచుండును. అందుకు ఇది ప్రత్యక్ష తార్కాణము.

---

## గ్రంథ స్వీకారము

### శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

వివిధరచనల సంపుటి. కూర్పరి: వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. ప్రకాశకులు: శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయము, తిరుపతి. వెల రూ. ౧-౮-౦.

### ఆంధ్ర శబ్ద తత్త్వము

ద్వితీయభాగము. రచయిత: తాతవల్లి మిరాదారు టి. యం. శేషగిరిశాస్త్రిగారు. ప్రకాశకులు: వేదము వెంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్, ౪, మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీధి, మద్రాసు ౧. వెల రూ. ౧-౮-౦.

### కామేశ్వరి కథ

నవల. రచయిత: రాంషాగారు. ప్రకాశకులు: కళాకేళీప్రచురణాలయము, పిఠాపురము. వెల రూ. ౧-౪-౦.

### రాధారాణి

బంకించంద్రుని చిన్న నవల కనువాదము. అనువాదకులు: చాగంటి శేషయ్యగారు. ప్రకాశకులు: వేటూరి—

ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్, కవిలేశ్వరపురము, తూర్పుగోదావరిజిల్లా. వెల ౮.

### కుందమాల

దిఙ్నాగాచార్యుని సంస్కృత నాటకమున కనువాదము. అనువాదకులు: వేదము వెంకటకృష్ణశర్మగారు, ౭౭ సామిపిళ్లవీధి, మాళ, మద్రాసు. వెల ౩ రూ.

### ఇందుమతీ పరిణయము

కాళిదాసు రఘువంశములోని ౫, ౬, ౭ సర్గలందలి కథాభాగమునకు కవితారూపమైన తెనుగుసేత. అనువాదకులు: గుఱ్ఱం వెంకటసుబ్రహ్మణ్యంగారు, బి. ఏ., బి. యల్., నెల్లూరు. వెల ౧ రూ.

### యక్షప్రవాసము

పద్యకావ్యము. రచయిత: సున్నం వీరరాజకవిగారు, తుని. వెల ౮.

### అభ్యుదయ కథలు

వివిధరచయితలవి. ప్రకాశకులు: అభ్యుదయ కార్యాలయము, విజయవాడ. వెల ౧౨ అ.

### మేలిముసుగు

కథల సంపుటి. రచయిత: పి. హెచ్. యస్. భూషణ్ బాబుగారు. ప్రకాశకులు: దుర్గా బుక్ డిపో, ఒంగోలు. వెల ౮.

### ప్రణయార్పణము

ఖండకావ్యసంపుటి. రచయిత: పెమ్మరాజు లక్ష్మీపతిగారు. ప్రకాశకులు: పద్మాపబ్లికేషన్స్, ఏలూరు. వెల రూ. ౧-౮-౦

### సంసారపక్షము

ఖండకావ్యసంపుటి. రచయిత: మల్లాది శివరాం గారు, డాబా గార్డెన్సు, వాల్తేరు.

### స్వప్నసందేశము

పద్యకావ్యము. రచయిత: గోనుగుంట పున్నయ్యగారు, గుంటూరు. వెల తెలియదు.

### తండ్రీకొడుకులు

పిల్లలకని ఉద్దేశించిన పెద్ద కథ. కథతోపాటు ఇందలి రంగురంగుల చిత్రాలుకూడ పసిపిల్లలకు ఆహ్లాదము నివ్వగలిగియున్నవి. ప్రకాశకులు: చందమామ పబ్లికేషన్సు, మద్రాసు ౧. వెల ౮.





Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press· No. 7. Thambu Chetty St., G. T., Madras. Editor— S. Sambhu Prasad.